# శ్రీ శివసహస్రనామము

## వ్యాఖ్యాన సహితము



రచయిత మరియు ప్రచురణకర్త

**పవని సీతారామయ్య**

# శ్రీ శివసహస్రనామము

## వ్యాఖ్యాన సహితము

*రచయిత మరియు ప్రచురణకర్త*

**పవని సీతారామయ్య**

పవని సీతారామయ్య
''కల్పక''
30, రామానుజం వీధి
త్యాగరాయనగర్

ప్రథమ ముద్రణము. 1997;     1000 ప్రతులు



మూల్యము : రు.60

*Publisher*
**Pavani Sitaramaiah**
"Kalpaka"
30, Ramanujam Street
T Nagar
Chennai - 600 017

తిరుపతి తిరుమల దేవస్థానముల యాజమాన్యము వారు ధర్మ ప్రచారక గ్రంథ రచయితల ప్రోత్సహించు పథకమున నొసంగిన విరాళముతో ఈ గ్రంథము ముద్రితమాయినది.

ముద్రణ ·
Sri Maruthy Laser Printers
174, Peters Road, Royapettah, Chennai - 600 014.

# శివసాగరము

శైవ సిద్ధాంతము సంపూర్ణ ఆర్ష సంస్కృతీ భావ క్రమమునకు ప్రతీక ''కలౌదేవోమహేశ్వరః'' కలియుగమునకు దేవుడు మహేశ్వరుడు (కూర్మ పురాణం) శివుడు తనరూపగుణ, కార్యములచే సర్వజీవకోటిని ఆకర్షించుచున్నాడు ''శివో బ్రహ్మ, శివోవిష్ణుః శివోరుద్రః శచీపతిః శివోవహ్నిః యమశ్చైవ నిఋతిర్వరుణ శ్శివః'' (శివతత్త్వ సుధానిధి). శివుడు సర్వదేవతా స్వరూపుడు. అంతియుకాదు చరాచర జగత్తంతయు వ్యాపించి ''ఈశావాస్యమిదగ్ం సర్వం'' యుంటున్న పర బ్రహ్మము శివుడు ఏతద్వ్యస్తపరంబ్రహ్మ తద్వస్తు పరమశ్శివః శివఏవ పరంబ్రహ్మ శాశ్వతః పరమశ్శివః - శివుడు పరబ్రహ్మమే అయినను ''ఏక ఏవమహా దేవశ్చాన్యే దేవాస్తదంశజాః - ఏక ఏవ స్వప్రకృత్యా బహుధాః దృశ్యతే శివః'' (సనత్కుమార సంహిత) ''సదాశివోఽక్షరో నంత స్సర్వవ్యాపీ నిరంజనః, తేనేదంమఖిలంవ్యాప్తం జగత్స్థావర జంగమం'' - సర్వోపనిషత్తులు శివశంకర స్వరూపమును, సర్వ స్వరూపత్వమును విపులముగ వివరించియున్నవి. ''శ్రుత యశ్చపురాణాని భారతాదీనిసత్తమ శివమేవ సదాసాంబం హృదికృత్వా బ్రువంతిహి'' శివంకరుడైన సాంబశివుని హృదయమందు ధరించి, శ్రుతి, స్మృతి, పురాణములు భారతము మున్నగునవి సర్వ తాత్పర్యము శివుడనియే చెప్పుచున్నవి

''నిరస్త సమస్త దోషకళంక నిరతిశయమంగళాధారత్వంహి శివత్వం'' (శ్రీ నీలకంఠాచార్యులు) సమస్త దోషకళంక రహితుడై నిరతిశయమంగళ స్వరూపుడు. అతడు మహాయోగి; సమాధి స్థితుడు, ప్రపంచాతీత స్థితుడు ''సంసార వ్యాధి భేషజం, అనంతదుఃఖశమనం శివ ఇత్యక్షర ద్వయం'' సంసారమనువ్యాధికి పర మౌషధము, అనంతదుఃఖశమనమ్మైనది శి,వ, అను అక్షరద్వయము ''శివ ఏకో, ధ్యేయః, శివంకరః సర్వమన్య త్పరిత్యాజ్య'' (అధర్వ శిరోపనిషత్తు) = శివుడే ఏకరూపుడైన ధ్యేయతత్త్వము అతడు సుఖదాయి. ఇతరములనన్నింటిని పరత్యజించి అతనినే ఆశ్రయింపుము. వేదములకు వ్యాఖ్యానములవంటివే పురాణములు. వ్యాసభగవానుడు పదునెన్మిది మహాపురాణములను రచించెను. ''బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ వాయవీయం తథైవచ, భాగవతం నారదీయం మార్కండేయంచ కీర్తితం ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్తలింగకే వారాహంచ తథాస్కాందం వామనం కూర్మసంజ్ఞికం మాత్స్యంతత్ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్''- వీనిలో శైవ, వారాహ, మాత్స్య, భవిష్య, లింగ, బ్రహ్మాండ, మార్కండేయ, కూర్మ, వామన, స్కాందములు పది పురాణములు శివునికి సంబంధించినవి. ఇవన్నియు శివుడే పరమాత్మయనియు, అతడే మహాదేవుడనియు, ఆతడే తారణోపాయమనియు చెప్పుచున్నవి ఋగ్వేదమున రుద్రుడుగను, అందుకు భిన్నవర్ణములతో,

విభిన్నలక్షణములతోను, యజుర్వేదమున శివత్వము నొంది, ఈశాన, మహేశ్వరాది నామాంతరములఁబొంది - మహాదేవుడైనాడు వేద, ఆగమ, శాస్త్రములేగాక, శ్వేతాశ్వతరాది ఉపనిషత్తులు, నాయనారుల రచనలు, శైవ సిద్ధాంతమునకు పునాదులైనవి -

ముఖ్యముగ తిరుమూలనాయనారు రచించిన తిరుమంత్ర గ్రంధము చెప్పుకోవలసియున్నది. ఇతడు కాశ్మీర శైవ మనబడు ప్రత్యభిజ్ఞ సిద్ధాంతమును తమిళదేశమున ప్రచారము చేసెనని ప్రతీతి. ఇతడు క్రీ.శ తొమ్మిదవ శతాబ్దివాడని నమ్మకము తిరుజ్ఞాన సంబంధుడు, తిరునావుక్కరసు, సుందరమూర్తి, మాణిక్య వాచకర్ కూడ మహాశివభక్తులు - పెరియపురాణం అనునది నాయనారుల చరిత్రతో కూడినది

1 రేవణుడు 2 మరులారాధ్యుడు 3. ఏకోరామోరాధ్యుడు (ఘంటా కర్ణుడు) 4 శ్వేతాచార్యుడు 5 లకులీశాచార్యుడు 6 నీలకంఠ శివాచార్యుడు 7 ఉద్భటారాధ్యుడు 8 విశ్వారాధ్యుడు 9 వేమనారాధ్యుడు 10 శ్రీపతి పండితారాధ్యుడు 11 మంచన పండితారాధ్యుడు 12 మల్లికార్జున పండితా రాధ్యుడు. వీరందరూ శైవ సిద్ధాంతమును - తత్త్వమును బహుళరీతుల వ్యాప్తి జెందించిన శివభక్తులు

శైవము మొట్టమొదట పరిశుద్ధమై, ఎట్టిశాఖా విభేదములులేక, ఏ సిద్ధాంతములను ప్రతిపాదించక పరమశివుని పూజించుటే లక్ష్యముగా పెట్టుకొని, ఆ పూజార్చనా విధానమునే బోధించెను. కాలక్రమమున ఇది గుజరాత్‌లో పాశుపతముగ, కాశ్మీరులో త్రిక సిద్ధాంతముగ, తమిళదేశమున నాయనారులచే ప్రబోధింపబడిన విధానము, ఆంధ్ర కర్నాటక దేశములందు వీరశైవము, లింగాయతము., దక్షిణ దేశమున ఆగమోక్తముగను, ఇతరత్ర, కాపాలిక, కాలముఖ, మల్లార, అఘోరనాధ, రసేశ్వర సంప్రదాయములు కలవు. ఇందులో కొన్ని మాత్రము శ్రౌతములు; మిగిలినవి అశ్రౌతములు దండి దశనామ సన్న్యాసులు , జోగులు, జంగములు, పరమహంసలు, ఊర్ధ్వ బాహులు, ఆకాశ ముఖులు, నఖులు, గుడారులు, రుఖరులు, సుఖరులు, ఉఖరులు, కారాలింగులు, సన్న్యాసులు వీరందరూ శైవ సంప్రదాయమునకు చెందినవారే -

శైవము విశ్వవ్యాప్తమైన మతము:- భారతదేశమందేగాక, జావా, బలి, చంప, కంబోడియా దేశములకు వ్యాప్తి చెందినది వామన పురాణము ప్రకారము - ఆపస్తంబుని ముఖ్య శిష్యుడు బకుడనువాడు మధ్యధరా సముద్రమందలి ''క్రీటి'' అనుద్వీపమునకు రాజై శైవారాధనను ప్రచారముచేసెను గ్రీకు కధలలో ''బాకూస్'' అనునతడు ఇతడే. అచ్చటినుండి యూరప్ దేశమునకు వ్యాపించెను ఈజిప్టులో

శివుని హీబస్ అనియు, అతని భార్యను హీబే (శివే) అనియు, ఆసియామైనర్‌లో ''ఖేమోస్'' = క్షేమేశుడుగాను ఆరాధించెదరు

చరిత్రకందని యుగములలోనే శైవము దక్షిణ అమెరికా, మెక్సికోలకు వ్యాపించి యుండినది. బొలీవియాలో బ్రహ్మాండ కైలాస ఆలయముకలదు చైనా, జపాన్, మంగోలియా, రష్యా దేశములందు శివుడు ఆరాధ్యదైవమాయెను

బాబిలోన్ త్రవ్వకములలో లింగములు లభించెను ఈజిప్టులో, క్షేమ, హర, ఈశ్వర, శివత, శిమ సర్వేశనామములతో ఆరాధింప బడెడివాడు ఈజిప్టులోని పిరమిడ్‌ల మీద ఇంకనూ లింగ స్వరూపములుగలవట - ఐర్లండునందు చర్చిలలో శివలింగములు గుప్తపరచియుండిరి Sheile-Na-gig= (శివలింగ) అని పిలువబడెడివి. రోమన్ చక్రవర్తులు ఇంగ్లాండు మీద విజయము సాధించినపుడు శివలింగములను, స్కాట్‌లాండు, ఇంగ్లాండు కోటలలో ప్రతిష్ఠించిరి. అని భూదేవ్ ముఖర్జీతన Indian Culture and its activityలో ప్రస్తావించియున్నారు ఇటలీలో శివలింగము శిబిలిక్‌గా వ్యవహరింపబడుచున్నవి దానినే గ్రీకు భాషలో Phallus (ఫలేశుడు)గా వాడబడుచున్నవి.

శివుని కైలాస పర్వతము విశ్వమునకే మూలకేంద్రము శివుడు తాను ఆ ఆనందగిరిపై నిర్వికార, నిర్వికల్ప, నిరామయ, నిరతిశయ, ఆనందచిద్విలాసమున యుంటున్నాడు. తన దివ్యపారమార్థిక జ్యోతులను ప్రపంచమంతటా ప్రసరింపజేయుచున్నాడు-

**''తత్ప్రణమామి సదాశివలింగం''-**

సకలత్వ మతోజ్ఞేయ మీశత్వంమయి సత్వరం । యదిదం నిష్కలంస్తంభం మమబ్రహ్మాత్వబోధకం.॥లింగ లక్షణయుక్తత్వాన్మమలింగం భవేదిదం। తదిదం నిత్యమభ్యర్చ్యం యువాభ్యామత్రపుత్రకా ॥ అందుచే నేను సగుణరూపుడనగు నీశ్వరుడనని ఎరుంగవలెను. ఈ నిర్గుణ స్తంభము నాపరబ్రహ్మతత్త్వమును వ్యక్తపరచును ఇది లింగ చిహ్నములు కలిగినందున నాకు లింగమై (గుర్తుగా) యుండగలదు.

శివునకు ప్రతిమ, ప్రతీకా కారములు రెండును కలవు. మూర్తిద్వయమును పూజించుట సదాచారమే. అయితే లింగార్చనే శ్రేష్ఠము లింగార్చనాత్పరోధర్మో నాస్తినాస్తి జగత్రయే। లింగార్చనాత్పరం శ్రేష్ఠం నభూతం నభివిష్యతి. (శివతత్త్వ సుధానిధి) -

లింగమనగా - ''లీయతే గమ్యతే యత్ర యేన సర్వచరాచరం తదేవ లింగమిత్యుక్తం లింగతత్త్వ పరాయణైః'' = సర్వచరాచర సృష్టియంతయు దేనికొరకు గమించి, లయించుచున్నదో దానినే లింగమందురని లింగతత్త్వపరాయణులచే చెప్పబడును ''లయనాత్ లింగముచ్యతే'' అని సూత్రము. లింగమనగా చిహ్నము సర్వవిశ్వమునకు ఆశ్రయస్థానము లింగము లింగము గ్రుడ్డు ఆకారము గలది ఇది బ్రహ్మాండమును సూచించును. విశ్వమే లింగము శివుడే విశ్వము ఈ విశ్వము మొదట అండాకృతిలోనుండెను అది ప్రథమదశ. ఆ దశలో నామరూపాత్మక జగత్తుగోచరించదు. కానీ దానికి కారణమైన పరమేశ్వరుని ఉనికిని చాటుచున్నది లింగమునకు అండమునకును ఒకే ఆకారము దాని యందంతర్గతముగ (అండాండ; పిండాండ, బ్రహ్మాండము అందు) వ్యాపించియున్న పరమశివుని అన్వయించుటకై లింగచిహ్నమున్నది అవాఙ్మానస గోచరమైన నిర్గుణబ్రహ్మమును తెలుసుకొనుటకై ప్రథమసోపానముగా''ఆదౌబ్రహ్మత్వబుద్ధ్యర్థం నిష్కలం లింగముత్థితం'' శివుడు తన నిర్గుణత్వమున అరూపత్వమున లింగాకారమున ద్యోతకమగుచున్నాడు

లింగమనగా అనంతమైనదానిని పరిమిత రూపముల అభివ్యక్తము చేయుట అని అర్థము. అనంతమునకు ఒక సంకేతము మాత్రమే లింగము ఈ విషయమును పురాణములు, లింగావిర్భావమును కథా వస్తువుగా స్వీకరించియున్నవి

వేదములు, ఉపనిషత్తులు, శివసూత్రములు, పురాణములు ఆ పరబ్రహ్మము యొక్క సగుణనిర్గుణత్వమును వేనోళ్ల చాటుచున్నవి. సంక్షిప్తముగా వేయి నామములులో మహాభారతమందలి అనుశాసనిక పర్వమందు శ్రీకృష్ణపరమాత్మచే వివరింపబడియున్నది.

ఆ పరమేశ్వరునియందు భక్తి జనించుట సులభముకాదు. ''కోటిజన్మార్జితైః పుణ్యైః శివే భక్తిః ప్రజాయతేః'' (శివగీత 1-26; 14,40) కోటి జన్మలలో ఆర్జించిన పుణ్యఫలితముగ శివభక్తి జనించును. అంతేకాదు. ''అన్యాని శైవకర్మాణి కరోతి నకరోతివా। శివనామజపేద్యస్తు సర్వదా ముచ్యతేతుసః॥ శివగీత (16-23) ఇతర శివకర్మల గావించినను, లేకున్నను శివనామజపము మాత్రము జేసినచో అభీష్ట సిద్ధియు మోక్షప్రాప్తియు కలుగును.

**పవని వేణుగోపాల్,**

తిరుపతి.

# శ్రీ శివ సహస్రనామ స్తోత్రమ్

ప్రాచీన వాఙ్మయంలో భారతమును మించిన ఇతిహాసం లేదు. దీనికి జయమనే నామాంతరమున్నది. 'జయత్యనేన సంసారమితి జయోగ్రంధః' అని శ్రీధరులు నిర్వచించారు. దీనివలన సంసారమును జయించగలమని అర్థం. ఇతిహాసమంటే పురుషార్థములను కలిగించే పూర్వరాజుల చరిత్ర భారతం ఇతిహాసము మాత్రమే కాదు, పంచమ వేదము 'వేదోఖిలో ధర్మమూలం' ధర్మమునకు మూలము వేదము ఆ వేదము ఇందు ప్రతిబింబించినది కనుక ఇది పంచమ వేదము.

ధర్మమూలం జగత్సర్వం

ధర్మశ్చ శ్రుతి మూలకః

భారతం పంచమో వేదః

శ్రుతి సర్వస్వ విస్తరః

సర్వశ్రుతి సమూహ సర్వస్వమే భారతం.

భారతంలో ఎన్నో కథలు, ఎన్నో ఉపాఖ్యానాలు, అనుశాసనాలు, గీత, అనుగీత, ఉత్తరగీత సనత్సు జాతీయము, కొల్లలుకొల్లలుగా వున్నాయి ఇవేకాక విష్ణు సహస్రనామము, శివ సహస్రనామము భారతంలో వచ్చే స్తోత్రరాజములే. ''యదిహాస్తి తదన్యత్ర యన్నే హాస్తి నతత్క్వచిత్''. ఇందులో లేనిదేదీ లేదని ప్రసిద్ధి చెందిన గ్రంథం భారతం.

ఒక వస్తువును నిర్దేశించాలంటే మనకొక పదం అవసరమరమౌతుంది. అదే పేరు, నామము. దేవుడు నిజంగా ఊరు పేరు లేనివాడు ''ఇందు గలడందు లేడని' చెప్పలేనివాడు దేవుడు అతడు విష్ణువు. సర్వత్రా వ్యాపించినవాడు. వేదాలు అతనిని సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్ - అని కీర్తించినవి. వేయితలలు, వేయికండ్లు, వేయి పాదాలు కలవాడు పురుషుడు పేరులేనివానికి ఎన్ని పేర్లైనా చెప్పవచ్చును అందుకే ఇన్ని సహస్రనామాలు ఏర్పడినవి. ''యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః'' - గౌణ సంబంధముచేత ప్రసిద్ధములైన ఈ నామములు దేవతలచేత, ఋషులచేత, మహాత్ములచేత కీర్తింపబడినవి. భగవంతుడు మహాయశుడు, ''యస్యనామ మహద్యశః'' శివాయ విష్ణురూపాయ. శివుడనినా విష్ణువనినా పరతత్త్వమేమో ఒకటే.

'ఏష సర్వేశ్వరః' అని శ్రుతి నిత్యానిత్య పదార్థ సంజాతములన్నిటికీ అతడు ఉత్పత్తి వినాశకారి సంహార సమయమున సంహరించుటచేత శర్వుడు. పుట్టుక చావు

లేక స్థిరముగా నుండుటచేత స్థాణువు సకల కార్యములయందు దక్షుడు కావున ప్రభువు. ప్రపంచమునకు అధిష్ఠానమైనందున భర్త. ''ఏకోదేవః సర్వభూతేషు గూఢః'' ''ఏకో ఏవ రుద్రో నద్వితీయాయతస్థే'' - అతడు అద్వితీయుడు సర్వభూతాధివాసుడు, సాక్షి, కర్మాధ్యక్షుడు, ఆత్మ, బుద్ధి ప్రకాశములను కోరే ముముక్షువులు అతనినే ఆశ్రయించాలి.

ఇట్టి రుద్రుని, శివశంకరుడైన శివుని సహస్ర నామాలు మహాభారతంలోఅను శాసనిక పర్వంలో వ్యాసాచార్యులు నిబంధించారు. భీష్ముని అనురోధం చేత శ్రీకృష్ణుడు ఈ నామాలను యుధిష్ఠిరునికి ఉపదేశించాడు. బ్రహ్మ ప్రప్రథమం తండ్రికి ఈ సహస్రనామాలు ఉపదేశించగా - మహతా తపసాప్రాప్తం తండీనా బ్రహ్మసద్మని - తండిద్వారా స్వర్గలోకానికి ఈ నామములు సంప్రాప్తించి, తదుపరి ఉపమన్యునిద్వారా భూలోకమున అవతరించింది శుక్రుడు, గౌతముడు, వైవస్వత మనువు, నాచికేతుడు, యముడు, మార్కండేయుడు మొదలైన మహనీయు లందరూ శివసహస్రనామ ప్రాపకులే

ధ్యానమనినా, యోగమనినా, జ్ఞానమనినా అన్నీ ఈ శివ సహస్రనామాలే ఈ నామములు మంగళకరములు, పావనములు రక్షోఘ్నములు ఈ నామములను జపించే భక్తుడు అంత్యకాలంలో పరమగతిని పొందుతాడు. దీనికి స్తవరాజమనిపేరు పతంజలి 'తజ్జపం తదర్థ భావనం' అని ఆదేశించాడు. దేనిని చదివినా తెలుసుకొని చదవాలి ఏ పనిచేసినా తెలిసి చేయాలి 'జ్ఞాత్వాకర్మాణి కుర్వీత' అని పెద్దలు చెప్పారు. 'సర్వభూతాత్మ భూతస్య హర స్యామిత తేజసః / అష్టోత్తర సహస్రంతు నామ్నాం సర్వస్యమేశృణు' అని ఈ సహస్రనామాలు ప్రారంభింపబడినవి. ఈ పారాయణా ఫలమేమి? ''యచ్ఛ్రుత్వా మనుజవ్యాఘ్ర సర్వాన్ కామానవాప్స్యసి''. దీని శ్రవణ ఫలము సర్వకామ సిద్ధి.

ఈ సహస్రనామాలకు సంస్కృతంలో నీలకంఠుల వ్యాఖ్య వున్నది. తమిళభాషలో రామకృష్ణ మిషన్‌కు చెందిన కీ శే. శ్రీ అన్నా సుబ్రమణ్యంగారి వ్యాఖ్య వున్నది. తెలుగు వారికి ఈ సహస్రనామాలు సార్థకంగా వుండాలని ఈపుస్తకం రచింపబడినది సందర్భానుసారముగా తెలుగు కవులైన పోతన, శ్రీనాధుడు, ధూర్జటి రచనల నుండి ఉదాహరణలు గ్రహింపబడ్డవి. శ్రీ జ్ఞాన ప్రసూనాంబా సమేత శ్రీ కాళహస్తీశ్వరుని అనుగ్రహం అందరికీ కలుగుగాక.

**M.V.B.S. Sarma**
**Bombay**

# తొలి పలుకు

శ్రీ వేదవ్యాసమహర్షి వేదములను క్రోడీకరించి, పంచమవేదమని ప్రసిద్ధిగాంచిన మహాభారతమును రచించి అష్టాదశ పురాణములను వ్రాసి ఆచంద్రార్క-కీర్తిని గడించెను. మహాభారతమందలి ఆణిముత్యాలు భగవద్గీత, శివసహస్రనామం, విష్ణుసహస్రనామం భారతయుద్ధానికి పూర్వరంగంగా భీష్మద్రోణాదులగాంచి కింకర్తవ్య మూఢుడైన అర్జునుని యుద్ధోన్ముఖుని గావించుటకు శ్రీకృష్ణుడు ప్రసాదించిన దివ్యసందేశం భగవద్గీత. యుద్ధానంతరం ధర్మజుడు శ్రీ కృష్ణునితో భీష్మ పితామహుని సమీపించి శివసహస్రనామముల సెలవియ్యమని గోరగా భీష్ముడు తన అసమర్థతను దెల్పి, శివదీక్షబడసిన శ్రీ కృష్ణునిచే ఆ నామములను వల్లింపజేసెను పిదప విష్ణుసహస్రనామములను భీష్ముడు బలికెను. శ్రీ శంకర భగవత్పాదుల సందేశవాక్యం ''గేయం గీతానామసహస్రం'' గీతలోని 700 శ్లోకాలను బాగుగా అర్థం చేసుకొని, ఆయా యోగాలను ఆచరించుట మహాకష్టం కాని నామస్మరణ సులభమైన తరుణోపాయం

ఈ శివ సహస్రనామాలు పరమపావనమైనవి. బ్రహ్మలోకంలో అవతరించి తండి మహర్షివలన భూలోకమున వ్యాప్తిచెంది పరంపరాగతంగా ఉపమన్యుమహర్షికి ప్రాప్తించినవి. ఆ మహర్షి పుత్రార్థియైన శ్రీకృష్ణునకు శివదీక్షనొసంగి ఈ నామములను వాని మహిమలను దెలిపెను తద్వారా శ్రీకృష్ణునకు సాంబుడను పుత్రుడు కలిగెను ఇట్లు యీ నామసహస్రం బ్రహ్మప్రోక్తములు, ఋషిప్రోక్తములు.

శివుని రూపము ఇంతింతయని నిర్ణయింప నెవరికి సాధ్యమగును? బ్రహ్మాండవ్యాప్త దేహుడైన ఆ పరమేశ్వరుని ఆద్యంతముల కనుగొన ప్రయత్నించి బ్రహ్మవిష్ణువులే విఫలులైరి. అట్లయ్యును అతడు ఆబాల గోపాల విదితుడు. భక్తానుగ్రహమునకై ఆ మహాదేవుడు అర్ధనారీశ్వర, దక్షిణామూర్తి, సోమస్కంద, నటరాజ, సుందరేశ్వర, వైద్యనాథాది రూపములలో దర్శనమొసగుచున్నాడు. సర్వేశ్వరుని సహస్రనామాలలో దేవతల పేర్లు, మనుష్యుల పేర్లు, చెట్ల పేర్లు, గుట్టల పేర్లు, పంచభూతాల పేర్లు గలవు. ఆ పాతాళ నభాంతరములు వ్యాపించి ''ఈశావాస్య మిదం సర్వం'' గా అన్ని రూపములు తన రూపమైన వానికి చిహ్నముగా శివలింగము ఆవిర్భవించి ఆరాధ్యదైవమాయెను లింగము శివుని వ్యక్తావ్యక్త స్వరూపం ఇట్టి లింగములు ప్రధానమూర్తిగా గల ఆలయములనేకములు ఉత్తరమున కాశ్మీరము కేదారము, నేపాళముల నుండి దక్షిణమున రామేశ్వరము, కన్యాకుబ్జము వరకును, తూర్పున కలకత్తా భువనేశ్వరములనుండి పశ్చిమమున సోమనాథము ఎలిఫెంటా వరకును ప్రాచీనయుగములందే నిర్మించబడినవి. అందు కొన్ని స్వయంభువములు,

కొన్ని జ్యోతిర్లింగములు, కొన్ని పంచభూతలింగములు, మరికొన్ని నవగ్రహములకు సంబంధించినవి. తత్ప్రణమామి సదా శివలింగం.

''స సర్వనామా స హి విశ్వరూపః'', అన్నట్లు అన్ని రూపాలు ఆయనవే అన్ని నామాలు ఆయనవే. బ్రహ్మదేవుడు స్తుతించుచుండిన పదివేల నామములను గాలించి గాలించి తండి మహర్షి సారవంతములగు వేయి నామముల నేరుకొనెను సదాశివుడీ సహస్రనామాల్లో సహస్రధారగా సాక్షాత్కారిస్తాడు దేవతలు, ఋషులు పలికిన యీ నామములలో ఎంతో మాహాత్మ్యం ఉంది. ఒక్కొక్క నామం ఒక్కొక్క మంత్రం. మననం చేయగా, చేయగా మంత్రసిద్ధి అభీష్టసిద్ధి కలుగుతుంది పరమాత్మను పిలిచేందుకు ప్రణవం సంబోధం అంటారు. 'ఓం' అని పిలిస్తే పరమాత్ముడు పలుకుతాడట. అందుచేతనే '' ంకార మంత్ర సంయుక్తం నిత్యం ధ్యాయంతి యోగినః'', అంటే యోగులు ఓంకార పూర్వముగా యీ మంత్రాలను పఠించి ఈశ్వరుని ధ్యానిస్తారు ప్రతి నామంలో ఎంతో అర్థం ఇమిడివుంది. అందలి పరమార్థాన్ని అవగాహన చేసుకునేందుకు నిర్మలమైన మనస్సు అనన్యమైన భక్తి, శ్రీ జ్ఞానాంబిక అనుగ్రహం కావాలి (ఆ పరదేవత అనుగ్రహించినంతవరకే ఈ వ్యాఖ్య వ్రాయబడినది). సహస్రనామంలోని ప్రతినామానికి అర్థం తెలియకపోయినా స్పష్టంగా ఉచ్చరించగలిగితే చాలు. స్పష్టమైన పలుకే మంత్రం. మహాదేవుడు మంత్రాధీనుడు; భగవంతుడు భక్తివశ్యుడు, భక్తానుకంపీ భక్తానుగ్రహ కారకుడు. కావున భక్తి ప్రపత్తులతో యీ నామోచ్చారణము చేయుచు ధ్యానించుట అవశ్యము అక్షర పరబ్రహ్మమును తెలుసుకొనుట కనుగుణముగనేకదా మనకు చిన్ననాటనే ''ఓం నమః శివాయః'' అని అక్షరాభ్యాసము చేయుచున్నారు అర్థం తెలిసికొని సాధనచేయుట మరీ ఉత్తమం.

శివుడు సర్వలోక శరణ్యుడు; భక్తి సులభుడు, సర్వకామ వరదుడు. అతని కృప అన్ని వేళలందును లభ్యమగును. అందువలననే దేవతలు, దానవులు; పండితులు, పామరులు; యోగులు, జోగులు; బ్రహ్మవేత్తలు, నిషాదులు; ఆర్తులు, జిజ్ఞాసులు; అర్థార్థులు, మోక్షార్థులు ఈశ్వరుని భజించి తమ కోర్కెల నీడేర్చుకొనుచున్నారు. దేవాసుర నమస్కృతుడైన మహాదేవుడు భయంకరమగు హాలాహల విషమును తన కంఠమున దాల్చి ప్రాణికోటిని రక్షించెను. నారాయణు డతని అనుగ్రహమున సుదర్శన చక్రమును బడసెను. శివలింగమును ప్రతిష్ఠించి శ్రీరాముడు బ్రహ్మహత్యాపాతక నివృత్తి గావించుకొనెను. రుక్మిణీదేవి సనాతనులైన ఉమామహేశుల నర్చించి హ్యారిం బతిగా బడసెను. శివుని గూర్చి తపమొనరించిన శ్రీకృష్ణునకు రుక్మిణీ, జాంబవతుల వలన సంతానము గలిగెను. పశుపతి దయచే అర్జునుడు పాశుపతమును బొందెను. మహాదేవుని అనుగ్రహమున మార్కండేయుడు చిరంజీవి ఆయెను నీలకంఠుని చల్లని చూపుచే నర్కారుని కుష్ఠురోగము దొలగెను.

బోయ తిన్నని పుక్కిటినీళ్లను మహాఅభిషేకముగను, ఎంగిలి మాంసమును నవ్యోపహారముగను గ్రహించి వాని చర్మచక్షువులను గైకొని వానికి జ్ఞాననేత్రములను ప్రసాదించెను. అపరశంకరుడైన ఆదిశంకరుని దయకు పాత్రురాలైన పేదయిల్లాలి యింట కనకధారగా కాసులు కురిసెను. శివుని లీలలు విచిత్రములు తాను వల్లకాటిలో వశిస్తూ, చితాభస్మము పూసికొంటూ, రక్తసిత గజచర్మామును ధరిస్తూ, కపాలంలో భిక్షాన్నం తినుచూ, తన భక్తులకు మణిమయ సౌధములను, పరిమళగంధములను, పట్టుపీతాంబరములను, దివ్యాభరణములను, పంచభక్ష పరమాన్నములను ప్రసాదించుచున్నాడు ఉన్మత్తునివలెను, బిచ్చగాడివలెను, దిగంబరునివలెను గోచరించినను ఆ చరాచరుడు సర్వులకు, సర్వకాలములందును సకలైశ్వర్యములనిచ్చుచున్నాడు. తనకై యేమియు నిలుపుకొనక సర్వస్వమును త్యాగము చేయు దేవుడు శివుడొక్కడే ఒక్క తుమ్మిపూవు గాని, బిల్వదళంగాని సమర్పించితే తృప్తి చెందుతాడు. ''శివ'' అను అక్షరద్వయము మంగళము అను అర్థమును దెలుపుచున్నది. అతడు మంగళమూర్తి; శ్రేయోదాయకుడు.

అట్టి శివుడు స్తవనీయుడు. శివసహస్రనామములు పుష్టివర్ధనములు. భక్తానుకంపియగు శివుని యీ నామములచే స్తుతించినను, అర్చన చేసినను, వందనము గావించినను ప్రసన్నుడగును.

తత్ఫలితముగ :-

గీ॥ ఇట్లు శివభక్తుడై యెవడీశ్వరార్చ నము బొనర్చునొ యవ్వాచి కమరు
నఖిల సిద్ధులును సకలాభీష్ట సి ద్ధులును న తండు వక్తలతోన నుత్తమత దనరు॥

క॥ రోగంబును వగపును హృద్వేగంబును గలుషములను విషమును ఋణమున్
బోగొట్టు శివసమర్చన బాగుగ గల్యాణమిచ్చి పాలించు నిలన్ ॥

ఉ॥ దారను బుత్రులన్ ధనము దార్ఢ్యము వాయువు రాజ్యలక్ష్మి వి
స్తార సుఖంబులన్ యశము స్వర్గము మోక్షము గోరువారలేన్
గూరిమి లింగపూజనము గోరి యొనర్పగ జెల్లు నట్టులె
వ్వారలు సేయకున్న నిక వానిని గానగలేరు యాధిగన్ ॥

క॥ శివ భక్తి గొనినవారలు, శివలింగము నెప్డు పూజ చేసెడు వారల్
శివునిన్ దలంచువారలు, భవదుఃఖములను దొల బాయుదు రెందున్ ॥

(శివ పురాణము)

శ్రీ శివ సహస్రనామములను ఉపమన్యుమహర్షి పుత్రార్థియైన శ్రీకృష్ణున కుపదేశించుచూ .-

''ఇదం బ్రహ్మ పురాకృత్వా సర్వలోక పితామహః ।
సర్వస్తవానాం రాజత్వే దివ్యానాం సమకల్పయత్ ॥
తదా ప్రభృతి చైవాయ మీశ్వరస్య మహాత్మనః ।
స్తవరాజ ఇతి ఖ్యాతో జగత్యమర పూజితః ॥
బ్రహ్మలోకాదయం స్వర్గే స్తవరాజోవ తారితః ।''

ఇది స్తవరాజమని ఘంటాపథముగ దెలిపెను. ఈ నామములు బహుళార్థ సాధకములు. అయినను విష్ణు, లలితా సహస్రనామములకువలెగాక శ్రీ శివసహస్ర నామములకు వ్యాఖ్యాలత్యల్పము గ గలవు. శ్రీ చతుర్ధర వంశావతంస నీలకంఠ పండితుడు రచించిన సంస్కృతవ్యాఖ్య, శ్రీరామకృష్ణమిషన్‌కు చెంది అనేక ఆధ్యాత్మిక గ్రంథముల ప్రచురించిన మద్గురు వర్యులు కీర్తిశేషులు బ్రహ్మశ్రీ 'అణ్ణా' N. సుబ్రమణ్యం గారి తమిళవ్యాఖ్య లభ్యమగుచున్నవి ఈ రెంటినీ శ్రీనాథుడు, పోతన, ధూర్జటి, ముదిగొండ నాగవీరేశ్వర కవితలు, మల్లణ, బిల్హణస్తవములు మొదలగు వానిని ఆధారముగా గొని ఈ వ్యాఖ్య రచింపబడినది. మరియు సాంప్రదాయ సిద్ధమగు శివపూజా విధానము చేర్చబడినది. త్రిలింగముగా ప్రసిద్ధి చెందిన ఆంధ్రావని యందలి శివపూజాసక్తుల ఉపయోగార్థము ఈ గ్రంథము ప్రచురింపబడుచున్నది.

**కృతజ్ఞత :**- ఈ గ్రంథ ముద్రణకు భూరి విరాళమొసగిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యము వారికి నా నమోవాకములు. ఈ గ్రంథ వ్రాతప్రతిని చక్కగా పరిశీలించి నన్నాశీర్వదించి శ్రీముఖమును ప్రసాదించిన శ్రీ శృంగేరి శారదా పీఠాధీశ్వరులు జగద్గురువులు శ్రీ భారతీ తీర్థ మహాస్వామి వారికి శిరసా వందనములు. మా మిత్రులు బ్రహ్మశ్రీయులు M.V.B.S శర్మగారు, V. రామచంద్రన్‌గారు, నా సోదరుడు పవని వేణుగోపాల్ తమ అభిప్రాయముల నందించినందులకు, శ్రీ మారుతీ లేజర్ ప్రింటర్సువారు సొంతముగ ముద్రించినందులకు నా కృతజ్ఞతలు.

**కృతి సమర్పణ :** నన్నీ కార్యమునకు ప్రేరేపించిన మా యిలవేల్పు శ్రీ జ్ఞానప్రసూనాంబా సమేత శ్రీ కాళహస్తీశ్వరస్వామి వారికి కృతి నంకితమొనరించుచున్నాను.

పవని సీతారామయ్య

ఓం

# శ్రీ శివ పూజా విధానము

**1. మంగళాచరణము:-**

శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే॥

**2. ఆచమనము:-**

2 ఓం కేశవాయస్వాహా। ఓం నారాయణాయస్వాహా। ఓం మాధవాయస్వాహా! (నీరు చేతిలో పోసికొని ఆచమనము చేయవలెను తర్వాత ఈ క్రింది మంత్రములు చెప్పవలయును )

ఓం గోవిందాయనమః । ఓం విష్ణవేనమః । ఓం మధుసూదనాయనమః ఓం త్రివిక్రమాయనమః । ఓం వామనాయనమః । ఓం శ్రీధరాయనమః ఓం హృషీకేశాయ నమః । ఓం పద్మనాభాయ నమః । ఓం దామోదరాయనమః । ఓం సంకర్షణాయ నమః । ఓం వాసుదేవాయ నమః । ఓం ప్రద్యుమ్నాయ నమః । ఓం అనిరుద్ధాయ నమః । ఓం పురుషోత్తమాయ నమః । ఓం అధోక్షజాయ నమః । ఓం నారసింహాయ నమః । ఓం అచ్యుతాయ నమః । ఓం జనార్ధనాయ నమః । ఓం ఉపేంద్రాయ నమః । ఓం హరయే నమః । ఓం శ్రీ కృష్ణాయ నమః ॥

**3. భూతోచ్చాటనము:**

''ఉత్తిష్ఠంతు భూతః పిశాచాః । యేతే భూమి భారకాః । ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే''-

(నీటిని అన్ని ప్రక్కల చల్లవలెను):-

**4. ప్రాణాయామము :-**

ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం । ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్యధీమహి, ధియో యోనః ప్రచోదయాత్ ॥ ఓ మాపోజ్యోతీరసో మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥

**5. సంకల్పము :-**

మమ ఉపాత్త సమస్త దురిత క్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే, శోభన ముహూర్తే, శ్రీ శివ శంభోరాజ్ఞయా (శ్రీ మహావిష్ణో రాజ్ఞయా)

ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ప్రదేశే.... మధ్యదేశే, సమస్త దేవతా బ్రాహ్మణ హరిహర గురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమానేన, వ్యావహారిక చాంద్రమానేన . నామ సంవత్సరే .. ఆయనే . ఋతౌ, మాసే . పక్షే... తిధే. వాసరే శుభ నక్షత్రే శుభయోగే; శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌమమ ఉపాత్త సమస్త దురిత క్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శ్రీ గోత్రః . ... నామధేయః ( ధర్మపత్నీ సమేతః) మమ సకుటుంబస్య క్షేమ స్థైర్య విజయ, అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృధ్యర్థం, ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం, లోక కళ్యాణార్థం - శివపూజా మహం కరిష్యే ॥

6 ఆ బ్రహ్మ లోకాదా శేషా - దాలోకా లోక పర్వతాత్ ।
యేవసన్తి ద్విజా దేవా స్తేభ్యో నిత్యం నమో నమః ॥

**7. ఆసన పూజ :-**

ఆసన మంత్రస్య । పృధివ్యా మేరు పృష్ఠ ఋషిః ।
సుతల చ్ఛందః । కూర్మో దేవతా ॥ పృధ్వీ త్వయా
ధృతా లోకా దేవీ స్త్వం విష్ణునా ధృతా । స్త్వం చ
ధారయ మాం దేవి పవిత్రం చాసనం కురు ॥

**8. గురుస్తుతిః-**

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

9 గుం గురుభ్యోనమః । గం గణపతయే నమః ।
దుం దుర్గాయై నమః । సం సరస్వత్యై నమః ।
మం. మహాలక్ష్మై నమః । క్షం: క్షేత్ర పాలకాయ నమః ।
పం పరమాత్మనే నమః ॥

**10. ఘంటాపూజః-**

ఓం జయధ్వని మంత్రమాతః స్వాహా ॥
ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం ।
ఘంటారవం కరోమ్యాదౌ దేవతాహ్వాన కారణం ॥
ఘంటా నాదం కృత్వా ॥

**11. పంచాక్షర జపం:-**

యథాశక్తి శివ పంచాక్షరి జపింపవలెను. లేక నాగేంద్రహారాది శ్లోకములను పఠించునది
ఆదౌ నిర్విఘ్న పరి సమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే - తదంగ

**12. కలశపూజ:-**

(కలశములో గంధ, పుష్ప, అక్షతలువేసి కలశమును చేతితో మూసి)

కలశస్య ముఖే విష్ణుః, కంఠే రుద్రస్స మాశ్రితః । మూలే తత్రస్థితో బ్రహ్మ, మధ్యే మాతృగణా స్మృతాః ॥- కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపావసుంధరా । ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః । అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః ॥ గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి । నర్మదే సింధుకావేరి జలేస్మిన్ సన్నిధిం కురు -

కావేరి తుంగభద్రాచ, కృష్ణవేణ్యాచ గౌతమీ
భాగీరథీతి విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః ॥

ఆ కలశేషుదావతి పవిత్రే పరిషిచ్యతే ఉత్తైర్యజ్ఞేషు వర్తతే-

ఆపోవా ఇదగ్ంసర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః పశవ ఆపోఽన్న మాపో, ఽమృతమాప, స్సమ్రాడాపో, విరాడాపస్స్వరాడాప, శ్చందాగ్ంస్యాపో, జ్యోతిగ్ం ష్యాపో, యజూగ్ష్యాపస్సత్య మాపస్సర్వాదేవతా ఆపో భూర్భువస్సువరాప ఓమ్ ॥-

**13. శంఖ పూజ:-**

(కలశోదకేన శంఖం పూరయిత్వా)
త్వం పురా సాగరోత్పన్నో విష్ణునా విధృతః కరే ।
దేవైశ్చ పూజితః సర్వైః పాంచజన్య నమోస్తుతే ॥

(శంఖ జలేన పూజోపకరణాని ద్రవ్యాణి ఆత్మానంచ త్రిఃప్రోక్ష్య ॥ పునః శంఖం పూరయిత్వా)

**14. గణపతి పూజ**

ఓం గణానాంత్వా గణపతిగ్ం హవామహే । కవింకవీనా ముపమశ్రవస్తమం । జ్యేష్ఠరాజం బ్రహ్మణో బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనం ॥ (అక్షత లుంచుతూ) ఓం శ్రీ మహాగణాధిపతయే నమః, ధ్యాయామి - తత్పురు షాయ విద్మహే, వక్రతుండాయధీమహి, తన్నోదంతిః ప్రచోదయాత్, ఆవాహ యామి. సువర్ణ రత్న ఖచిత సింహాసనం సమర్పయామి - (జలము చల్లుచూ) పాదయోః

పాద్యం సమర్పయామి - హస్తయోః అర్ఘ్యం సమర్పయామి ముఖే ఆచమనీయం సమర్పయామి - స్నాపయామి. ఓం ఆపోహిష్ఠామయోభువస్తాన ఊర్జేదధాతన మహేరణాయ చక్షసే । యోవశ్శివ తమోరసః । తస్యభాజయతేహనః । ఉశతీరివ మాతరః । తస్మాఅరజ్గమామవో యస్యక్షయాయ జిన్వధ ఆపోజనయధాచనః ॥ శ్రీ మహాగణాధిపతయే నమః । శుద్ధోదక స్నానం సమర్పయామి ॥-

(వస్త్రము కప్పుచూ) అభివస్త్రా సువసనా ఋషాభిధేనూస్సుదు ఘాః పూయమానాః అభిచంద్రా భర్తదేనో హిరణ్యాభ్యశ్వాః రధినో దేవసోమ ॥- శ్రీ మహాగణాధిపతయే నమః వస్త్రయుగ్మం సమర్పయామి ॥

(యజ్ఞోపవీతము వేయుచూ) యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ । ఆయుష్య మగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తుతేజః । శ్రీ మహాగణాధిపతయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి ॥-

(గంధం పూయుచూ) గన్ధద్వారా దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం । ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥ శ్రీ మహాగణాధి పతయే నమః ॥ దివ్య శ్రీగంధం సమర్పయామి ॥ గంధస్యోపరి అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి ॥

(దూర్వము (గరిక) తో అక్షతలతో పూజించుచూ)

ఆయనేతే పరాయణేతే దూర్వారోహన్తు పుష్పిణీః । హ్రదాశ్చపుండరీకాణి సముద్రశ్చ గృహాఇమే.- శ్రీ మహా గణాధిపతయే నమః ॥ దూర్వాయుగ్మం సమర్పయామి ॥

(పుష్పములతో పూజించుచూ) ఓం సుముఖాయనమః, ఓం ఏకదన్తాయ నమః, ఓం కపిలాయ నమః. ఓం గజకర్ణకాయనమః, ఓం లంబోదరాయ నమః, ఓం వికటాయ నమః, ఓం విఘ్నరాజాయ నమః, ఓం గణాధిపాయ నమః, ఓం ధూమకేతవే నమః, ఒం గణాధ్యక్షాయ నమః, ఓం ఫాలచంద్రాయ నమః ఓం గజాననాయ నమః. ఓం వక్రతుండాయ నమః, ఓం శూర్పకర్ణాయ నమః, ఓం హేరంబాయ నమః, ఓం స్కందపూర్వజాయ నమః, ఓం సర్వసిద్ధి ప్రదాయకాయ నమః ॥ ఓం మహా గణాధిపతయే నమః ॥ నానావిధ పరిమళ పుష్పాణి పూజయామిః -

(అగరువత్తులు వెలిగించుచూ) ''వనస్పత్యుర్భవైర్దివ్యైర్నానా గంధైస్సు సంయుతం, ఆఘ్రేయస్సర్వదేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతామ్'' శ్రీ మహా గణాధిపతయే నమః । ధూపమాఘ్రాపయామి ॥

(దీపము వెలిగించుచూ) ''సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం ప్రియం । గృహాణమంగళం దీపం త్రైలోక్య తిమిరాపహ ॥ భక్త్యాదీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే । త్రాహిమాన్నరకాద్ఘోరాః దివ్యజ్యోతిర్నమోస్తుతే ॥ శ్రీ మహాగణాధిపతయే నమః ॥ దీపం దర్శయామి ॥ ధూప దీపానంతరం ఆచమనీయం సమర్పయామి.

(నివేదన చేయుచూ) ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్ । సత్యంత్వర్తేన పరిషించామి అమృతమస్తు అమృతోపస్తరణమసి ॥ - ఓం ప్రాణాయస్వాహా ॥ ఓం అపానాయస్వాహా । ఓం వ్యానాయస్వాహా । ఓం ఉదానాయస్వాహా ॥ ఓం సమానాయస్వాహా ॥ శ్రీమహాగణాధిపతయే నమః.. .. నైవేద్యం సమర్పయామి ॥

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి - అమృతాపిధానమసి ॥ ఉత్తరాపోశనం సమర్పయామి । హస్తౌ ప్రక్షాళయామి । పాదౌప్రక్షాళయామి - శుద్ధాచమనీయం సమర్పయామి.

(తాంబూలము సమర్పించుచూ) పూగీఫలైస్స కర్పూరై ర్నాగ వల్లీదళైర్యుతం ముక్తా చూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం ॥

శ్రీ మహాగణాధిపతియే నమః తాంబూలం సమర్పయామి. ॥

(నీరాజనం, శివపూజ తర్వాతనే, ఇవ్వవలెను.)

(అభివాదము చేయుచూ) సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః లంబోదరశ్చవికటో విఘ్నరాజో గణాధిపః, ధూమకేతుర్గణాధ్యక్షో ఫాలచంద్రో గజాననః వక్రతుండ శ్శూర్పకర్ణః హేరంబః స్కందపూర్వజః షోడశైతానినామాని యః పఠేచ్ఛృణుయాదపి, విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమేతథా, సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్యనజాయతే ॥ శ్రీ మహాగణాధిపతియే నమః ॥ సువర్ణదివ్య మంత్ర పుష్పం సమర్పయామి ॥ యస్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు । న్యూనం సంపూర్ణతాంయాతి సద్యోవందే గణాధిపమ్ ॥ మంత్రహీనం క్రియాహీనం, భక్తిహీనం గణాధిప । యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥ అనయాధ్యాన ఆవాహనాది షోడ శోపచార పూజాయా భగవాన్ సర్వాత్మకః శ్రీ గణాదిపతిః సుప్రీతః సుప్రసన్నః వరదో భవతు । ఉత్తరే శుభకర్మణి అవిఘ్నమస్తు. ఇతి భవన్తో బ్రువంతు ॥

(సదస్యులు) ఉత్తరే శుభకర్మణి అవిఘ్నమస్తు శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసాగృహ్ణామిః-

**15. ఆత్మ పూజ:-**

ఆత్మనేనమః ॥ దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవః సనాతనః ।
త్యజే దజ్ఞాన నిర్మాల్యం సోహం భావేన పూజయేత్ ॥

ఆగాధయామి మణిసన్నిభ మాత్మలింగం ।
మాయాపురీ హృదయ పంకజ సన్నివిష్టం ।
శ్రద్ధానదీ విమల చిత్తజలాభిషేకై
ర్నిత్యం సమాధికుసుమై ర్న పునర్భవాయ ॥

**16. పీఠ పూజ:-**

ఓం నమో భగవతే సకల గుణాత్మ శక్తి యుక్తాయ
అనంతాయ యోగపీఠాత్మనే నమః । ఆధార శక్త్యై
నమః । మూల ప్రకృత్యై నమః । ఆది వరాహాయ
నమః । ఆది కూర్మాయ నమః । అనంతాయ నమః ।
పృధివ్యై నమః । ఆదిత్యాది నవగ్రహ దేవతాభ్యో
నమః । దశదిక్పాలే భ్యో నమః ॥

**17. జప సంకల్పము**

శ్రీ భవానీ శంకరస్వామి దేవత, హ్రాం బీజం, హ్రీం శక్తిః హ్రూం కీలకం మమభవానీ శంకరస్వామి ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః -

**18. అథ కరన్యాస:**

1. ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ· సర్వజ్ఞాయ అంగుష్టాభ్యాం నమః
2. ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ: సర్వతృప్తాయ తర్జనీభ్యాం నమః
3. ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ నిత్యమలుప్తశక్తయే మధ్యమాభ్యాం నమః
4. ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ· సర్వజ్ఞాన శక్తయే అనామికాభ్యాం నమః
5. ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ నిత్యానందశక్తయే కనిష్టికాభ్యాం నమః
6 ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ అనంతశక్తి శివాయ కరతల కర పృష్టాభ్యాం నమః

**19. అథహృదయాదిన్యాస:**

1. ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ సర్వజ్ఞాయ హృదయాయనమః
2. ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ సర్వతృప్తాయ శిరసేస్వాహా

3 ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ నిత్యమలుప్త శక్తయే - శిఖాయై వషట్
4. ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ సర్వజ్ఞాన శక్తయే కవచాయహుం
5. ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ నిత్యానందశక్తయే నేత్రత్రయాయ వౌషట్
6. ఓం హ్రీం హ్రౌం ఓం శివాయ అనంతశక్తి శివాయ అస్త్రాయ ఫట్
భూర్భువ స్సువరోం ఇతి దిగ్బంధః ॥

**20. ధ్యానము:-**

(I) మంగళాయతనం దేవం యువానమతి సుందరం ।
ధ్యాయేత్ కల్పతరో ర్మూలే సుఖాసీనం సహోమయా ।
నమోఽస్తు స్థాణు రూపాయ జ్యోతిర్లింగామృతాత్మనే ।
చతుర్మూర్తి వపుస్థాయ భాసితాంగాయ శంభవే ॥

(II) శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం ।
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం దక్షభాగేవహన్తం ।
నాగం పాశంచ ఘంటాం ప్రళయ హుతవహంవసాంకుశం వామభాగే ।
నానాలంకారయుక్తం స్ఫటికమణి నిభం పార్వతీశం నమామి ॥-

ఓం నమో భగవతే రుద్రాయ । శ్రీ రుద్ర మంత్రైః మహా పూజాం కరిష్యే ॥

**21. ఆవాహనము :-**

స్వామిన్ సర్వజగన్నాథ । యావత్పూజావసానకం తావత్త్వం ప్రీతి భావేన లింగేస్మిన్ సన్నిధింకురు ॥ - త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం ఉర్వారుక మివబంధనామృత్యోర్ముక్షీయ మామృతాత్:-

స్వాత్మసంస్థ మజం నిత్యం త్వామద్య పరమేశ్వర ।
అరణ్యాఇవ హవ్యాశం మూర్తా - వావాహయా మ్యహం ॥

హృత్పద్మ కర్ణికా - మధ్యా - దుమయా సహ శంకర ।
ఆగచ్ఛత్వం మహాదేవ సర్వై రావరణై సహ ॥

సద్యోజాతం ప్రపద్యామి ॥ సహస్ర శీర్షాపురుషః । సహస్రాక్షః సహస్రపాత్ స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగులం ॥ **నమస్తే రుద్రమన్యవ ఉతోత ఇషవే నమః నమస్తే అస్తుధన్వనే బాహుభ్యాముతతేనమః ॥** శ్రీ భవానీ శంకర స్వామినే నమః । అస్మిన్ లింగే సపరివారం సాంబ పరమేశ్వర మావాహయామి ॥

**22. ఆసనము :-**

సద్యోజాతాయవై నమోనమః ॥ పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యం ఉతామృతత్వస్యేశానః యదన్నేనాతిరోహతి ॥ **యాత**

**ఇషుశ్శివతమా శివం బభూవతేధనుః శివాశరవ్యాయయా తవతయానో** రుద్రమృడయ ॥ శ్రీ భవానీ శంకరస్వామినే నమః । నవరత్న ఖచిత సింహాసనం సమర్పయామి ॥-

**23. పాద్యం :-**

భవే భవే నాతి ॥ ఏతావానస్యమహిమా । అతోజాయగ్ంశ్చ పూరుషః పాదోఽస్య విశ్వాభూతాని । త్రిపాదస్యాఽమృతం దిపి ॥

**యాతే** రుద్ర **శివాతనూ రఘోరాపాపనాశినీ తయానస్తనువా శన్తమయా గిరిశన్తాభి చాకశీహి** ॥ - శ్రీ భవానీ శంకరస్వామినే నమః । పాదయోః - పాద్యం సమర్పయామి -

**24. అర్ఘ్యం :-**

భవే భవ స్వమాం ॥ త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః । పాదో స్యేహా భవాత్పునః । తతో విష్వఙ్వ్యక్రామాత్ । సాశనానశనే అభి ॥ **యామిషుం గిరిశన్తహస్తే బిభర్ష్యస్తవే శివాంగిరిత్రతాం కురుమాహిగ్ంసీః పురుషం జగత్** ॥ - శ్రీ భవానీశంకర స్వామినే నమః । హస్తయోః అర్ఘ్యం సమర్పయామి: ॥

**25. ఆచమనీయం :-**

భవోద్భవాయ నమః ॥ తస్మాద్విరాడజాయత । విరాజో అధిపూరుషః । సజాతో అత్యరిచ్యత । పశ్చాద్భూమిమథోపురః ॥ **శివేన వచసాత్వా గిరిశాచ్ఛావదా మసి యథానస్సర్వ మిజ్జగద యక్ష్మగ్ం సుమనా అసత్** ॥ శ్రీ భవానీ శంకరస్వామినే నమః । ఆచమనీయం సమర్పయామి ॥

**26. మధుపర్కం :-**

యత్పురుషేణ హవిషా । దేవాయజ్ఞమతన్వత । వసంతో అస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మ శరద్ధవిః ॥ శ్రీభవానీ శంకరస్వామినే నమః । మధుపర్కం సమర్పయామి ॥

**27. స్నానం :-**

వామదేవాయ నమః ॥ సప్తాస్యా సన్పరిధయః త్రిస్సప్త సమిధః కృతాః। దేవా యద్యజ్ఞం తన్వానాః । అబధ్నన్ పురుషం పశుమ్ ॥ **అధ్యవోచదధివక్తా ప్రథమో దైవ్యోభిషక్ ఆహీగ్ంశ్చ సర్వాన్ జంభయన్ సర్వాశ్చయాతు ధాన్యః** ॥

తీర్థోదకైః కాంచనకుంభ సంస్థైస్సువాసితైర్దివ్యసుమంత్ర పూజితైః మయార్పితం స్నానవిధింగృహాణ పాదాబ్జ నిష్ఠ్యూత నదీ ప్రవాహః ॥

**I పంచామృత స్నానము:-**

(i) (పాలతో) ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమవృష్ణియం । భవావాజస్స సంగధే ॥ క్షీరేణ స్నపయామి ॥

(ii) (పెరుగుతో) దధిక్రావణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్యవాజినః । సురభినో ముఖాకర త్ప్రణ ఆయూగ్ంషి తారిషత్ ॥ దధ్నా స్నపయామి ॥-

(iii) (నేతితో) శుక్రమసి, జ్యోతిరసి దేవోవస్సవితోత్పునాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో సూర్యస్య రశ్మిభిః॥ ఆజ్యేన స్నపయామి ॥-

(iv) (తేనెతో) మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః । మాధ్వీనస్సంత్వోషధీః । మధునక్తముతోషసి మధుమత్పార్థివగ్ం రజః । మధుద్యౌరస్తునః పితా । మధుమాన్నోవనస్పతి ర్మధుమాగ్ం అస్తుసూర్యః। మాధ్వీర్గావో భవంతునః ॥ మధునా స్నపయామి ॥-

(v) (శ్కరరతో) స్వాదుః పవస్వ దివ్యాయ జన్మనే స్వాదురింద్రాయ సుహవీతునామ్నే స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః ॥ - శర్కరయా స్నపయామి ॥-

II ఫలోదకం (కొబ్బరినీరు):- యాఃఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చ పుష్పిణీ బృహస్పతి ప్రసూతాస్తానో ముంచన్త్వగ్ం హసః ॥ ఫలోదకేన స్నపయామి ॥

III (శుద్ధోదకముతో) ఆపోహిష్ఠామయోభువః తాన ఊర్జే దధాతన మహేరణాయ చక్షసే । యోవశ్శివ తమోరసః । తస్యభాజయతే హనః ఉశతీరివమాతరః తస్మై అరంగమామవో యస్యక్షయాయ జిన్వధ । ఆపో జనయధాచనః ॥ శ్రీ భవానీ శంకరస్వామినే నమః ॥ స్నానం సమర్పయామి ॥

**28. వస్త్రయుగ్మము:-** జ్యేష్ఠాయ నమః ॥ తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షణ్ పురుషంజాతమగ్రతః । తేనదేవా అయజన్త సాధ్యఋష యశ్చయే ॥ **అసౌయస్తామ్రో అరుణ ఉత బభ్రుస్సుమంగలః । యేచే మామాగ్ం రుద్రా అభితో దిక్షు శ్రితాసహస్రశోవై షాగ్ం హేడ ఈమహే** ॥ - శ్రీ భవానీ శంకరస్వామినే నమః । వస్త్రయుగ్మం సమర్పయామి ॥

**29. యజ్ఞోప వీతము:-**

శ్రేష్ఠాయ నమః ॥ తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । సంభృతం పృషదాజ్యం పశూగ్ం స్తాగ్శ్చక్రే వాయవ్యాన్ । ఆరణ్యాన్గ్రామ్యాశ్చయే ॥ **అసౌయోవసర్పతి నీలగ్రీవో విలోహితః । ఉతైనం గోపా అదృశన్నదృశన్ ఉదహార్యః । ఉతైనం**

**విశ్వాభూతాని సద్రుష్టో మృడయాతినః** ॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥ శ్రీ భవానీ శంకరస్వామినే నమః । నూతన యజ్ఞోపవీతం సమర్పయామి ॥

**30. గంధము:-**

కాలాయ నమః ॥ తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । ఋచస్సామానిజజ్ఞిరే ఛందాగ్ంసిజజ్ఞిరే తస్మాత్ । యజుస్తస్మాదజాయత ॥ **నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే । అథోయే అస్యసత్వానోహం తేభ్యో అకరం నమః** ॥ శ్రీ భవానీ శంకరస్వామినే నమః - దివ్యశ్రీ గంధం సమర్పయామి

**31. ఆభరణములు:-**

బలవికరణాయ నమః ॥ తస్మాదశ్వా అజాయన్త । యేకేచోభయాదతః గావోహ జజ్ఞిరే తస్మాత్ । తస్మా జ్ఞాతా అజావయః । **ప్రముంచధన్వనస్త్వము భయోరార్త్ని యోర్జ్యామ్ । యాశ్చతేహస్త ఇషవః పరాతాభగవోవప** ॥ - శ్రీ భవానీశంకరస్వామినే నమః । ఆభరణాన్ సమర్పయామి-

**32. అర్చన (పుష్పపూజ):-**

బిల్వములతో - నానావిధ పుష్పములతో పూజించవలెను - బిల్వాష్టోత్తర శతము, శివాష్టోత్తర శతము, త్రిశతి, శివ సహస్రనామములతో పూజించవలెను

ఓం నిధనపతయే నమః ఓం నిధన పతాంతికాయ నమః (2) ఓం ఊర్ధ్వాయ నమః ఓం ఊర్ధ్వ లింగాయ నమః (3) ఓం హిరణ్యాయ నమః, ఓం హిరణ్యలింగాయ నమః (4) ఓం సువర్ణాయ నమః ఓం సువర్ణలింగాయ నమః (5) ఓం దివ్యాయ నమః ఓం దివ్యలింగాయ నమః. (6) ఓం భవాయ నమః ఓం భవలింగాయ నమః (7) ఓం శర్వాయ నమః ఓం శర్వలింగాయ నమః (8) ఓం శివాయ నమః ఓం శివలింగాయ నమః (9) ఓం జ్వలాయ నమః ఓం జ్వలలింగాయ నమః (10) ఓం ఆత్మాయ నమః ఓం ఆత్మలింగాయ నమః (11) ఓం పరమాయ నమః ఓం పరమలింగాయ నమః ॥। శ్రీ భవానీ శంకరస్వామినే నమః । నానావిధ పరిమళ పత్రపుష్పాణి సమర్పయామి ॥

**33. ధూపము** - బలాయనమః ॥ యత్పురుషంవ్యదధుః । కతిధా వ్యకల్పయన్ ॥ ముఖం కిమస్య కౌబాహూ । కావూరూ పాదా ఉచ్యేతే ॥ **అవతత్య ధనుస్త్వగ్ం**

**సహస్రాక్ష శతేషుధే । నిశీర్యశల్యానాం ముఖా శివోనస్సుమనాభవ ॥**
శ్రీ భవానీశంకరస్వామినే నమః । ధూపమాఘ్రాపయామి ॥

**34.** **దీపము:-** బలప్రమధనాయనమః ॥ బ్రాహ్మణోఽస్యముఖమాసీత్। బాహూ రాజన్యః కృతః । ఊరూ తదస్య యద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥ **విజ్యంధనుః కపర్దినో విశల్యోబాణవాగ్ం ఉత అనేశన్నస్యేషవ ఆభురస్య నిషంగధిః** ॥ శ్రీ భవానీశంకరస్వామినే నమః । దీపం దర్శయామి ॥

**35.** నైవేద్యము:- సర్వభూతదమనాయ నమః ॥ చంద్రమామనసోజాతః । చక్షో సూర్యో అజాయత । ముఖా దింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత ॥ **యాతే హేతిర్మీఢుష్టమహస్తే బభూవతే ధనుః తయాస్మాన్విశ్వతస్త్వమ యక్ష్మయా పరిబ్భుజ** ॥ - ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ॥ సత్యన్త్వర్తేన పరిషించామి. అమృతమస్తు అమృతోపస్తరణమసి ॥ (సూర్యాస్తమయం తర్వాత ''ఋతం త్వర్తేన పరిషించామి'' అని చెప్పవలెను )

ఓం ప్రాణాయస్వాహా , ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయస్వాహా, ఓం ఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా ॥ శ్రీ భవానీశంకరస్వామినే నమః .. నైవేద్యం సమర్పయామి. మధ్యే మధ్యే పానీయం సమర్పయామి ఉత్తరాపోశనం సమర్పయామి హస్తౌప్రక్షాళనం సమర్పయామి పాదౌ ప్రక్షాళనం సమర్పయామి, శుద్ధ ఆచమనీయం సమర్పయామి ॥

**36. తాంబూలము:-**

మనోన్మనాయ నమః నాభ్యా ఆసీదన్తరిక్షం । శీర్ష్ణోద్యౌస్సమవర్తత పద్భ్యాగ్ం భూమిర్దిశ శ్రోత్రాత్ తథాలోకాగ్ం అకల్పయన్ ॥ **నమస్తే అస్త్వాయుధాయా నాత తాయ ధృష్ణవే ఉభాభ్యాముతతే నమో బాహుభ్యాం** తవధన్వనే ॥ పూగీఫల సమాయుక్తం నాగవల్లీదళైర్యుతం । కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతాం:- శ్రీ భవానీ శంకరస్వామినే నమః । తాంబూలం సమర్పయామి ॥.

**37. కర్పూర నీరాజనము:-**

అఘోరేభ్యోఽథ ఘోరేభ్యో ఘోర ఘోర తరేభ్యః । సర్వేభ్యస్సర్వ శర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః ॥ వేదాహమేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసస్తు పారే సర్వాణి రూపాణి విచిత్యధీరః నామాని కృత్వా అభివదన్ యదాస్తే ॥ **పరితేధన్వనో హేతిరస్మాన్ వృణక్తు విశ్వతః అథోయ ఇషుధిస్తవారే అస్మిన్నిధే హితమ్** ॥ శ్రీ భవానీశంకరస్వామినే నమః । కర్పూర ఆనంద నీరాజనం దర్శయామి ॥ ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నోరుద్రః ప్రచోదయాత్ ॥ నీరాజనా నన్తరం ఆచమనీయం సమర్పయామి ॥

**38. మంత్ర పుష్పము:-**

ధాతా పురస్తాద్యముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చ తస్రః తమేవం విద్వా నమృత ఇహభవతి నాన్యఃపంథా అయనాయ విద్యతే ॥ సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం.. . సబ్రహ్మ సశివ స్సహరి స్సేంద్ర సోఽ క్షరః పరమస్స్వరాట్ ॥ యోపాం పుష్పం వేద పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి । య యేవం వేద । ------ ప్రత్యేవ తిష్ఠతి ॥ కిం తద్విష్ణోర్బల మాహుః । కాదీప్తిః । కిం పరాయణం । ఏకో యద్ధారయద్దేవః । రేజతీ రోదసీ ఉభే ॥ వాతాద్విష్ణోర్బల మాహుః । అక్షరాదీప్తి రుచ్యతే । త్రిపదా ధారయద్దేవః । యద్విష్ణో రేక ముత్తమం ॥

రాజాధిరాజాయ ప్రసహ్యసాహినే । నమోవయం వైశ్రవణాయ కుర్మహే। సమేకామాన్ కామకామాయ మహ్యం । కామేశ్వరోవై శ్రవణో దదాతు కుబేరాయ వైశ్రవణాయ మహారాజాయ నమః ॥

ఓం తద్బ్రహ్మ! ఓం తద్వాయుః । ఓం తదాత్మా । ఓం తత్సత్యం ఓం తత్సర్వం ఓం తత్పురోర్నమః । అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు । త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః త్వంతదాప అపోజ్యోతిరసోఽ మృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్ ॥ ఈశానస్సర్వ విద్యానామీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధిపతిర్బ్రహ్మ శివోమే అస్తు సదాశివోమ్ ॥ - ఓం తత్పురుషాయ విద్మహే । మహాదేవాయ ధీమహి । తన్నోరుద్రః ప్రచోదయాత్ ॥ -

ఓం నమస్తే అస్తుభగవన్ విశ్వేశ్వరాయ, మహాదేవాయ త్ర్యంబకాయ త్రిపురాంతకాయ । త్రికాలాగ్ని కాలాయ, కాలాగ్ని రుద్రాయ, నీలకంఠాయ । మృత్యుం జయాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీ మన్మహాదేవాయ నమః ॥ శ్రీ భవానీ శంకరస్వామినే నమః ॥ సువర్ణ దివ్య మంత్ర పుష్పం సమర్పయామి ॥

**39. ప్రదక్షిణ నమస్కారములు:-**

ద్రాపే అంధసస్పతే దరిద్ర న్నీలలోహిత. ...
......తాసామీశానో భగవః పరాచీనా ముఖా
కృధి ॥ సహస్రాణి సహస్రశో మేరుద్రా
అధి భూమ్యాం. .. ద్వేష్టితం వో
జంభే దదామి ॥

యానికానిచ పాపాని - జన్మాంతరకృతానిచ । తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే ॥ - పాపోఽహం పాప కర్మాహం - పాపాత్మా పాప సంభవః । త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల ॥-

అన్యధా శరణం నాస్తి - త్వమేవ శరణంమమ - తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష మహేశ్వర॥ శ్రీ భవానీ శంకరస్వామినే నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాౕ సమర్పయామి ॥

**40. ఉపచారములు:-**

త్రంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం । ఉర్వారుకమివ బంధనాన్ మృత్యో ర్ముక్షీయ మాఽమృతాత్ ॥ యోరుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు యోరుద్రో విశ్వాభువనాఽఽవివేశ తస్మై రుద్రాయ నమో అస్తు ॥ తముష్టుహి య స్స్విషు సుధన్వా యో విశ్వస్య క్షయతి భేజషస్య యక్ష్వామహే సౌ మనసాయ రుద్రం నమోభిర్దేవ మసురం దువస్వ ॥ అయం మే హస్తో భగావనయం మే భగవత్తరః । అయం మే విశ్వభేషజోఽయం శివాభిమర్శనః ॥ యే తే సహస్రమయుతం పాశా మృత్యో మర్త్యాయ హంతవే తాన్ యజ్ఞస్య మాయయా సర్వానవ యజామహే ॥ మృత్యవే స్వాహా, మృత్యవే స్వాహా ॥ ప్రాణానాం గ్రంధిరసి రుద్రోమా విశాంతకః, తేనాపాయస్వ ॥ నమో రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి ॥ మమ మృత్యుర్నశ్యతాం ఆయుర్వర్ధతాం ॥

ఛత్ర చామర, గీత, నృత్య, ఆందోళికా, ఆశ్వారోహణ, గజారోహణ, సమస్త రాజోపచార, దేవోపచార శక్త్యోపచార భక్త్యోపచారాౕ మనసా సమర్పయామి -

**41. బలి సమర్పణ:-**

బాణ రావణ చండీశ నంది భృంగి రిటాదయః మహాదేవ ప్రసాదోయం సర్వే గృహ్ణాంతు శాంభవాః ॥ నంది భృంగాదిభ్యో నమః । బలిం నివేదయామి ॥

**42. ప్రోక్షణ:-**

శంఖమధ్యే స్థితం తోయం భ్రామితం శంకరోపరి ।
అంగ లగ్నం మనుష్యాణాం బ్రహ్మహత్యాయుతం దహేత్ ॥

**43. తీర్థ స్వీకరణ:-**

(తీర్థమును తీసుకొనుచూ) అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణమ్ సమస్తపాపక్షయకరం శ్రీ భవానీ శంకర పాదోదకం పావనం శుభమ్ ॥ -

(పంచాక్షర జపము చేయువలెను)

**44. సమర్పణ:-**

యస్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతమ్ ॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వర

యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥ అనయా యథాశక్తి పూజయా భగవాన్ సర్వాత్మకః శ్రీ భవానీ శంకరస్వామి సుప్రసన్నో, సుప్రీతో, వరదో భవతు ॥ - ఏతత్ఫలం శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

**45. ఉద్వాసన:-**

ఓం నమో భగవతే రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి । హృత్పద్మ కర్ణికా మధ్యముమయా సహ శంకర ప్రవిశత్వం మహాదేవ సర్వైరా వరణై స్సహ ॥

ఇతి పుష్పాణ్యాదాయ ఆఘ్రాయ హృదయే స్థాపయిత్వా ఉద్వాసయేత్ ॥ నిర్మాల్యం శిరసి ధారయేత్ ॥

ఓం తత్ సత్



# శ్రీ శివ సహస్రనామ స్తోత్రం

## పూర్వ భాగము

శ్రీ వ్యాస భగవానుడు మనకు ప్రసాదించిన మహాభారతమున - కపట ద్యూతము - ద్రౌపది వస్త్రాపహరణము పాండవ వనవాసము- శ్రీ కృష్ణ రాయబారము- మహా సంగ్రామము - ధర్మజుని పట్టాభిషేకము - ఇవన్నీ జరిగిపోయినవి సకల సామ్రాజ్యాధిపత్యము నిరాటంకముగా లభించినను ధర్మజునకు మనశ్శాంతి కుదరలేదు. అతనిని స్వస్థమానసుని గావించుటకు దేహ త్యాగమునకై, ఉత్తరాయనమును నిరీక్షించుచు అంపశయ్యయందు బరుండిన, భీష్ముని వద్దకు శ్రీకృష్ణుడు తీసికొని పోయెను అచట యోగీశ్వరులు, తపోనిధులు గుమిగూడి యుండిరి. పితామహుడు ధర్మజాదుల నాశీర్వదించి సకల ధర్మముల నెరుకపరచుచుండెను. ప్రస్తావవశమున ధర్మజుడు:-

''త్వయాఽఽపగేయ నామాని శృతానీహ జగత్పతేః ।
పితామహేశాయ విభోర్నామాన్యా చక్ష్వ శంభవే ॥
బభ్రవే విశ్వరూపాయ మహాభాగ్యంచ తత్వతః ।
సురా సుర గురైదేవే శంకరేఽ వ్యక్తయోనయే॥

''పితామహా! విశ్వనాథుడును, విశ్వవ్యాపియును విశ్వరూపియును, దేవాసురులకు గురువును, మంగళమూర్తియును, మూల ప్రకృతికి కారకుడునైన ఈశ్వరుని నామములను మహిమలను దెలుపవే'' అని యడిగెను. అంత భీష్ముడు:-

''అశక్తోహం గుణాన్వక్తుం మహాదేవస్య ధీమతః।
యోహి సర్వగతోదేవో న చ సర్వత్ర దృశ్యతే॥

'విజ్ఞానమయుడైన మహాదేవుని గుణగణములను ప్రశంసింప నే నసమర్థుడను. అంతట వ్యాపించియున్నను అతడగుపడుటలేదు. అతడు ప్రకృతికిని జీవుడనబడు పురుషునకును అధికుడు. అక్షర పరబ్రహ్మమతడే. కార్యప్రపంచముగను కార్య కారణుడుగనునున్నాడు జన్మ మృత్యు జరా వ్యాధులకులోనైన మానవుడు ఆ దేవదేవుని గుణములను గణుతింప శక్తుడగునా? మహాత్ముడైన శ్రీకృష్ణుడు బదరికాశ్రమమున తీవ్రతపమొనర్చి మహేశ్వరుని కటాక్షమునొంది అందరకు ప్రియుడైయున్నాడు. పరమేశ్వరానుగ్రహమున సాంబుడను పుత్రుని బడసెను. కావున దేవదేవుని నామములను గుణములను విభూతులను తెలివిచ్చుటకు శ్రీకృష్ణుడే సమర్థుడు,'' అని శ్రీకృష్ణునుద్దేశించి,

''సురాఽసురగురోదేవ విష్ణోత్వం వక్తుమర్హసి।
శివాయ శివరూపాయ యన్మాఽపృచ్ఛద్యుధిష్ఠిరః॥

''జగద్గురువైన ఓ విష్ణూ! మంగళమూర్తియగు శివుని గూర్చి ధర్మజుడు నన్నడిగిన దానిని నీవు చెప్పుటయే సమంజసము. బ్రహ్మలోకమున తండి మహర్షికి దేవదేవుని యే సహస్ర నామములు తెలియజేయబడెనో వానిని నీవు తెలుపగా ధర్మజునితోగూడి ద్వైపాయనాది ఋషులాలకింతురుగాక'' అనెను.

అంత శ్రీకృష్ణుడు ఆచమించి శుచియై మహాదేవుని మనసాస్మరించి పూర్వము బదరికాశ్రమమున ఉపమన్యు మహర్షి తనకు శివుని నామములను గుణగణములను బోధించిన విధమును ప్రశంసింపనుద్యుక్తుడాయెను

ఉపమన్యురువాచ:-

బ్రహ్మప్రోక్తైర్ ఋషి ప్రోక్తై ర్వేదవేదాంగ సంభవైః।
సర్వలోకేషు విఖ్యాతం స్తుత్యం స్తోష్యామి నామభిః॥

మహద్భిర్విహితై సత్యైః సిద్ధైః సర్వార్థ సాధకైః।
ఋషిణా తండినా భక్త్యా కృతైర్వేద కృతాత్మనా॥

యథోక్తైః సాధుభిః ఖ్యాతై ర్మునిభిర్ తత్త్వదర్శిభిః।
ప్రవరం ప్రథమం స్వర్గ్యం సర్వభూతహితం శుభం॥

శృతైః సర్వత్ర జగతి బ్రహ్మలోకావతారితైః।
సత్యైస్తత్ పరమంబ్రహ్మ బ్రహ్మప్రోక్తం సనాతనం॥
వక్ష్యే యదుకుల శ్రేష్ఠ శృణుష్వావహితో మమ॥

ఉపమన్యుడిట్లనెను:-

''వేదవేదాంగ సంభవములును, బ్రహ్మప్రోక్తములును, ఋషిప్రోక్తములునగు నామములచే సర్వలోక విఖ్యాతుడై, స్తుత్యుడైన అమ్మహాదేవుని కీర్తించెదను అయ్యవి మహనీయులచే పొగడబడినవియు, విహితములను, సత్యములును, సిద్ధములును, సర్వార్థసాధకములును, మహర్షియగు తండిచే భక్తితో పఠింపబడినవియును, సత్య దర్శనులైన మునుల వలనను, సాధుజనులచే యథోక్తములు, ప్రఖ్యాతములైయున్నవి. అట్టి నామములచే శ్రేష్ఠమైనవాడు, ప్రథముడు, స్వర్గప్రదాతయు, సర్వ జీవ హితుడును, మంగళమూర్తియునైన శివుని స్తుతించెదను. యదుకులశ్రేష్ఠా! బ్రహ్మ లోకమున ఉదయించిన ఈ వేదసారమైన నామములను సావధానుడవై వినుము.

వరమేనం భవందేవం భక్తస్త్వం పరమేశ్వరం।
తేనతే శ్రావయిష్యామి యత్తత్ బ్రహ్మ సనాతనం॥
నశక్యం విస్తరాత్ కృత్స్నం వక్తుం శర్వస్య కేనచిత్।
యుక్తేనాపి విభూతీనామపి వర్ష శతైరపి॥

యస్యాదిర్మధ్య మంతంచ సురైరపి న గమ్యతే।
కర్తస్య శక్తుయాద్వక్తుం గుణాంకార్త్స్న్యేన మాధవ॥

కింతు, దేవస్య మహతః సంక్షిప్తార్థ పదాక్షరం।
శక్తే తచ్చరితం వక్ష్యే ప్రసాదాత్ తస్య ధీమతః॥

అప్రాప్య తు తతోఽనుజ్ఞాం న శక్యః స్తోతుం మీశ్వరః।
యదా తేనాభ్యనుజ్ఞాతః స్తుతోవై స తదా మయా॥

నీవు భక్తుడవై పరమేశ్వరుని [illegible] ఆరాధింపుము నీకా సనాతన బ్రహ్మమును వివరించెదను ఆశివుని విభూతియు విస్తరించి తెలుపనెవ్వరికిని శక్యముగాదు ఎంతటి ఘనుడైనను అమ్మహేశుని విభూతులను వందలకొలది సంవత్సరములకేని తెలుపజాలడు అతని ఆదిమధ్యాంతములు సురలకును గోచరము గాదు మాధవా! అట్టివాని గుణములను సంపూర్ణముగా దెలుపుట కెవ్వనికి సాధ్యమగును? అయినను అమ్మహాత్ముని యనుగ్రహము వలన నా శక్తికొలది నాతని చరితమును సంక్షిప్తార్థ పదాక్షరముల మూలమున దెలిపెదను ఆ శివుని అనుజ్ఞ లేక అతనిని సన్నుతింప శక్యముగాదు నేనెప్పుడు అతని ఆజ్ఞ వడయుదునో అప్పుడే అతడు సన్నుతింపబడిన వాడగును.

అనాది నిధనస్యాహం జగద్యోనేర్మహాత్మనః।
నామ్నాం కంచిత్ సముద్దేశ్యం వక్ష్యామ్యవ్యక్త యోనినః॥

వరదస్య వరేణ్యస్య విశ్వరూపస్య ధీ మతః।
శృణు నామ్నాం చయం కృష్ణ యదుక్తం పద్మయోనినా॥

దశనామ సహస్రాణి, యాన్యాహః ప్రపితామహః।
తాని నిర్మధ్య మనసాదధ్నో ఘృత మివోద్ధృతం॥

గిరేః సారం యధాహేమ, పుష్పసారం యధామధు।
ఘృతాత్సారం యధా మందస్తధై తత్సారముద్ధృతం॥
సర్వపాపాహ మిదం చతుర్వేద సమన్వితం।

ఆద్యంత రహితుడును, మహాత్ముడును, జగద్యోనియు అవ్యక్తయోనియునగు అతని నామముల సముద్దేశము నించుక తెలిపెదను. ఓ కృష్ణా! ధీమంతుడు, వరదుడు, వరేణ్యుడు, విశ్వరూపుడగు ఆ మహాదేవుని గురించి మున్ను బ్రహ్మ దేవుడు తెలిపిన విధమనుసరించి చెప్పెదను ఆ పితామహుడు పదివేల నామములను బలికెను వానినన్నింటిని మానసమున మథించి, పెరుగు నుండి నేయియు, కొండలను నుండి బంగారును, పుష్పముల నుండ మధువును, నేతినుండి మందమును సేకరించునట్లు, చతుర్వేద సమ్మతమై, సర్వపాపహరమగు తన్నామసారము గ్రహింపబడినది.

45 మహాహనుః విశ్వగ్రాసే సమృద్ధే హనుం = ప్రపంచమును మ్రింగుటకు సమర్థమగు దవడలు గలవాడు మృత్యుర్యస్యోపసేచనం కఇత్థా వేదయత్రసః (క.ఉ. 2-25) = ప్రపంచమును అన్నముగా తినే యముడు శివునకు ఊరగాయవంటివాడు (శి స నా 469)

## 6. లోకపాలోన్త ర్హితాత్మా ప్రసాదో హయగర్దభిః ।
## పవిత్రంచ మహాంశ్చైవ నియమో నియమాశ్రితః ॥

46 లోకపాలః ఇంద్రాది లోకములను పాలించువారి స్వరూపము గలవాడు (శి.స నా 544)

47. అంతర్హితాత్మ . అవిద్యాకల్పితేన అహంకారాదీనా తిరోహిత అఖండైక రసస్వభావః అవిద్యచే కల్పితమైన అహంకారాదికముచేత కప్పబడిన అఖండైక రస స్వభావుడు

48. ప్రసాదః · ప్రేమస్వరూపి, నిత్యానందుడు

49. హయగర్దభిః అశ్వధరీ రధేనా రాజీమదావదితి శ్రుతిభ్యాం అగ్నిరూపి దేవో ఒశ్వధరీ రధ వాహన ఇతిగమ్యతే
శ్రుతివాక్యానుసారము అగ్నిదేవుడు హయగర్దభుడనబడును.
కంచరగాడిదలచే లాగబడు రథము గలవాడు
పాఠాంతరము : నీలలోహితః : వినీల నేత్రములు కలవాడు.

50 పవిత్రః : భవేత్ సంసార వజ్రపాతాత్ త్రాయత ఇతి పవిత్రం : సంసార వజ్రపాతమునుండి రక్షించువాడు. పవి : వజ్రాయుధము త్రం = రక్షించువాడు - పావనము చేయువాడు. (వి స.నా 64; శి.స.నా.847, 978)

51. మహాన్ : పూజింపదగినవాడు. (శి స నా.116, 824)

52. నియమః : శౌచ, సంతోష, తపః, స్వాధ్యాయ, ఈశ్వరప్రణిధానాని నియమం (యో సూ.232) శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము (వేదాది సద్గ్రంధ పఠనము) ఈశ్వరధ్యానము = ఈ ఐదు నియమములు యోగసిద్ధి సాధనములు = మిక్కిలిగా శాసించువాడు. (వి.స.నా 166,871)

53 నియమాశ్రితః : శాస్త్రోక్త విధులను అనుష్ఠించు వారలకు లభ్యమగువాడు.

## 7. సర్వకర్మా స్వయంభూత ఆదిరాదికరో నిధిః ।
## సహస్రాక్షో విశాలాక్షః సోమో నక్షత్ర సాధకః ॥

54. సర్వకర్మః · సకల శిల్పాచార్యో విశ్వకర్మః · సకల శిల్పములను చక్కగా తెలిసినవాడు. 2. సర్వకర్మలకు కారణుడు

55. స్వయంభూతః స్వయంభువుడు (వి స.నా 38)

56. ఆదిః : అన్నిటికి మొదటివాడు. ''యోదేవానాం ప్రథమం పురస్తాత్ విశ్వాదీయో రుద్రోమహర్షిః'' రుద్రుడనబడు సర్వమునెరిగిన మహర్షి, దేవతలందు ప్రథముడుగా నున్నాడు. విశ్వమున కధికుడు.
అధీయతే · (భక్తులచే) ఆరాధింపబడువాడు - స్వీకరించబడువాడు

57. ఆదికరః : హిరణ్య గర్భం పశ్యత జాయమానం సనోదేవః శుభయా స్మృత్యా సంయునక్తు . ఆది జీవుడైన హిరణ్యగర్భుడుదయించి నదియు చూచినదెవరో అట్టిదేవుడు మనలను విజ్ఞప్తి యందుంచుకొని చక్కగా కాపాడుగాక (మ నారా ఉప 12-3-2.)

58. నిధిః : పద్మ శంఖాదిరూపో అక్షయ ఐశ్వర్యం - ప్రళయ కాలే అస్మిన్సర్వం నిధయత ఇతి నిధిః : పద్మశంఖాది రూపములైన అక్షయములైన నవ నిధులను కలిగినవాడు. ప్రళయకాలమందు వాటిని నాశనం చేయుచున్నాడు

59. సహస్రాక్షః : లెక్కించలేనన్ని నేత్రములు కలవాడు.
సర్వతోక్షిశిరోముఖం : (భ గీ.) అంతట ముఖములు నేత్రములు కలవాడు. అందరి చూపులకు మూలమైనవాడు. (వి.స.నా.226.)

60. విశాలాక్షః : విపులాని అక్షాణి ఇంద్రియాణి యస్యసః ·
అక్షః అను పదమును అన్ని ఇంద్రియములకు అన్వయించుకొన వలయును. ఆయనకు గోచరించనిదేదియులేదు.

61. సోమః : 1. ఉమతో కూడినవాడు ఉమామహేశ్వరుడు. 2. చంద్రుడు. 3. లతారూపమైన యజ్ఞహవిస్సు గలవాడు సౌమ్యగుణము కలవాడు.
స+ఉ+మః : ఉ=క్లేశము కానిది సౌఖ్యము. దానితో కూడిన ఆనంద స్వరూపుడు. (వి.స.నా. 504 4)

62. నక్షత్ర సాధకాయ బ్రహ్మాండమందు కోట్లకొలది నక్షత్రములను కలుగజేసినవాడు. పుణ్యాత్ములకు ప్రకాశమానలగు నక్షత్ర రూప మొసగువాడు.

## 8. చంద్రః సూర్యః శనిః కేతు గ్రహో గ్రహపతిర్వరః ।
## అత్రిరత్ర్యా నమస్కర్తా మృగబాణార్పణో నఘః ॥

63 చంద్రః : చంద్రస్వరూపుడు

64 సూర్యః : సూర్యుడు; సురతి = ముందుకు సాగువాడు; సృ=గతౌ అను

ధాతువునుండి పుట్టినది. ''ఘూ=ప్రేరణే' అను ధాతువు నుండి పుట్టినది. ''లోకులను వారి వారి కర్మలయందు ప్రేరేపించువాడు (వి స నా.884)

65. శనిః : సూర్యపుత్రుడైన ''శని''కూడా శివుడే.

66. కేతుః : కేతు స్వరూపుడు.

67. గ్రహః . సూర్యచంద్రులను గ్రసించు రాహువు

68. గ్రహపతిః : గ్రహములకు పతి - మహాక్రూరుడు - మంగళుడు.

69. వరః · పూజ్యుడు. బృహస్పతి - ''పూజ్యో బృహస్పతిః సఏవ శుక్రః - బృహస్పతిర్హి శుక్రోభూత్వా ఇతి మైత్రాయణీ శ్రుతేన శ్రవణాత్ = గురు, శుక్ర గ్రహములు కూడా శంకరుడే. (శి.స నా.7, 556)

70 అత్రి : ఆత్రేయరూపమున (ఆ గోత్రోద్భవుడైన) బుధగ్రహము రుద్రుడే (63 నుండి 70 వరకు గల నామములు గ్రహములకు సంబంధించినవి వారందరూ రుద్రాంశులే.)

71. అత్ర్యానమస్కర్తాః : అత్రిపత్ని అయిన అనసూయకు మొక్కినవాడు . దుర్వాస దత్తాత్రేయులుగా రుద్రుడు అత్రి దంపతులకు జనించి వారికి నమస్కరించినవాడు.

72. మృగబాణార్పణః · సతీదేవి ఆత్మాహుతి చేసుకొనిన తర్వాత వీరభద్రుడు యజ్ఞ విధ్వంసము చేయ సమకట్టినప్పుడు - ఆ యజ్ఞము జింక రూపము ధరించి పారిపోవనెంచినది. అప్పుడు దానిని బాణముతో కొట్టెను. దారుకావన మందు - మునిపత్నులు బ్రహ్మచారి రూపమున నున్న శివుని వలచిరి. మునులు అభిచార హోమము చేయగా అందునుండి జింక వచ్చినది. దానిపై శివుడు బాణమును ప్రయోగించెను. కిరాతార్జునీయ గాథలోకూడా శివుడు వరాహముపై బాణములను వేసెను.

73. అనఘః · పై చెప్పిన యజ్ఞములను పాడుచేసిననూ అతనికే పాపములంటవు. పాపరహితుడు. (వి.స.నా.147).

## 9. మహాతపా ఘోరతపో అదీనో దీనసాధకః ।
## సంవత్సరకరో మంత్రః ప్రమాణం పరమం తపః ॥

74. మహాతపః : యః సర్వజ్ఞః సర్వవిత్ యస్యజ్ఞానమయం తపః'' (ముం.ఉ. 1-9)
అన్నింటినీ తెలిసినవాడు, తెలుప గలిగినవాడు, జ్ఞానమయుడైనవాడు, విశ్వసృష్టికి పూర్వము మహాతపస్సు చేసెను; ఆతపః ఫలమే విశ్వము. (వి.స.నా.123; శి.స.నా.175)

75. ఘోరతపః : ఘోరం విశ్వ సంహారక్షమం యస్యేతి ఘోరక్షమం''
ప్రళయకాలమందు కఠోరదీక్ష బూనియుండెడివాడు
2. పార్వతీ పరిణయమునకు పూర్వము శివుడు ఘోర తపస్సు చేసెను.
''శివాభ్యాం - నిజతపః ఫలాభ్యాం'' - (శి.ల.1)

76. అదీనః : మహామనస్సు గలవాడు. విశాలహృదయుడు

77. దీనసాధకః · దీనానాం శరణాగతానాం ఇష్టసాధకః -
శరణుజొచ్చిన దీనజనులకు అభయ, వరప్రదాత, తనను పరాభవించి, దూషించి, తన భార్య మరణానికి కారకుడైన దక్షుని బ్రతికించినాడు. భస్మాసురునికి వరములిచ్చినవాడు ''ప్రభుస్త్వందీనానాం ఖలుపరమ బంధుః పశుపతే ప్రముఖ్యోఽహం తేషామపి కిముత బంధుత్వ మనయోః । త్వయైవ క్షంతవ్యాః శివ మదపరాధశ్చ సకలాః ప్రయత్నాత్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః (శి ల.14)
ఓ పశుపతీ! శివా! దీనులకు ప్రభుడవు పరమబంధుడవు - నేనా దీనులలో మొదటివాడను. నా తప్పులను నీవే క్షమించగలవు
ప్రాణేచ్ఛవచ్చి చొచ్చిన ప్రాణుల రక్షింపవలయు ప్రభువుల కెల్లం ।
బ్రాణులకిత్తురు సాధులు ప్రాణంబులు నిమిష భంగురములని మగువా ॥
(భాగవతం 8-234) క్షీరసాగర మధనంలో మొదట హాలాహలం వచ్చింది. అది అన్నిలోకాలనూ వ్యాపించినది. లోకాలు తపించి పోతున్నాయి. ప్రళయం వచ్చినట్లైంది. బ్రహ్మాది దేవతలు శివుని శరణుజొచ్చినారు అప్పుడు శివుడు చెప్పిన సమాధానమిది. విషాన్ని కంఠంలో దాచుకొన్నాడు.

78. సంవత్సరకరః : కాలచక్రప్రవర్తకుడు.

79. మంత్రః : ''మననాత్ త్రాయ తీతి మన్త్రోయమితి కధ్యతే''
మననముచేత రక్షించువాడు. (శి.స.నా.768; వి.స నా.280).

80. ప్రమాణః : వేదశాస్త్రాది రూపము గలవాడు వేదములే అన్నింటికి ప్రమాణము. 2. విజ్ఞానానందములకు కొలత అగువాడు. ''ప్రమితిః ప్రమాణం., విజ్ఞానమానందం బ్రహ్మ. 3. చక్షురాద్యంతర్గతమైన జగత్తు ఇతనిచేత కొలువబడుచున్నది.
''యశ్చక్షురంతరో యమయతి; యఃశ్రోత్రమంతరో యమయతి'' అను శ్రుతివాక్యమందులకు ప్రమాణము. (వి.స.నా.427,961).

81. పరమంతపః : శ్రేష్ఠమైన తపస్సు కలవాడు అయంతు పరమోధర్మో యద్యోగేనాత్మ దర్శనం. నిజమైన తపస్సు ఏదనగా = ఆత్మ సాక్షాత్కారము కలిగించునదే.

## 10. యోగీ యోజ్యో మహాబీజో మహారేతా మహా బలః ।
## సువర్ణరేతా సర్వజ్ఞః సుబీజో బీజవాహనః ॥

82. యోగిః : యోగనిష్ఠుడు, సదా స్వస్వరూపమునందే సమాహితుండై యుండెడివాడు. (వి స నా.849).
యోగమనగా కలయుట. సంబంధము సంపాదన, సంగతి, దీనివలన అట్టి స్థితి కలుగుటకు ఉపాయము. యోగశ్చిత్తవృత్తి నిరోధః. (ప.యో.సూ.2) చిత్తవృత్తుల. నిరోధము యోగము. 2. సంయోగో యోగ ఇత్యుక్తో జీవాత్మ పరమాత్మనోః (యాజ్ఞవల్క్యుడు) 3. ఆత్మ ప్రయత్న సాపేక్షా విశిష్టాయాం మనోగతిః తస్మిన్ బ్రహ్మణి సంయోగో ఇత్యభిదీయతే (విష్ణుపురాణం). ఆత్మప్రాప్తికై యుండు విశేషవృత్తిచే బ్రహ్మయొక్క సంయోగముగుటయే యోగమనబడును.

83. యోజ్యః . యోగమార్గమున తెలుసుకొనదగువాడు
మోక్షప్రాప్తికి పెక్కుయోగములు కలవు. కర్మ; జ్ఞాన, భక్తి, మున్నగునవి. వాటిలో ఒక్కదానినైననూ, అభ్యాస, వైరాగ్య, భక్తి శ్రద్ధలతో అవలంబించిన ఎడల స్వస్వరూప సాక్షాత్కారము కాగలదు.

84. మహా బీజః : మూలకారణుడు.

85. మహారేతః : అవ్యక్తమునకు స్ఫూర్తినిచ్చు రేతస్సు గలవాడు. (ఈ రెండు నామములకు కలిపి వివరణ నిచ్చెదము.)
*''మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దదామ్యహం సంభవస్సర్వ భూతానాం తతోభవతి భారత''* సర్వయోనిషు కౌంతేయ మూర్తయ *స్సంభవంతి యాః తాసాం బహ్మమహద్యోనిరహం బీజ ప్రదఃపితాః''* - (భగ 14=3,4)= మహద్బ్రహ్మ మనబడు మూలప్రకృతి యందు పరమేశ్వరుడు తన రేతస్సును (బీజమును) ఉంచుచున్నాడు. అందువలన సర్వప్రాణులకు మూలప్రకృతి తల్లి. ఈశ్వరుడు తండ్రి, ఈశ్వరాధీనమైన ప్రకృతిరూపమగు ఉపాదాన కారణమునుండి సృష్టి జరుగుచున్నది.
*''ఊర్ధ్వరేతం విరూపాక్షం - విశ్వరూపాయవై నమోనమః''*-

86. మహాబలః : శ్రేష్ఠమైన బలము గలవాడు.
బల వికరణాయ నమో బలాయ నమో బలప్రమథనాయ నమః (రుద్రం) (వి.స.నా.173; శి.స.నా.761)

87. సువర్ణరేతః : సువర్ణ రేతస్సు గలవాడు. అపఏవ ససర్జాగ్రేతాసు వీర్యమవా సృజత్ తదండ మభవత్ హైమం సహస్రాంశు సమప్రభం.

ఆదియందు నీటిని సృష్టించి అందు వీర్యముంచగా అది సహస్ర సూర్య ప్రకాశవంతమై బంగారువంటి అండమైనది. అగ్నియే శివుని రేతస్సు. హిరణ్మయ బ్రహ్మాండమును సృష్టించినవాడు.

88. సర్వజ్ఞః : సర్వజ్ఞుడనగా శర్వునికే చెల్లు. అన్నియు తెలిసినవాడు. ఇదం సర్వం యదయమాత్మా: శ్రుతి. సర్వమును తానే అయి ఉన్నందున అన్నియు తెలుసును. (వి.స 455, 827 )

89. సుబీజః ''సుష్టు అవికారీ బీజభూతః సర్వకారణం భవతీ'' శ్రేష్ఠమైన విత్తనమైనవాడు. తాను ఏమార్పు లేకుండగనే అన్ని మార్పులుగా పరిణమించగలవాడు. దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతం.

90. బీజవాహనః : ''బీజం అవిద్యా కర్మ కర్మాత్మకం తదేవ వాహనం ఇహలోక పరలోకే సంచారార్థం యస్యేతి'' అవిద్యా, కామ, కర్మలను బీజము వాహనముగా చేసుకొని ఇహపరలోకముల సంచరించువాడు.

## 11. దశబాహుస్త్వనిమిషో, నీలకంఠః ఉమాపతిః । విశ్వరూపః స్వయంశ్రేష్ఠో బలవీరోఽ బలోగణః ॥

91. దశబాహుః : పదిచేతులు కలవాడు. వాటియందు పది ఆయుధములు కలవాడు. శూలం, వజ్రంచ ఖడ్గం, పరశుమభయదం దక్షభాగే వహంతం, నాగంపాశంచ ఘంటాం ప్రళయ హుతవహం, సాంకుశం వామభాగే నానాలంకార యుక్తం పార్వతీశం నమామి.

92. అనిమిషాయ : కన్నులు మూయనివాడు. (వి.స.నా. 215)

93. నీలకంఠః : ముల్లోకములను మ్రింగు హాలాహలమును కంఠమున దాల్చుట వలన నీలమైన కంఠము గలవాడు. పరమకారుణికుడు : ఆ విషాన్ని మ్రింగని ఎడల దేవతలు నాశమైపోతారు. మ్రింగిన ఎడల ఉదరములోనున్న చతుర్దశ భువనాలు భస్మమైపోతాయి. అందుచే కంఠముననే యుంచుకొనినాడు.
''ఉదరము లోకంబులకును సదనంబగుటెఱిగి శివుడు చటుల విషాగ్నిం గుదురుకొన గంఠ బిలమున బదిలంబుగ నిలిపె సూక్ష్మ ఫలరసముద్రియన్''
(భాగవతం : అష్ట.స్కం.245).
''జిహ్వాయాం నిహితశ్చ సిద్ధ ఘటికవాకంఠ దేశే భృతః;
కింతే నీలమణి ర్విభూషణ మయం శంభో మహాత్మన్వద . *(శి.ల.32)*
ఈ కాలకూట విషము నీకు అలంకారమైన ఇంద్రనీల మాణిక్యమాయేమి. మహాత్మా! చెప్పుము.

94. ఉమాపతిః పార్వతీపతి : పార్వతి శివుని వివాహమాడుటకై ఘోరతపముచేయ నిశ్చయించగా ఆమె తల్లి ''వద్దు వద్దు'' ''ఉ.మా. ఉమా'' అని చెప్పినది. అందుచేత ఆమె ఉమగా ప్రఖ్యాతి నందినది
ఉమాయాః బ్రహ్మ విద్యాత్మ శరీరాయాః పతిః
మూర్తీభవించిన బ్రహ్మ విద్యయే ఉమా హైమవతి.
ఆమె దేవతలకు తత్త్వజ్ఞానమొసంగెనని
కేనోపనిషత్ చెప్పుచున్నది ఆమెయొక్క భర్త పరమేశ్వరుడు. (శి స నా 877)

95. విశ్వరూపః · విశ్వమే రూపముగా గలవాడు.
అగ్నిముఖంబు, పరాపరాత్మకమాత్మ । కాలంబుగతి, రత్నగర్భ పదము । శ్వసనంబు నీ యూర్పు; రసనజలేశుండు, దిశలు కర్ణంబులు, దివము నాభి, సూర్యుండు గన్నులు, శుక్లంబు సలిలంబు, జఠరంబు జలధులు, చదలు శిరము । సర్వౌషధములు రోమచయములు, శల్యంబులద్రులు, మానస మమృతకరుడు । ఛందములు, ధాతువులు, ధర్మసమితి హృదయ మా స్వపంచక ముపనిషదాహ్వయంబు నయిన నీరూపు పరతత్త్వమై, శివాఖ్యమై స్వయంజ్యోతియై యొప్పు నాద్యమగుచు. (భాగ : అష్ట.స్కం 224)
అగ్నిర్యథైకో భువనంప్రతిష్టో రూపం ప్రతిరూపోబభూవ ।
ఏకస్తథా సర్వభూతాంతరాత్మ రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ (కఠో.ఉప)
కేవలము తేజమే రూపముగాగల అగ్ని, ఉపాధుల ననుసరించి కాష్టాదిరూపమున, ఋజు, వక్ర, స్థూల, గోళాది బహు రూపముల భాసించునట్లు - శివుడు వివిధ దేహములలో యుంటూ విశ్వరూపుడై యున్నాడు. (శి స.నా.44)

96. స్వయంశ్రేష్ఠః : స్వతహాగానే శ్రేష్ఠత్వము కలవాడు. ''వామదేవాయ నమో, జ్యేష్ఠాయ నమో శ్రేష్ఠాయ నమః'' - రుద్రం -

97. బలవీరః : అనన్య సాధ్యమైన త్రిపుర సంహారమును తన బలపరాక్రమము వలన సాధించినవాడు.

98. అబలోగణః : ఇరువది ఐదు తత్త్వములే శివుని బలములు.
మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవచ; ఇంద్రియాణి దశైకంచ పంచేంద్రియ గోచరాః (భ.గీ. 13-6). మహాభూతములు 5; కర్మేంద్రియ ములు 5; జ్ఞానేంద్రియములు 5, శబ్ద స్పర్శరసాది విషయములు 5; మనస్సు, బుద్ధి, అహంకారము, అవ్యక్తము, జీవుడు 5.

## 12. గణకర్తా గణపతి ర్దిగ్వాసాః కామఏవచ ।
## మంత్ర విత్పరమో మంత్రః సర్వభావకరో హరః ॥

99. గణకర్తః : తత్త్వ గణములను సృష్టించినవాడు. ప్రమధ గణములను సృష్టించినవాడు. ఉత్కృష్ట గణరూపులను సప్తమాతృకలను, సమర్థవంతులైన దుర్గాది ఉగ్రసేనలను, స్త్రీ దేవతా సమూహమును సృష్టించినవాడు.

100. గణపతిః : గణములకన్నింటికీ (దేవాసుర యక్ష మున్నగు గణములకు) అధిపతి.

101. దిగ్వాసాః · దిక్కులే వస్త్రములుగా కాగలవాడు. దిగంబరుడు.

102. కామః : ధర్మబద్ధమగు కోరిక (కామము) కూడా అతడే. ''ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మిభరతర్షభః'' - భ.గీ.7-11.(2). అందరిచేతను కోరబడు వాడు. (శి.స నా 332, వి.స.నా.297 )

103. మంత్రవిత్ : వేదమంత్రములను అర్థముతో కూడ తెలిసినవాడు

సప్తకోటి మహామంత్రములను తెలిసినవాడు. ''మననం త్రాయతే ఇతిమంత్రః'' చక్కగా మననము చేయువానిని రక్షించునది మంత్రము. అట్టి మంత్రముచే తెలియబడువాడు.

104. పరమోమంత్రః : నిరంతరం ఆత్మ విచారము చేయువాడు. అన్ని మంత్రములలో శ్రేష్ఠమైన శివపంచాక్షరిని జపించుటచే శివ సాక్షాత్కారము కలుగును.

105. సర్వభావకరః : యచ్చాపి సర్వభూతానాం బీజంతదహమర్జున ।

న తదస్తి వినాయత్స్యాన్మయాభూతం చరాచరం. (భగీ.10:39)

చరాచరాత్మకమైన ఏ భూతసముదాయము కలదో అదంతయు భగవంతుని సృష్టియే.

106. హరః : తన గుణవిశేషముచే అందరి మనసులను చూరగొనువాడు. ఇనుము అయస్కాంతముచే లాగబడినట్లు జీవులు శివునిచే ఆకర్షితులగుచున్నారు. (శి స.నా.18, 753).

## 13. కమండలుధరో ధన్వీ బాణహస్తః కపాలవాన్ ।
## అశనీ, శతఘ్నీ, ఖడ్గీ, పట్టిశీ చాయుధీ మహాన్ ॥

107. కమండలు ధరః : కమండలువును ధరించినవాడును, కమండలువు వైరాగ్య చిహ్నము.

108. ధన్వీ . భక్తరక్షణ దుష్టశిక్షణార్థము వింటిని ధరించినవాడు. దానిపేరు పినాకము. ''నమస్తే అస్తు ధన్వినే'' - రుద్రం -

109. బాణహస్తః : బాణములను హస్తమందు కలవాడు. ఉతోత ఇషవే నమః. (మరియు, నీ బాణమునకు కూడ నమస్కారము) - రుద్రం -

110. కపాలవాౕ బ్రహ్మశిరమును ఖండించి కపాలమును దాల్చిన వాడు (శి.స.నా 611)
కపాలిౕ - భిక్షో! మేహ్యఃయకపి మత్యంత చపలం
దృఢం భక్త్యా బధ్వాశివ - భవదధీనంకురు విభో! -
కపాలాన్ని భిక్షాపాత్రగా చేసుకొని తిరుగుతూ వుండే ప్రభో! నా మనస్సనే కోతిని భక్తి అనే త్రాటితో కట్టేసి, నీ వెంట త్రిప్పుకో! (మరింత బిచ్చం పడుతుంది) (శి ల.20)
చెన్నపురిలో కపాలీశ్వర దేవాలయం కలదు.

111 అశనీ : వజ్రాయుధుడు.

112. శతఘ్నీ : నూర్లకొలది శత్రువుల నొకేసారి సంహరింపగల ''శక్తి'' అను ఆయుధము కలవాడు.

113. ఖడ్గీ : ఖడ్గధారి

114. పట్టిశీ : పట్టిశమను గొడ్డలివంటి ఆయుధము కలవాడు.

115. ఆయుధీ : శూలాయుధమును ధరించువాడు.

116. మహాన్ : మహనీయ గుణసంపన్నుడు. (శి.స నా.51; 824)

## 14. స్రువహస్తః సురూపశ్చ తేజస్తేజస్కరో నిధిః ।
## ఉష్ణీషీచ సువక్త్రశ్చ, ఉదగ్రో వినతస్తథా ॥

117. స్రువహస్తః : యజ్ఞపాత్రమగు స్రువము : (గరిటెను) చేతబట్టుకొని యుండెడివాడు. (ఎల్లప్పుడు యజ్ఞము చేయువాడు)

118. సురూపః : సుందరమూర్తి. దక్షిణదేశమునగల మధురానగరములో మీనాక్షీసమేత సుందరేశ్వరాలయము కలదు.

119. తేజః : తేజోమూర్తి; నతత్రసూర్యోభాతి నచంద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః। తమేవభాన్త మనుభాతి సర్వం తస్యభాసా సర్వమిదం విభాతి: సూర్య, చంద్ర నక్షత్ర, విద్యుత్తును ప్రకాశింపజేయు పరమతేజస్వి శివుడు.

120. తేజస్కరోనిధిః  భక్తులకు తేజోనిధిః - నతద్భాసయతే, సూర్యోన శశాంకో నపావకః యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమం మమ॥ - పరమాత్మని ఎదుట సూర్యచంద్రాగ్నులు నిస్తేజులు. ఆ తేజోనిధివలననే మిగతవన్నియు వెలుగుచున్నవి

121. ఉష్ణీషిః : తలపాగా ధరించినవాడు. ''నమ ఉష్ణీషిణే'' (రుద్రం) శిరోవేష్టము వలన అతనిని గుర్తించుట కష్టము; సంపన్నుడు; గుణశాలివలె నటించుచు ప్రజలకు నిజస్వరూపమును చూపనివాడు

122. సువక్త్రః · చక్కటి ముఖము కలవాడు. ఎప్పుడూ ఆ ముఖమునందు సంతోషమే కనబడును వ్యధ ఉండదు. (వి.స.నా.456 : సుముఖః)

123 ఉదగ్రః : ఊర్జితమైన రూపము గలవాడు. శక్తిసామర్థ్యములు ఎల్లప్పుడు పెల్లుబుకుచుండును.

124 వినతః  ఉత్తమజ్ఞాని కావున మిక్కిలి వినమ్రత కలవాడు

## 15. దీర్ఘశ్చహరికేశశ్చ సుతీర్థః కృష్ణ ఏవచ ।
## సృగాలరూపః సిద్ధార్థో ముండో సర్వశుభం కరః ॥

125. దీర్ఘః . మిక్కిలి పొడవైనవాడు.

126. హరికేశః : ఇంద్రియములే కిరణములుగా గలవాడు.

(హరయ ఇంద్రియణ్యేవ కేశాఇవ కేశోరశ్మయో యస్య సః) ఇంద్రియములచే శబ్దాది విషయములను ప్రకాశింపజేయువాడు; త్రిమూర్తి స్వరూపుడు. హరి+క+ఈశ = హరికేశః హరికేశాయోప నీతినే పుష్టానాం పతయే నమః (రుద్రం) : నల్లని వెంద్రుకలు యౌవన సూచకము. అట్టి నిత్యయువకునకు నమస్కారము.

127. సుతీర్థః : శోభనుడు. తీర్థుడు లేక మహాగురువు. క్లేశకర్మ విభాగాచయైర పరాం ఋష్టః పురుష విశేష ఈశ్వరః । సపూర్వేషామపిగురుః (యో.సూ.1-24,26) ఈశ్వరవాచకమైన ప్రణవము; పూర్వులకు గూడ గురువు.

128. కృష్ణః : కృష్ : సత్యము; ఆనందము : సదానంద పరబ్రహ్మము; వసుదేవ సుతుడైన శ్రీకృష్ణుడు, కృష్ణద్వైపాయనుడైన వేదవ్యాసుడు కూడ శివావతారులే: (వి.స.నా. 58; 549.)

129. సృగాలరూపః : నక్కరూపము ధరించినవాడు. ఒక వణిజునిచే అవమానింప బడిన బ్రాహ్మణుడు ప్రాయోపవేశము చేయగా ఇంద్రుడు సృగాల (నక్క)

రూపము ధరించెను శివునకు ఇంద్రునకు భేదము లేదు (మహాభారతం)

130 సిద్ధార్థః . అన్ని అర్థములను పొందినవాడు. ఆయన ఇక సాధించవలసిన వేవియు లేవు (వి.స నా.251)

131 ముండః : తలపైన వెంద్రుకలు లేనివాడు. బోడిగుండు చేసుకొనినవాడు. సర్వసంగ పరిత్యాగి : పరివ్రాజకుడు (ఆదిశంకరులు అపర శంకరులు) (శి స.నా 829).

132 సర్వ శుభంకరః : సర్వశుభములను చేకూర్చువాడు. పరివ్రాజక ఆశ్రమస్థులు సమాజమునకు శ్రేయస్కరులు

## 16. ఆజశ్చబహురూపశ్చ గన్ధధారీ కపర్ద్యపి ।
## ఊర్ధ్వరేతా ఊర్ధ్వలింగః ఊర్ధ్వశాయీ నభస్థలః ॥

133. అజః . పుట్టుకలేనివాడు. "అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో నహన్యతే - హన్యమానే శరీరే : భ.గీ.2-20 ఆత్మపుట్టుక లేనిది. సత్యమైనది శాశ్వతమైనది. పురాతనమైనది. దేహమునశించిననూ అది నశించదు జాయతే, అస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, నశ్యతి . (షడ్వికారములు) లేనివాడు.

134. బహురూపః : దక్షిణామూర్తి, భైరవుడు, విశ్వనాథుడు, నటరాజు, కపాలి, సోమస్కంధమూర్తిగా వెలసినవాడు - ఆరాధింపబడువాడు.

135. గంధధారి : చందనము, కర్పూరము, కస్తూరి మున్నగు సుగంధ ద్రవ్యములను ధరించువాడు; (పాఠాంతరము గంగాధారి : వియద్గంగను ధరించినవాడు.)

136. కపర్దీ : కం : జలం; పిబతీతి కపర్దిః : ఆకాశ గంగను తన జటాజూటమందు బంధించి - పిమ్మట భగీరథుని ప్రార్థనమేరకు గంగను జారవిడచిన మహాదేవుడు.

137. ఊర్ధ్వరేతాః : అస్ఖలిత బ్రహ్మచారి. "ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణ పింగళం - ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవై నమోనమః" (శి.స.నా.578)

138. ఊర్ధ్వలింగః : ఊర్ధ్వలింగము కలవాడు. అనగా స్త్రీసంపర్కము లేనివాడు.

139. ఊర్ధ్వశాయిః : వెల్లకిలి పరుండువాడు. ఇది సిద్ధయోగ లక్షణము. (పై మూడు నామములవలన శివుడు స్త్రీ సంపర్కము లేనివాడని ధ్వని)

140. నభస్థలః : ఆకాశమందుండువాడు. 2. హృదయాకాశమందు ఉండువాడు. 3. నభః : శక్తి - పార్వతీదేవియొక్క అర్ధశరీరమందుండు వాడు.

శరీరం త్వం శంభో శ్శశి మిహిర నక్షోరుహ యుగం । తవాత్మానం మన్యే భగవతి నవాత్మాన మనఘమ్ । అతశ్శేష శ్శేషేత్యయ ముభయ సాధారణ తయా । స్థితస్సంబన్ధోవాం సమరస పరానంద పరయోః (సౌ.ల.34)

## 17. త్రిజటీ చీరవాసాశ్చ రుద్రః సేనాపతి ర్విభుః । అహశ్చరో నక్తంచర స్తిగ్మ మన్యుః సువర్చ సః ॥

141. త్రిజటీ మూడు జడ ు కలవాడు,

142. చీరవాసాః : నారవస్త్రములను ధరించువాడు

143. రుద్రః : ''రుత్ రోదనహేతుర్ దుఃఖం తద్రావయతి ఇతి రుద్రః'' ప్రళయ కాలమందు జగత్సంహారము జరుగునపుడు ప్రాణులనేడిపించు వాడు 2. ప్రాణావారుద్రాః · అందరిలోను ప్రాణరూపమున యున్నవాడు. 3 రుత్ : సంసార దుఃఖము, దానిని పోగొట్టువాడు.

144. సేనాపతిః : సేనలుగాను సేనాపతిగాను వెలయుచున్నాడు. ''నమస్సేనాభ్య సేనానిభ్యశ్చవో నమః'' - రుద్రం.

145. విభుః · సర్వవ్యాపకుడు - అజాయమానో బహుధా విజాయతేః - అన్నిరూపములు గలవాడు. 2. ముల్లోకములకు ప్రభువు. (వి.స.నా. 240; 880; శి.స.నా.203, 635, 696.)

146. అహశ్చరః : పగలు సంచరించెడివాడు. దేవతల రూపమున నుండువాడు.

147. నక్తంచరః : రాత్రులందు తిరిగెడివాడు. అసురుల రూపమున నుండువాడు.

148. తిగ్మమన్యుః : తీవ్రమగు కోపము గలవాడు. ''నమస్తే రుద్ర మన్యవ'' (రుద్రం) ఆ కోపమును శత్రువులందు చూపును. దుష్టుల రూపుమాపును.

149. సువర్చసః : జ్ఞానముచే ప్రకాశించువాడు.

## 18. గజహా దైత్యహా కాలో లోకధాతా గుణాకరః । సింహశార్దూల రూపశ్చ ఆర్ద్రచర్మాంబరావృతః ॥

150. గజహా : పూర్వము కాశీ పట్టణమును ధ్వంసము చేయుటకు గజరూపమును ధరించి వచ్చిన రాక్షసుని సంహరించెను.

151. దైత్యహా : రాక్షసులను సంహరించెడివాడు

152. కాలః : మృత్యువు - 2. కాలస్వరూపుడు.

''కాలోస్మిలోక క్షయకృత్ ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః''
నేను లోకక్షయము చేయుటకు వృద్ధి పొందిన కాలస్వరూపుడను.
(భ.గీ.11-32) (వి.స.నా - 411; శి.స.నా.370, 384, 583.)

153. లోకధాతా : లోకములకు ఈశ్వరుడు. లోకభారమును మోయువాడు.

154. గుణాకరః : గుణానాం దీనదయాళుత్వ జ్ఞానాైశ్వర్యాదీనా మాకరం దీనుల యెడ దయ; జ్ఞానము, ఐశ్వర్యము మొదలగు సకల కల్యాణ గుణములకు ఆవాసమైనవాడు

155. సింహశార్దూల రూపః - రుద్రుడు సంహారకర్త. అతడు సింహము, పెద్దపులి మొదలగు క్రూర జంతువుల రూపమున జీవకోటిని బాధించువాడు.

156. ఆర్ద్రచర్మాంబరావృతః . గజాసురుని చంపి అతని రక్తసిక్తమైన చర్మమును తీసి మొలకు చుట్టుకొనినవాడు

## 19. కాలయోగీ మహానాదః సర్వకామశ్చతుష్పథః ।
## నిశాచరః ప్రేతచారీ భూతచారీ మహేశ్వరః ॥

157. కాలయోగీ : మృత్యుంజయుడు, హాలాహలము ఏమియు చేయలేక పోయినది. మునులు ప్రయోగించిన అభిచారహోమములోని దుష్టశక్తులు ఆయనను ఏమియు చేయలేకపోయినవి. ఆయన కాలాతీతుడు. ''సుధా మప్యాస్వాద్య ప్రతిభయ జరామృత్యుహారిణీం విపద్యన్తే విద్వే విధి శతమఖ ద్యాదివిషదః। కరాళం యత్క్ష్వేళం కబళిత వతః కాలకలనా । న శంభో'' (సౌ.ల.28).
జరామరణములనుహరించు అమృతమును సేవించిన బ్రహ్మ ఇంద్రాదులు మరణించుచున్నారు. కాలకూట విషయమును కబళించిన శివునకు మరణము లేదు. ''అహమే వాక్షయః కాలో'' (భ.గీ.10-33). కాలము అక్షయమైనది. అఖండమైనది. సర్వప్రాణులు కాలవశ్యులే. కాని శివుడు నిజయోగ **బలముచే** కాలము నతిక్రమించెను.

158. మహానాదః : **గొప్పనాద** స్వరూపుడు. అనాహత నాద**రూపుడు. ''నాద** శరీరము'' **కలవాడు.** పరాకాశమందలి నాదము - **మరొక** వస్తు సంయోగముచే **కలుగువది కాదు.** (హంసోపనిషత్)

159 సర్వకామః : ''సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః'' సకల కర్మలు, సకల కోరికలు, సకల వాసనలు, సర్వ రసములు అతడే (ఛాం.ఉ.3-14-2). ''అస్మిన్ సర్వేకామాః సమాహితాః (ఛాం ఉ 3-19-3)

160. చతుష్పథః : శివసాయుజ్యమును పొందుటకు నాల్గుమార్గములున్నవి. వాటిని కలిగినవాడు. ఆ మార్గములు : చర్య, క్రియ, యోగ, జ్ఞానమార్గములు. లేక, భక్తి, కర్మ, జ్ఞాన, యోగ మార్గములు. 2 గజ, సింహ శార్దూల, వృషభ... గతుల నడిచెడువాడు.

161. నిశాచరః . భేతాళ, కాలభైరవాది రూపములతో రాత్రులందు సంచరించెడివాడు. 2 అవిద్యా స్వరూపుడుకూడా.

162. ప్రేతచారీ : భూతప్రేత పిశాచములతో తిరుగువాడు. కట్టుబాట్లకు లోబడనివాడు.

''పిత్తనైప్పోలుం, పేయనైప్పోలుం, యెల్లాక్కుట్టుప్పాటుగళుక్కుం అప్పార్ పట్టివరాదలాల్''

163. భూతచారీ · భూతములతో (జీవులందరితో) శివుడు తిరుగుచుండును.

164. మహేశ్వరః : ఈశ్వర శబ్ద వాచ్యులైన, దేవతలకు, కవులకు, యోగులకు, రాజులకు ఈశ్వరుడు.

**20. బహుభూతో బహుధరః, స్వర్భాను రమితోగతిః ।**
**నృత్యప్రియో నిత్యనర్తో నర్తక స్సర్వలాలసః ॥**

165. బహుభూతః : శివుడొక్కడే అయిననూ, బహురూపములుగా కన్పట్టువాడు.

166. బహుధరః : విశ్వమంతటినీ ధరించువాడు. విశ్వానికి ఆలంబనము అయినవాడు.

167. స్వర్భానుః : 1. స్వః+భానః:స్వయంప్రకాశరూపుడు. 2. రాహుగ్రహము. 3. అజ్ఞానమనెడి చీకటిగా చెప్పబడువాడు.

168 అమితః : ఇంత అని చెప్పనలవికానివాడు. ఏ కొలతకు అందనివాడు.

169. గతిః : సాకాష్ఠా సా పరాగతిః (కఠోపనిషత్).
ముక్తానాం పరమాంగతిః : ముక్తులకు పొందదగిన స్థానము. గతిర్భర్తా ప్రభుస్సాక్షీ. భ.గీ. (శి.స నా. 862)

170. నృత్యప్రియాః : తాండవప్రియుడు.

171. నిత్యనర్తః . నిరంతరం నర్తనము చేయువాడు.

172. నర్తకః  నర్తనము చేయువాడు

నాట్యనృత్త శోభ అంగ సౌష్ఠవముమీదనే ఆధారపడియుండును ఎచ్చట హస్తము చూపబడునో అచ్చటదృష్టి దృష్టియున్న చోట మనస్సు మనస్సుండుచోట భావము అది ఉన్నచోట రసము ప్రదర్శించబడును. యజ్ఞము, పెండ్లి, పట్టాభిషేకము, నగర ప్రవేశము, గృహప్రవేశము, ప్రియ సంగమము, ఉత్సవము, విజయానందము మున్నగునవి నృత్య సమయములు.

173. సర్వలాలసః · అందరియందును అదిక ప్రీతి గలవాడు.

**21. ఘోరో మహాతపాః పాశో నిత్యో గిరిరుహో నభః ।**
**సహస్రహస్తో విజయో వ్యవసాయో హ్యతంద్రితః ॥**

174. ఘోరః : మహా భయంకరుడు. ''ఘోరేభ్యో అథఉఘోరేభ్యః'' శంకరుని పంచముఖములలో అఘోర ముఖము ఒకటి ఆ ముఖమునకు రెండు రూపములు కలవు. ఘోరము, అఘోరము, (ఆకలిదప్పి మున్నగు ఘోరతనువు - రెండవ రూపము సంతోష పూరితము).

175. మహాతపాః : నిశ్చలమైన తపస్సు గలవాడు. పంచకృత్యములైన సృష్టి, స్థితి, లయ, అనుగ్రహ, తిరోధానములు ఆయన తపస్సుయొక్క ఫలమే (శి.స.నా.74).

176. పాశః : లలితాపరాభట్టారిక చేతిలో పాశము గలదు. అది భక్తులను ప్రీతితో చేరదీయుటకును, దుర్మార్గులను శిక్షించుటకును బంధమగును. అదే విధముగా శివుడుకూడా బంధరూపుడే; మాయతో బంధించువాడు. భక్తులను అనురాగముతో చేరదీయువాడును.

177. నిత్యః : త్రికాలములందు స్థిరముగా నుండువాడు. అనగా నాశరహితుడు.

178. గిరిరుహః : కైలాస పర్వతవాసి.

179. నభః : ఆకాశమువలె, నిరాకారుడు; నిర్వికారుడు; సర్వవ్యాపి.

180. సహస్రహస్తః : అనేక హస్తములు కలవాడు. అందరి చేతులు ఆయనవే.

181. విజయః : విజయ స్వరూపుడు; విజయమునిచ్చువాడు, బ్రహ్మణోవా ఏతత్ విజయే మహీయత్వమితి (కేనోపనిషత్). జ్ఞానము వైరాగ్యము, ఐశ్వర్యాదులచే విశ్వవిజయము కలవాడు. (వి.స నా.147)

182. వ్యవసాయః : జయహేతువైనవాడు - ''వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన'' (భ.గీ.2-41) నిశ్చయాత్మకబుద్ధి వలననే మోక్షప్రాప్తి. జ్ఞానమాత్ర పురుషుడు (వి.స నా.384)

183. అతంద్రితః : సోమరితనము లేనివాడు; నిర్విరామముగా మెలకువగా సర్వకర్మలను లోకహితము కొరకు చేయువాడు.
*''యదిహ్యాహం నవర్తేయం జాతుకర్మణ్యతన్ద్రితః''* (భ.గీ.3-23)

## 22. అధర్షణో ధర్షణాత్మా, యజ్ఞహా కామనాశకః ।
## దక్షయాగాపహారీచ సుసహోమధ్యమస్తథా ॥

(పాఠాంతరము : అమర్షణో మర్షణాత్మా)

184. అధర్షణః : అతనిని ఎవరూ కదలింపలేరు )

రావణుడు కైలాసగిరిని పెకలించ ప్రయత్నించి విఫలుడైనాడు అమర్షణః

185 ధర్షణాత్మః భయంకరుడు - ''భయాదస్యాగ్ని స్తపతి, భయాత్తపతి సూర్యః భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః అగ్ని కాల్చుట; సూర్యుడు వెలుగునిచ్చుట, ఇంద్రుడు, వాయువు, యముడు, వారి కర్తవ్యముల నిర్వహించుట ఇతనిని చూచి భయపడుట వలననే

186. యజ్ఞహా : ద్రోహబుద్ధితో, పరులకపకారమునకై చేయబడు యజ్ఞములకు భంగము కలిగించువాడు.

187. కామనాశకః . మన్మథుని భస్మము చేసినవాడు కామములను జయించినవాడు.

188. దక్షయాగాపహారి : దక్షుని యజ్ఞమును ధ్వంసమొనర్చినవాడు.

189. సుసహః : సౌమ్యుడు, భోళాశంకరుడు.

190. మధ్యమః : పక్షపాతరహితుడు ఒకరివైపు మొగ్గుచూపుట లేదు. క్షీరసాగర మథనమప్పుడు అందరూ రెండువర్గాలుగా విడిపోయినారు. కాని శివుడు అందు పాల్గొనలేదు. వారికి ప్రాణాంతకమైనదానిని వారికోరిక మేరకు స్వీకరించెను. ''సమోహం సర్వభూతేషు'' (భ.గీ 9-29) సకల భూతములందు సమబుద్ధి కలవాడు.

## 23. తేజోపహారీ బలహా ముదితోఽర్థోఽజితో వరః ।
## గంభీరఘోషో గంభీరో గంభీర బలవాహనః ॥

191. తేజోపహారీ : లోక కంటకుల తేజస్సును హరించువాడు. అహంకారముతో దక్షుడు యజ్ఞముచేసి, శివుని అవమానించి, సతీదేవి మరణమునకు

కారకుడైనందున, అతని శిరమును ఖండించి ఆయజ్ఞములో పాల్గొనిన యముని దండమును విరిచి, భగుని నేత్రములను పెరికి; సూర్యుని దంతముల రాల్చి, కుబేర, బ్రహ్మ మున్నగు దేవతలను తేజోహీనుల గావించెను

192. బలహాః : ఇంద్రరూపమున బలాసురుని చంపినవాడు. బలంతుడ నాకేమని విర్రవీగువారలను ఏదోరూపమున నాశము చేయువాడు వాలి, రావణుడు, మున్నగువారు శివభక్తులే అయిననూ, బలగర్వముతో నుండగా, రామ రూపమున వారిని హతమార్చెను

193. ముదితః · నిత్యానందుడు . శివుడు యోగీశ్వరుడు, యోగమునకు ప్రయోజనము దుఃఖనివృత్తి, సుఖప్రాప్తి

194. అర్థః : ఆయన కౌపీనవంతుడుకూడా కాడు దిగంబరుడు, ఆది బిచ్చగాడు అయిననూ అందరిచేత అర్థింపబడువాడు. ఆశ్రితులకు సర్వము నివ్వగలవాడు

195 అజితః ఆయన నెవ్వరునూ గెలవలేరు (శి స నా.496, 613)

196 అవరః : తనకంటే వేరుగా కోరదగినవాడు లేనివాడు

197 గంభీరఘోషః . సముద్రము, మేఘములవంటి గంభీరమైన ఘోషము చేయువాడు. ''హాసవేష పరిష్లుష్ట త్రిపురాయ'' త్రిపురములను తన గంభీర ఘోషతోనే (ఒక్కసారి హుంకరించినాడు.) నేలకూల్చినవాడు. పంచాననుడు సింహామువలె గర్జించును.

198. గంభీరః : చాలా లోతైనవాడు. తెలుసుకొనుట మిక్కిలి కష్టము. వేదములవలె గంభీరుడు. యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ - మనసుకు వాక్కులకు అందనివాడు.

199. గంభీర బలవాహనః . ధర్మము గంభీరమైనది. ధర్మమనగా నంది (వృషభము) దానిని వాహనముగా చేసుకొనినవాడు.

## 24. న్యగ్రోధ రూపో న్యగ్రోధో వృక్షకర్ణస్థితి ర్విభుః ।
## సుతీక్ష్ణదశనశ్చైవ మహాకాయో మహాననః ॥

200. న్యగ్రోధరూపః : సంసార వృక్ష స్వరూపుడు. అశ్వత్థ వృక్షరూపుడు. ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్. భ.గీ.15-1 దాని ఆకులు వేదములు. దాని మూలము బ్రహ్మము. దాని వ్రేళ్లు పైకి, కొమ్మలు క్రిందికి ఉండును. దాని స్వరూపమును ఎవరును తెలిసికొనలేరు.

201. న్యగ్రోధః వటతరోర్మూలే - (వటవృక్షము క్రింద కూర్చుని) మౌనముగా పరబ్రహ్మతత్వాన్ని బోధించిన దక్షిణామూర్తి

202. వృక్షకర్ణస్థితః : ప్రళయకాలమందు వటపత్రశాయియై విష్ణురూపమున నుండువాడు. (బాలముకుందుడు).

203. విభుః . భక్తులనుగ్రహించుటకై వారు కోరుకొని ఆరాధించిన రూపములతో, శివ, విష్ణు, కృష్ణ, రామ, దుర్గ; గణపతి; స్కందాదులుగ ప్రత్యక్షమగువాడు. (వివిధ రూపేణ, హరి, హర, దుర్గా, గణేశ అర్క, అగ్ని, వాయ్వాది రూపేణ భక్తానాం అనుగ్రహాయ భవదీతి విభుః ) (శి స.నా.145, 635, 696 . వి.స.240, 880)

204. సుతీక్ష్ణ దశనః . పదునైనకోరలు గలవాడు . నృసింహావతారమున హిరణ్యకశిపుని, కృష్ణావతారమున కురు సంగ్రామమున విశ్వరూపముతో స్వామి కోరలలో చిక్కుకొనిపోయి, చావలేక బ్రతకనూలేక బాధపడిన కౌరవవీరులను చిత్రహింసల పాలుచేసెను "దంష్ట్రాకరాలాని భయానకాని, కేచిద్విలగ్నా దశనాంతరేషు సంధృశ్యంతెచూర్ణితై రుత్తమాంగైః" (భ గీ 11-27) అనేక బ్రహ్మాండ చణక చర్వణ క్షమా - దశనాయస్య స.సుతీక్ష్ణ దశనా : అనేక బ్రహ్మాండములను శనగలవలె నమిలివేయగల వాడి పండ్లు కలవాడు.

205; మహాకాయః : 206 మహాననః : గొప్పదేహము, గొప్ప ముఖము కలవాడు. ఈశ్వరుని శరీరాన్ని వేదాలూ, పురాణాలు, ఉపనిషత్తులూ అద్భుతంగా వర్ణించియున్నవి గీతలో విశ్వరూప వర్ణన ప్రామాణికమైనది. "అనాది మధ్యాంతమనంత వీర్యమనంత బాహుం శశిసూర్యనేత్రం పశ్యామిత్వాం దీప్తహుతాశ వక్త్రం స్వతేజసావిశ్వమిదం తపన్తం" "ద్యావా పృథివ్యో రిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యధి తం మహాత్మన్ . (భ.గీ 11-19,20)

ఆది, మధ్యాంతములు లేనివాడు అపారశక్తిమంతుడు. అనేక చేతులు, సూర్యచంద్రులు నేత్రములు, జ్వలించు ముఖము కలవాడు. జగత్తును తపింపచేయువాడు. భూమ్యాకాశములనుండు జాగా (అంతరము) అంతయు దశదిశలు అతనిచే నిండిపోయినవి. మహోగ్రమగు అద్భుతమైనదా రూపం. (వి.స.నా 39, 40)

## 25. విష్వక్సేనో హరిర్యజ్ఞః సంయుగాపీడ వాహనః ।
## తీక్ష్ణతాపశ్చ హర్యశ్వః సహాయః కర్మకాలవిత్ ।

207 విష్వక్సేనః : ఆయన దృష్టిపాతముచేతనే దైత్యసైన్యములు పారిపోవును. అంతటా పూజింపబడు సైన్యము కలవాడు. (వి.స నా 130.)

208 హరిః : సర్వమును సంహరించువాడు వానరరూపమున ఆంజనేయుడైనవాడు. (వి.స నా 651) సమూలముగ సంసారమును హరించువాడు.

సుందరకాండలో హనుమ హరి శబ్దముతో వ్యవహరింపబడియున్నాడు. హనుమ శివాంశతో జనించినవాడు బుద్ధి, బలం, యశస్సు, ధైర్యము, నిర్భయము, వాక్కులందు నైపుణ్యము, కార్యకౌశలములు గలవాడు. అందుచేత హనుమ శివుడే. (శి.స నా 377, 712, 787.)

209. యజ్ఞః : సృష్టికి బీజము. ''అహంక్రతు రహంయజ్ఞః స్వధాహమహ మౌషధం, మంత్రోహ మహమే వాజ్యమహమగ్ని రహం హుతం . (భ గీ.9-16) క్రతువులు, యజ్ఞములు, అందు ప్రయోగించు అన్నము, నేయి, అగ్ని, హోమాది ద్రవ్యములు, అప్పుడు పఠింపబడు మంత్రములు నేనే) యజ్ఞాత్మకుడగుటచే పరమేశ్వరుడు యజ్ఞవాచ్యుడు (వి స.నా 971, శి.స నా.216, 529 )

210. సంయుగా పీడవాహనః . సంయుగే సంప్రాప్తే ఆపద ఇవ ఆపీడో ధ్వజ భూతం వాహనం వృషరూపం యస్య శివుడు వృషభవాహనుడు, వృషధ్వజుడు. (యుద్ధమున ధ్వజముగా చేసుకొన్న వృషభమును వాహనముగా కలవాడు )

211. తీక్ష్ణతాపః : మధ్యాహ్నేతు మహేశ్వరః మధ్యందిన మార్తండుడై - తీవ్రమైన తాపమును (వేడిమిని) కలిగించువాడు. 2. అగ్నిరూపుడు.

212. హర్యశ్వః : అతివేగముగా పోవు అశ్వములు గల సూర్యరూపుడు (హరయః అతివేగవాహినః అశ్వాయస్య స హర్యశ్వః సూర్యస్తదాత్మా)

213. సహాయః : జీవునకు సఖుడు. ''ద్వాసుపర్ణా సయుంజా సఖాయా సమానం వృక్షం పరిష స్వజాతేతయోరన్యః పిప్పలంస్వాద్వత్త్య నశ్నన్నన్యో అభిచార శీతి. (ముం.ఉ.3-1-1) (శి.స.నా.811)

ఎల్లప్పుడు కలిసియుండు రెండు పక్షులు ఒకేవృక్షము నాశ్రయించి యున్నవి ఒకటి ఫలముల ననుభవించును మరొకటి ఊరక చూచుచుండును. ఒకటి జీవుడు మరొకటి ఈశ్వరుడు. ఈశ్వరుడు జీవుని శ్రేయోభిలాషి

214 కర్మకాలవిత్ : కర్మను, కాలములను (శాస్త్రోక్త విధులు) బాగుగ తెలిసినవాడు. ఏయే కర్మలు ఏయే కాలములందు నియమానుసారము చేయవలయునో తెలిసినవాడు

## 26. విష్ణుప్రసాదితో యజ్ఞః సముద్రో బడబాముఖః ।
## హుతాశన సహాయశ్చ ప్రశాంతాత్మా హుతాశనః ॥

215. విష్ణు ప్రసాదితః : విష్ణువు చేసిన పూజలచే ప్రసన్నుడైనవాడు. త్రిపుర సంహార సమయమున విష్ణువు శివునికి బాణమయ్యెను. వృషభ రూపముతో వాహనమయ్యెను నాట్య సమయమున మృదంగ వాద్యకారుడుగా, శక్తిగా అర్ధ శరీరముగా అయ్యెను. విష్ణువు శివుని పూజించుటకు కమలముల నుపయోగించెడివాడు. ఒకనాడు ఒక కమలము తక్కువాయెను. వెంటనే తన నేత్రమును పెరికి పూజించెను. అట్టి మహా శివభక్తునకు సుదర్శనచక్రమును, జగత్పరిపాలనత్వమును ఇచ్చెను.

బాణత్వం వృషభత్వమర్ధవపుషా భార్యాత్వమార్యాపతే
ఘోణిత్వం సఖితా మృదంగవహతా చేత్యాదిరూపం దధౌ
త్వత్పాదే నయనార్పణం చ కృతవాన్ త్వద్దేహభాగో హరిః
పూజ్యాత్పూజ్య తరస్స ఏవహి నచేత్కోవా తదన్యోఽధికః (శి ల.82)

216. యజ్ఞః · యజ్ఞోవైవిష్ణుః : యజ్ఞమే విష్ణువు విష్ణుస్వరూపుడు. (వి స నా 971; శి.స నా.209, 529)

217. సముద్రః : సముద్ర స్వరూపుడు.

218. బడబాముఖః : సముద్రజలమందుండు అగ్నిరూపుడు

219. హుంతాశన సహాయః : అగ్నికి సుఖుడు. వాయువు.

220. ప్రశాంతాత్మా : ఆకాశమువలె నిర్మలుడు. ప్రశాంతుడు.
21‥ నుండి 220 వరకు గల నామములు భూమి, నీరు, నిప్పు, గాలి, ‥ాశములను పంచ భూతములను సూచించుచున్నవి.
ప్రశాంతమనసంహ్యేనం యోగినం సుఖముత్తమమ్
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్) భ.గీ.6-27.

ప్రశాంత మనస్కునికి, ఆత్మనిష్ఠునికి, రజోగుణ రహితునికి బ్రహ్మానంద అనుభూతి కలుగును.

221 హుంతాశనః . అగ్నిరూపుడు. ''అగ్నావిష్ణూ''.

**27. ఉగ్రతేజా మహాతేజా జన్యో విజయకాలవిత్ ।**
**జ్యోతిషామయనం సిద్ధిః సర్వవిగ్రహ ఏవచ ॥**

222. ఉగ్రతేజాః : సహింపరాని తేజస్సు కలవాడు. హనుమంతుని చూచిన రావణుడు. ''కిం వైష్ణవం కపిరూపమేత్య రక్షో వినాశాయ పరం సుతేజాః' నూనమేషోఽగ్ని రాయాతః కపిరూపేణ హా'' (సుంద.కాం).
గీతోపదేశ సమయమున భగవానుడి ఉగ్రరూపాన్ని చూచి అర్జునుడు దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా । యది భాస్సదృశీ సాస్యాత్ భాసస్తస్య మహాత్మనః (భ.గీ 11-12) ఆకాశమందొకేసారి వెయ్యి సూర్యులుదయించి నచో కలుగు ప్రకాశము ఆ మహాత్ముని తేజమున కొకింతసాటి యగును.

223. మహాతేజః : పరంజ్యోతి స్వరూపుడు. ఆ జ్యోతిని దర్శించుటకు చర్మ చక్షువులు చాలవు జ్ఞాన నేత్రముతోనే చూడనగును
జ్యోతిషామపిత జ్యోతిః · ''యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజోవిద్ధిమామకమ్'' భ.గీ.15-12
సూర్యుని ఏప్రకాశము లోకమంతటినీ వెలిగించుచున్నదో, చంద్రుని యందును, అగ్నియందును ఏ ప్రకాశము కలదో ఆ ప్రకాశమంతయు నాదే. స్వయంప్రకాశకుడు. (వి.స.నా 673)

224. జన్యః : సంగ్రామమున మహా నేర్పు కలవాడు.

225. విజయకాలవిత్ : ఏ కాలమందు పనిని చేసినచో అది జయప్రదమగునో అట్టి కాలమును తెలిసినవాడు. ''శూరోఽపి కాలజ్ఞానాభావే పరాజితో భవతీతిగమ్యః'' శూరులుకూడ, కాలజ్ఞానము లేనిచో, పరాజితులగుట తథ్యము. త్రిపుర సంహారము; జలంధరుని సంహారాదులందు, శివుడు 'కాలము'ను గుర్తించి - సమయము చూచి - కార్యోన్ముఖుడై, విజయము సాధించెను.

226. జ్యోతిషామయనం : జ్యోతిష శాస్త్రమందు దిట్ట. గ్రహములను నడిపించువాడు కూడా శివుడే.

227. సిద్ధిః : జయరూప సిద్ధియైనవాడు. నిరతిరశయరూప, సర్వ వస్తువులందలి సంవిద్రూప, ఫలస్వరూపమైన ''సిద్ధి'' పరమేశ్వరుడే. ఇతర సిద్ధులు అనగా అణిమ, గరిమ, లఘిమ మున్నగునవి సిద్ధులు కానీ స్వర్గప్రాప్తికూడా నశించునవే యగుటచేత - శాశ్వతసిద్ధి పరమేశ్వరుడే. (వి.స.నా 99)

228 సర్వవిగ్రహః . అన్నిరూపములు తనవైనవాడు దేశ, కాల, వస్తువులన్నియు ఆయన రూపములే.

**28. శిఖీముణ్డీ జటీ జ్వాలీ మూర్తిజో మూర్ధగో బలీ ।
వేణవీ పణవీ తాలీ ఖలీ కాలకంటకః ॥**

229. శిఖిః . శిఖ కలవాడు. గృహస్థ లక్షణము కలవాడు. (శి.స నా 13)

230. ముండీ : సన్న్యాసి (వ్యుప్తకేశాయచ) (రుద్రం)

231. జటీ : జడలు కలవాడు. వానప్రస్థుడు.

232. జ్వాలీ · ఇతడు దీప్తహుతాశనుడు చక్కగా మండుచున్న అగ్నినుండి బయల్వెడలు జ్వాలవంటివాడు. జ్వాలలచే పరివృతుడు. అర్చిరాది జ్యోతిర్మార్గము కూడా శివుడు.

233. మూర్తిజః · ఆకాశములో ఆవిర్భవించువాడు.

234. మూర్ధగః : మూర్ధ్ని : సహస్రారము : అందు సంచరించెడివాడు (సహస్రారే పద్మే సహరహసి పత్యావిహరసే) సౌం.ల.
సహస్ర కమలమందు నీ భర్తయగు సదాశివునితో గూఢముగా విహరించెదవు.

235. బలీ : బలవంతుడు. బలవికరణాయ నమో, బలయనమో, బలప్రమధ నాయ నమః'' - (పంచముఖ ధ్యానమందలిది)

236. వేణవీ : శ్రీకృష్ణావతారమున వేణవును ధరించెను

237. పణవీ : పణవమనెడి వాద్యము కలవాడు. డమరుకము దానినుండే స్వరము లుద్భవించినవి.

238. తాళీ · తాళమనెడి వాద్యమును ధరించినవాడు

239. ఖలీ : ధాన్యముల ప్రోగుచేయు కళ్ళము. దానికధిపతి. (రుద్రమందు - ఖల్యాయచః)

240. కాలకంటకః : కాలుడనగా యముడు. అతడు దేవికి లోబడినవాడు. దేవి శివునికి ఆధీనురాలు. ఇట్లు యముడు శివునకధీనుడు. ఈశ్వర మాయను ఆవరించియుండువాడు.

**29. నక్షత్ర విగ్రహమతిః గుణబుద్ధిర్లయోగమః ।
ప్రజాపతిర్విశ్వబాహుః విభాగస్సర్వ గోముఖః ॥**

241. నక్షత్ర విగ్రహమతిః : నక్షత్ర విగ్రహమను కాలచక్రముయొక్క గమనమును తెలిసినవాడు. కాలజ్ఞుడు. దైవజ్ఞుడు.

242. గుణబుద్ధి : త్రిగుణాత్మకుడైన జీవస్వరూపి. జీవుడు గుణబుద్ధుడు.
2. త్రిగుణముల లక్షణముల నెరిగినవాడు

243. లయః : అంతటిని తనయందు విలీనమొనర్చుకొనువాడు.
(లీయతే అస్మిన్ సర్వః ఇతిలయః) ''యధోర్ణనాభి సృజతే గృహ్ణాతేచ''
(ముండ ఉప) : సాలెపురుగు తనలోని పదార్థముతో గూడును నిర్మించి తిరిగి దారములను తనలోకి లాక్కొంటుంది. అదేవిధముగ శివుడు జగత్తును సృష్టించి తిరిగీ తనలో లీనము చేసికొనును.

244. ఆగమః · చలనరహితుడు - కూటస్థుడు.
శివుని పంచముఖములనుండి వేదసమ్మితములైన ఆగమ శాస్త్రము ఉద్భవించినది. శైవ, శక్తి, వైష్ణవ ఆగమములన్నియు ఆయన నుండే కలిగినవి అందుచే ఆగమరూపుడు.

245 ప్రజాపతిః · విరాడ్రూపుడు. అందరినీ కాపాడువాడు.
అపోవా ఇద మానస్సలిలమేవ సప్రజాపతిరేకః పుష్కర పర్ణే సమభవత్ సృష్టికి పూర్వము ప్రజాపతి అయిన పరమాత్మ జల రూప ప్రకృతిపై పుష్కర పర్ణమునందు (బంగారు తామరాకుపై నుండెను).

246. విశ్వబాహుః : ఎటుచూచినా అతని చేతులే అతని కాళ్లే. అతని ముఖములే. అందరి చేతులు వాటి చేతలు ఆయనవే. ''విశ్వత చక్షు రుత విశ్వతోముఖో, విశ్వతోహస్త ఉత విశ్వతస్పాత్'' (మహానారా.ఉప. వి.స.నా.316 )

247. విభాగః : విభజింపబడువాడు. తానొక్కడయ్యు పెక్కుజీవులుగను తత్త్వములుగను విభాగము చేయబడియున్నాడు. వ్యష్టిరూపము. (జీవుడు).

248. సర్వగః : అంతటా ఉండువాడు. సమష్టిరూపుడు. (శివుడు)

249. అముఖః : భోగసాధనమైన ముఖములేనివాడు. అనగా అభోక్త సుఖదుఃఖాదులైన ద్వంద్వములు లేనివాడు.
(248, 249 కలిపి సర్వతోముఖః అని కొన్ని ప్రతులలో కలదు)

## 30. విమోచన స్సుసరణో హిరణ్యకవచోద్భవః ।
## మేఢ్రజో (మేఘజో) బలచారీచ మహాచారీస్తుతస్తథా ॥

250. విమోచనః : సంసార బంధములనుండి విమోచనము కలిగించువాడు,

251. సుశరణః : శోభన కరణం రక్షిత్వత్వం అస్య అపునరావృత్తిగృహమిత్యర్థః. శోభనమైన రక్షగలిగి పునరావృత్తి రహితమైన గృహము అతని పరంధామమును చేరినచో మరుజన్మలేదు (లేక) సుసరణః : సులభముగా లభ్యమగువాడు.

శరణదం సుఖదం శరణాన్వితం శివ శివేతి శివేతి నతంనృణామ్ ।
అభయదం, కరుణావరుణాలయం । భజతరే మనుజా గిరిజాపతిం ॥

252. హిరణ్య కవచోద్భవః హిరణ్యమనగా హరించునది. అనగా మాయ ఆ మాయా వికారమే కవచనమువంటి ఆవరణము (ఉపాధి)నందు జనించినాడు. ''హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం'' (ఈశ.ఉప-15). అతని నిజస్వరూపమును మాయ అనెడు బంగారు తెర తన తళతళలతో మరుగుపరచుచున్నది. ఆ తెర తొలగనిదే సత్యదర్శనము కాదు అని త్యాగయ్యకూడా గానము చేసాడు ''నాహం ప్రకాశ సర్వస్య యోగ మాయా సమావృతః'' (భ.గీ.7-25). యోగమాయచే కప్పబడిన నేను సర్వులకు కానరాను

253. మేఢ్రజః . లింగమునందుద్భవించినవాడు.
మేఘజః . మేఘమందు పుట్టిన - విద్యుల్లత, నీరుకూడ శివుడే. ''నమోమే ఘ్యాయచ'' (రుద్రం) · ''ధూమ జ్యోతిస్సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః'' అను కాళిదాస సూక్తిచే మేఘమనగా పొగ, అగ్ని, నీరు, గాలి - వీటి కలయికే మేఘము. ఇవన్నియు శివ స్వరూపములే.

254. బలచారీ : ప్రమథ గణములతోడ సంచరించువాడు. వనచరుడు. కిరాత వేషధారి. బలమనగా వనము. అందుచే వనచరుడు. కిరాత రూపము ధరించి అర్జునుని బలపరీక్ష గావించినవాడు.
స్వామిన్ । ఆదికిరాత । మామక మనః కాంతార సీమాంతరే (వాసంకురు) ఓ ఆది కిరాతమూర్తీ! నా హృదయమను మహారణ్యమున నివసింపుము

255. మహీచారి : భూమియందు సంచరించెడివాడు.

256. స్రుతః : అంతటా యుండువాడు; సర్వవ్యాపి.

## 31. సర్వతూర్యవినోదీచ సర్వాతోద్య పరిగ్రహః । వ్యాళరూపో గుహావాసీ గుహోమాలీ తరంగవిత్ ॥

257. సర్వతూర్య వినోదీ : సమస్త వాద్యఘోషలందు ప్రీతిగలవాడు.

258. సర్వతోద్య పరిగ్రహః : విశ్వమంతయూ అతని కుటుంబమే. జీవులు అల్పజీవులు. పశువుల వంటివారు. ఇతడు పశుపతి.
(మాతాచా పార్వతీదేవీ పితాదేవో మహేశ్వరః) అందరినీ స్వీకరించినవాడు.

259. వ్యాళరూపీ : ఆదిశేషుని రూపమైనవాడు. (అనంతశ్చాస్మినాగానం)

260. గుహావాసీ : హృదయగుహలో నుండువాడు. (నిహితం గుహాయా, పరమే వ్యోమన్) (తై.ఉ 2-1)

261. గుహః . షణ్ముఖుడు 2. ''నాహం ప్రకాశ సర్వస్య యోగమాయా సమావృతః'' భ గీ. నిజమాయా శక్తిచేత తన స్వరూపాలను తెలియనీయనివాడు. (శి స నా.875; వి.స.382)

262 మాలీ : పుష్పమాలలు, బిల్వమాలలు, రుద్రాక్షమాలలు, కపాలమాలలు ధరించినవాడు.

263. తరంగవిత్ · జగదుత్పత్తి స్థితి, లయములు, సుఖదుఃఖములు మొదలగు తరంగముల స్వభావముస్ తెలిసినవాడు

**32. త్రిదశస్త్రికాలధృక్కర్మ సర్వబంధ విమోచనః ।**
**బంధన స్త్వసురేంద్రాణాం యుధి శత్రువినాశనః ॥**

264 త్రిదశః : తిస్రోదశాః జన్మస్థితినాశః ప్రాణానాం
యస్మాదితి సృష్టిస్థితి లయములందుండు వాడు.
జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల యందుండువాడు

265. త్రికాలధృక్ : భూతభవిష్యద్వర్తమానములను ధరించువాడు.

266. కర్మసర్వబంధ విమోచనః : లోకోఽయంకర్మ బంధనః
కర్మలు (మంచివిగానీ, చెడ్డవికానీ) బంధదాయకములు. (శుభాశుభ కర్మలు) ఆ బంధములే మాత్రము మిగిలియున్ననూ జన్మ తప్పదు. నైష్కర్మ్యసిద్ధి పొందుటకు - బంధరాహిత్యము పొందుటకు - శివునే మనము శరణు పొందవలయును. ఆయనే మన బంధములను తొలగించగలడు.

267. బంధనస్త్వ సురేంద్రాణాం శివుడు కర్మఫలప్రదాత అసురులైన వారిని ఆశాపాశములచే కట్టివేసి, అశుభములైన అసురయోనులలో పడవేయును బలిచక్రవర్తిని పాతాళమున పడద్రొక్కినవాడు.

268. యుధి శత్రువినాశనః : యుద్ధమున శత్రువుల నాశము గావించినవాడు. ద్వాపరయుగాంతమున కురుపాండవ సంగ్రామమున మహా భయంకర యక్షరూపుడై - అక్షౌహిణీయుత సైన్యమును చంపినవాడు అర్జునుడొక్కడే ఆరుద్ర స్వరూపాన్ని చూడగలిగినవాడు.

**33. సాంఖ్య ప్రసాదో దుర్వాసాః సర్వసాధు నిషేవితః ।**
**ప్రస్కందనో విభాగజ్ఞో హ్యతుల్యో యజ్ఞ భాగవిత్ ॥**

269. సాంఖ్యప్రసాదః : సాంఖ్యమనగా జ్ఞానము. ఆత్మానాత్మ వివేకము దానిని ప్రసాదించువాడు శివుడు. (దదామిబుద్ధి యోగంతం యేన మాము పయాంతితే। తేషామేవానుకంపార్థం అహమజ్ఞానజం తమః నాశయా

మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా) భగీ.10-10, నన్ను చేరుటకు వారికి జ్ఞానమును ప్రసాదించెదను వారి అజ్ఞానాంధకారాన్ని తొలగించి జ్ఞానప్రకాశమిచ్చి, మోక్షమును ఒసంగెదను దక్షిణామూర్తిగా, దత్తాత్రేయుడుగా, శ్రీకృష్ణభగవానుడుగా, జగద్గురువుగా అవతరించును

270. దుర్వాసః : రుద్రాంశ సంభూతుడైన దత్తాత్రేయుని సోదరుడు దుర్వాసుడు : ప్రకృతిలోని కోపము, క్రోధములయొక్క పుంరూపమే దుర్వాసము. రుద్రుని కోపము అపరిమితమైనది. రుద్రమందు ''నమస్తే రుద్ర మన్యవ'' అని ప్రార్థించెదము. అతని కోపమునకు నమస్కారము. (శి.స.నా. 278)

271. సర్వసాధునిషే వితః : సర్వసజ్జనులచే సేవింపబడినవాడు

272. ప్రస్కందనః . బ్రహ్మాదులకే పతనము కలుగజేయువాడు

ప్రళయ కాలమందే కాదు ఎల్లప్పుడూ దేవాసురాదులను కూడా స్థానభ్రంశము చేయగలవాడు.

273. విభాగజ్ఞః : వారి వారి కర్మలకు తగినట్లు ఫలములను విభాగించి యిచ్చువాడు.

274. అతుల్యః : సాటిలేనివాడు, అతనికి సమానులుగానీ; అధికులుగానీ లేరు ''నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యోలోకత్రయే ఽప్యప్రతిమ ప్రభావ?'': మూడులోకములందు నీకు సమానుడే లేడు. ఇక అధికుడెక్కడుండును? నిరుపమాన ప్రభావుడా! అందరికన్నా నీవే అధికుడవు : భ గీ. 11-43 (వి.స.నా 355).

275. యజ్ఞభాగవిత్ : యజ్ఞమందు హవిర్భాగములను ఆయాదేవతలకు ఉచితరీతిని విభజించుటను బాగుగ తెలిసినవాడు.

## 34. సర్వవాసః సర్వచారీ దుర్వాసా వాసవోఽమరః । హైమో హేమకరో యజ్ఞః సర్వధారీ ధరోత్తమః ॥

276. సర్వవాసః : అంతటా నివసించువాడు.
(అంగింగె నాదబడి ఎంగుం ప్రకాశమాయ్ ఆనందమూర్తి యాగి అరుళోడు నిరందదెదు) : తాయుమానవర్ : అక్కడ ఇక్కడ అనక అన్నిచోట్ల ఆనందమూర్తిగా ప్రకాశించు కరుణామయుడు.

277. సర్వచారి : అతడు అంతటా సంచరించగలవాడు (శి స నా 366)

278. దుర్వాసః : ఏనుగు యొక్క పచ్చి చర్మమును వస్త్రముగా ధరించినవాడు దుర్లభమగు వస్త్రము కలవాడు. ''నిర్మలస్యకుతః స్నానం వస్త్రం

విశ్వోదరస్య?'' విశ్వమే ఉదరముగా గలవానికి వస్త్రమెక్కడినుంచి తేగలము? (శి.స నా. 270)

279. వాసవః : దేవానామస్మివాసవః (భ గీ. 10.22) దేవతలలో ఇంద్రుడను

280. అమరః : మరణములేనివాడు : దేవతలు అమరులే కానీ వారందరూ ప్రళయ మందు మృత్యువువాత పడవలసినవారే. (శి.స నా. 959)

281. హైమః హిరణ్మయుడు (2) స్థావరాణాం హిమాలయః (భ.గీ 20 25) హిమవత్పర్వతము, (3) హిమము . శుద్ధచైతన్యము; స్వచ్ఛమైనది (4) చల్లని మనస్సు కలవాడు.

నమోహిరణ్యబాహువే, హిరణ్య వర్ణాయ, హిరణ్య రూపాయ హిరణ్యపతయే ఉమ్బికాపతయ ఉమాపతయే పశుపతయేనమోనమః.

282. హేమకరః : స్వర్ణకర్త : జంబూద్వీప చిహ్నమైన జంబూ నేరేడు వృక్షము నుండి పడిన పండు బంగారము అగునని శివపురాణము చెప్పుచున్నది.

283. అయజ్ఞః · యజ్ఞములన్నియు ''అపూర్వ'' మనబడు ఫలముల నొసంగును. అవన్నియు త్రిగుణాత్మకములు. ఆయన వాటికి అతీతుడు. అతడు సాక్షిమాత్రుడే.

(నిష్కర్మః పారాంత రము) కర్మసన్యాసి. ''అనాదిత్వానిర్గుణత్వా త్పరమాత్మాఽయమవ్యయః శరీర స్థోపికౌన్తేయ న కరోతి నలిప్యతే'' (భ.గీ. 13-32) పరమాత్మ నిర్గుణమగుటవల్ల శరీర మందున్ననూ అతనికి కర్మఫల మంటదు.

284. సర్వధారీ : సకలమును ధరించువాడు, గామా విశ్వచభూతాని ధారయామ్యహ మోజసె : (భ.గీ. 15:13). నేను భూమిలో ప్రవేశించి సమస్త భూతజాలము లను నా దివ్యశక్తిచే భరించుచున్నాను : (మోయుచు, పోషించుచున్నాను)

285. ధరోత్తమః : ధరించువారిలో (వాహకులలో) ఇతడే ఉత్తముడు. భూమిని మోయువాడు ఆదిశేషుడు. ఆ ఆదిశేషుడు శంకరుని చేతి కంకణముగా యున్నాడు. అష్టదిగ్గజములు, కుల పర్వతములు, ఆది కూర్మము మున్నగువాటికి ఆధారము శివుడే -

## 35. లోహితాక్షో మహాక్షశ్చ విజయాక్షో విశారదః ।
## సంగ్రహో నిగ్రహః కర్తా సర్పచీర నివాసనః ॥

286. లోహితాక్షః ఎర్రని నేత్రములు కలవాడు. మన్యు (కోపము) స్వరూపుడైనందు వలన కండ్లు ఎర్రగా ఉండును.

287. మహోక్షః : మహాంతి విశ్వవ్యాపకాని అక్ష్యాణి ఇంద్రియాణి యస్యస మహోక్షః · కన్నులు అన్ని ఇంద్రియములకంటె ప్రధానమైనవి. అవియే గొప్పవైనప్పుడు ఇతర ఇంద్రియముల గూర్చి చర్చించ పనిలేదు. అతని చూపులో పడకుండా తప్పించుకొనునదేదియు లేదు. విశాలమైన నేత్రములు కలవాడు. (వి.స.నా . 353)

288. విజయాక్షః : అక్షము అనగానే రథము స్ఫురించును - విజయావహః అక్షోపలక్షితో రథోయస్యసః. విజయవంతమైన రథము భూమి; దానికి పూన్చిన అశ్వములు వేదములు; చక్రములు సూర్యచంద్రులు; సారథిబ్రహ్మ : అటువంటి రథము కలవాడు. (2) అతని కరుణా కటాక్షములవల్ల విజయముచేకూరుతుంది.

కేనోపనిషత్తులోని దేవదాన యుద్ధము :
ఆ యుద్ధ సమయమున నంది వాహనారూఢులై పార్వతీ పరమేశ్వరులు పోవుచున్నారు. శివుడు యోగ నిద్రలో ఉన్నాడు. దేవతల ధాటికి దైత్యులు పారిపోతున్నారు. పార్వతి స్వామితో ''దైత్యులు పడుతున్న బాధలు చూడండి'' అనగానే రాక్షసులను చూచాడు. ఒక్కసారిగా విజృంభించి దేవతలపై బడినారు. దేవతలు చెల్లాచెదరై పారిపోతున్నారు. శివుని తిరిగి చూడమన్నది. ఈసారి దేవతలను చూచాడు. అంతే దేవతలకు ఎక్కడలేని శక్తి వచ్చింది. రాక్షసులు ఓడిపోయారు. అందుచేత శంభుని చల్లని చూపులు ఎవరిమీద పడుతాయో వారికి విజయము తథ్యము.

289. విశారదః : పండితుడు

290. సంగ్రహః : అందరినీ తనవశము చేసికొనువాడు. ''అనన్యాశ్చింత యంతోమా యేజనాః పర్యుపాసతే తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం'' (9:22). ఎవరు నన్ను నిశ్చల భక్తితో ఉపాసించెదరో అట్టివారి యోగక్షేమము లను నేను భరించెదను.

291. నిగ్రహః : ఇంద్రాదులు, ఇంద్రియములు, దుష్టులు అందరూ నిగ్రహింప బడెదరు. ''పరిత్రాణాయ సాధునాం వినాశాయ చ దుష్కృతాం ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే (భ.గీ. 48) అధర్మము ప్రబలినప్పుడు సాధువులను రక్షించుటకు; దుష్టులను శిక్షించుటకు అవతరించెదను.

ఈశ్వరానుగ్రహము వలన ఇంద్రియ నిగ్రహము కలుగును. (వి.స. 762)

292. కర్తా : చేయువాడు. సర్వ స్వతంత్రుడు. ఆయన అధీనములోనుండు ప్రకృతియే అన్నింటిని చేయును. ''అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ఇతి మత్వాభజంతేమాం బుధాభావ సమన్వితాః'' భ.గీ 10 8.

సర్వమునకు భగవంతుడే జన్మకారణము అతడే పోషకుడు అని గుర్తించిన జ్ఞాన సంపన్నులు అతనిని భజించుచున్నారు (వి స నా 379)

293 సర్వచీర నివాసనః ఇతడు పాముతోలును వస్త్రముగా ధరించును మరియు పాములతో తన వస్త్రములను గట్టిగా బిగించును విశ్వమునందు శివుని యొక్క విరాట్ రూపము మినహా మరేదియులేదు

## 36. ముఖ్యోఽముఖ్యశ్చ దేహశ్చ కాహలిః సర్వకామదః । సర్వకాల ప్రసాదశ్చ సుబలో బలరూపధృత్ ॥

294 ముఖ్యః - పరముడు : - ''ప్రథమో దైవ్యోధిషక్'' - ఇతడాదిదేవుడు. అగ్రగణ్యుడు.

295. అముఖ్యః - అతనికి మించిన వారెవరూ లేరు శివుడు విశ్వంభరుడు. పిపీలికాది బ్రహ్మపర్యంతము అతని స్వరూపములే ఈశావాస్యమిదం సర్వం (2) అపగల్భాయచ (రుద్రం) ఒరి అమాయకుడు :

296 దేహః దేహముకూడా ఆయనే, దేహోదేవాలయ ప్రోక్తో. దేహము దేవాలయము దేహము శివశక్త్యాత్మకము, మూలాధారమందలి కుండలిని మేల్కొలిపి షట్చక్రములను, మూడు గ్రంధులను దాటించి సహస్రారమందలి సదాశివునితో కూర్చులయే దేహముయొక్క ఉపయోగము. ఈ దేహము 36 తత్త్వములతో గూడినది. శివ సంకల్పముద్వారా నఖశిఖపర్యంతము కల అవయవములను రౌద్రీకరణమొనర్చుట మహాన్యాసము. అప్పుడు దేహము, దానిలోని ప్రతి అవయవము శివ స్వరూపమే అగుచున్నది.

297. కాహళః : మద్దెలవంటి వాద్యము కలవాడు.

298. సర్వకామదః - భక్తుల కోర్కెలనన్నింటినీ ఇచ్చువాడు. రుద్రాధ్యయమందలి చమక భాగము అంతయు సమగ్రమైన కోరికల జాబితా. వాటి నన్నింటినీ శివుడు ఇచ్చును.

299. సర్వకాల ప్రసాదః : సర్వకా[illegible] ఆయన అనుగ్రహమును కురిపించును. దానికి తిథివా[illegible], వేళలు లేవు.

300 సుబలః . దుష్టశిక్షణకు [illegible] కావలసినంత బలము గలవాడు అతిసమర్థుడు. కేవలం కండ[illegible] బుద్ధిబలం, యశస్సు, ధైర్యం, అరోగత్వము, వాక్పటుత్వము వంటి [illegible]పన్నుడు.

301 బల రూపధృతః (1) బలరాముని రూపమును ధరించినవాడు (2) ఇతనికి శరీరబలమేగాక రూపసౌందర్యముకూడా కలదు సుందరమూర్తి ''సమస్సమ విభక్తాంగః స్నిగ్ధవర్ణ ప్రతాపవాన్'' (రామాయణం)

**37. సర్వకామ వరశ్చైవ, సర్వదః, సర్వతోముఖః ।**
**ఆకాశ నిర్విరూపశ్చ నిపాతీ హ్యావశః ఖగః ॥**

302. సర్వకామవరః సర్వకామములలో శ్రేష్ఠమైన కామము మోక్షము ఆయన మోక్షస్వరూపము; మోక్షమును పొందుట అనగా శివుని పొందుటే.

303. సర్వదః అన్నింటినీ ఇచ్చువాడు భక్తపరాధీనుడు తననే భక్తుని కిచ్చుకొంటాడు

304. సర్వతోముఖః : అంతటా ఆయన ముఖములున్నవి
(సర్వతః పాణిపాదంతత్ సర్వతోక్షి శిరోముఖమ్ . భ.గీ. 13-14)
విశ్వతః పాణి పాదాబ్జం విశ్వతోఽక్షి శిరోముఖం
జ్వలన్తం విశ్వమావృత్య తేజోరాశిం శివం స్మరేత్

305 ఆకాశ నిర్విరూపః - వాయువు ఆకాశమందుండును. కానీ వాయువు యొక్క వికారములు ఆకాశము నేవిధముగనూ బాధింపదు అదే విధముగ జగత్తుచే శివుడు బాధింపబడడు అనేక రూపములను శివుడు చేయును.`కానీ శివుడు నిరాకారుడు - ''యథాసర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే సర్వత్రావస్థితో దేహే తథాత్మానోపలిప్యతే - (భ.గీ 13-33)

306. నిపాతః : కల్మషమైన శరీరమందు, నశించు జగత్తునందు ఉంటూ ఉండినమా, శ్మశానవాసియైనను, ఆయనకు పతనము లేదు. ఆయన పవిత్రుడు, నిర్మలుడు, నిత్యుడు, అవ్యయుడు, అచ్యుతుడు.

307. అవశాయః : ఎవరికీ వశుడు కాడు దేహమునందుండినమా, అపరిహార్యము లైన సుఖదుఃఖాదులు జనన మరణాదులుండినమా, దేనికీ వశుడుకాడు సర్వతంత్రస్వతంత్రుడు.

308. ఖగః : (హృదయ) ఆకాశమున చరించువాడు.

పక్షులు పంజరమున యున్నంతవరకూ బంధింపబడి యుండును. అట్లే జీవులు దేహమున బంధింపబడి యున్నంత వరకూ అస్వతంత్రులే. ఆ సుఖదుఃఖముల ననుభవించవలసినదే. లేక సంసార వృక్షమందు జీవుడను పక్షికి సహచరుడై సాక్షి మాత్రుడైన పక్షివంటివాడు.

**38. రౌద్ర రూపోంశురాదిత్యో బహురశ్మిః సువర్చసీ ।**
**వసువేగో మహావేగో మనోవేగో నిశాచరః ॥**

309 రౌద్రరూపః · మిక్కిలి భయంకర రూపుడు. మహాకాలభైరవ రూపుడు (శి.స.నా. 115)

310. అంశుః : అంశుడను దేవతా స్వరూపము కలవాడు (2) ప్రకాశించు కిరణములు కలవాడు.

311. ఆదిత్యః - సూర్యుడు "ఉతైనం విశ్వా భూతాని సదృష్టో మృడయాతినః" : (రుద్రసూక్తం) సర్వలోకములకు ప్రత్యక్షముగా కనబడుచున్న ఆదిత్య రూపుడగు రుద్రుడు మాచే చూడబడి మాకు సుఖమిచ్చుగాక (2) సూర్య మండలాం తర్వర్తి (3) పండ్రెండు మాసములే ద్వాదశాదిత్యులు - వీరు సర్వమును గ్రహించుచు వెళ్ళుచున్నారు కావున ఆదిత్యులని పేరుపొందిరి. (బృ ఆ ఉ.ప. 3-9-5) (4) న విద్యతే వినాశోస్యేయ మదితిః అదితి దేవ ఆదిత్యః. వినాశము లేనివాడు - (వి స నా 563.)

312. బహురశ్మిః : అనేక కిరణములు కలవాడు. "అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రు స్సుమంగళః" - రుద్రం ఏ మహారుద్రుడు సర్వలోకములకు ప్రత్యక్షముగా అకాశమందు ఆదిత్య రూపుడై ఉదయమున మిక్కిలి రక్త వర్ణుడుగను, పిదప కొంచెము ఎర్రగాను, తర్వాత బంగారు రంగు కలిగి, ఎల్లప్రాణులకు శుభము చేకూర్చునో అతనికి నమస్కారములు సూర్య కిరణములు స్వతహాగా తెల్లనివైనను వాతావరణములోని మార్పువలన అనేక రంగులుగా తోచును.

313 సువర్చసః : మంచి వర్చస్సు కలవాడు

314 వసువేగః : వాసయతి, స్థాపయతి, ఏ తత్ సర్వం ఆత్మనీతి వసుర్వాయుః తస్యవేగోయస్యః, అన్నింటినీ ఆత్మయందు వసింప జేయునదిగాన వసు అనగా వాయువు. వాయువేగము గలవాడు. (2) అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుడు, దివి, చంద్రుడు; నక్షత్రములు - అనునవి వసువులు. వీని యందలి సంపదలు (వసువులు) సర్వలోకములకు హిత మొనర్చునవి గాన వసువులన బడుచున్నవి. వీటన్నింటికీ వేగము కలదు. వానిలో వాయువేగము ప్రత్యేకమైనది. (బృ.అ.ఉప. 3-9)

315. మహావేగః : మహావేగము కలవాడు.

316. మనోవేగః : మనస్సుకంటే వేగముగా పోగలవాడు
"మనసోజవీయోః తద్ధావతోఒ న్యానత్యేతి తిష్ఠత్" - (ఈశ - ఉప : 4) ఆత్మ మనస్సుకంటె ముందుగా పోయివుంటుంది. అది కదలనిది అయ్యు అమిత వేగముగా పోగలదు.
"నమస్తిష్ఠద్భ్యో దావద్భ్యశ్చవోనమః" రుద్రం తిష్ఠద్భ్యః . నిశ్చలముగా నుండు వట్టి వః : మీకు; దావద్భ్యః - పరుగెత్తువట్టియు వః మీకు; నమః = నమస్కారము.

317. నిశాచరః రాత్రులందు చరించువాడు తస్కరులకు పతి, భూత ప్రేత పిశాచగణములకధిపతి. శ్మశానవాసి అయినందున రాత్రులందు తిరుగు చుండును 2 ఆయన యోగేశ్వరుడు, అజ్ఞానమను చీకటిలో జీవులందరూ నిద్రించుచుండగా, ఆయన జ్ఞాని కావున మేల్కొని యుండును (యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ) (భ.గీ 2-69)

## 39. సర్వవాసీ శ్రియావాసీ । ఉపదేశకరోకరః ।
## ముని రాత్మనిరాలోకః సంభగ్నశ్చ సహస్రదః ॥

318. సర్వవాసీ · అన్నిచోట్ల నివసించువాడు. అన్ని శరీరములందుండువాడు ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి (భ గీ. 18-6)
ఈశ్వరుడు సర్వభూతముల హృదయమందున్నాడు.

319. శ్రీయావాసీ (1) శ్రీ · సంపదలు. సంపదలతో నుండువాడు. (2) శ్రీ యనగా ఋక్సామ యజుర్వేదములు, వేదములందుండువాడు (3) శ్రీ విద్యయందుండువాడు.

320 ఉపదేశకరః : ఉపదేశించువాడు వటవృక్షముక్రింద కూర్చొని మునులకు జ్ఞానోపదేశము చేసిన దక్షిణామూర్తి స్వరూపుడు, జగద్గురువు.

321 అకరః . ఏమియు చేయనివాడు, ఉపదేశముకూడ మౌనవ్యాఖ్యగానే జరిగినది ఆయన అకర్త ''ప్రకృత్యై వచ కర్మాణి క్రియమాణాని సర్వశః యః పశ్యతి తథాత్మాన మకర్తారం సపశ్యతి'' (భ గీ. 13-30) ప్రకృతిచేతనే ఎల్ల కర్మలు చేయబడుచున్నవి ఆత్మ దేనికినీ కర్తకాదు పరమాత్మకు ఏ పని చేయవలసిన అవసరము లేదు

322. మునిః : మౌనముగా యుండువాడు. మనన శీలుడు.
దుఃఖేష్వనుద్విగ్నమనా సుఖేషు విగతస్పృహః
వీతరాగ భయక్రోధః స్థితధీర్మని రుచ్యతే (భ.గీ. 2-56)
దుఃఖములందు క్షోభనందక, సుఖములందు పొంగిపోక రాగము, భయము, క్రోధములను వర్జించిన ధీరుడు ముని అని చెప్పబడుచున్నాడు. మౌనము వహించియే దక్షిణామూర్తిగా పరబ్రహ్మ తత్వాన్ని చక్కగా బోధించెను.

323. ఆత్మనిరాలోకః : ఆత్మయందే దృష్టి కలవాడు. ఆత్మ క్రీడారతుడు. 2. జీవాత్మకు సాక్షిభూతుడై భూత భవిష్యద్వర్తమానముల తెలిసినవాడు.

324. సంభగ్నః అందరిచే పూజింపబడువాడు ''నిర్జరాః కోటీరోజ్జ్వల రత్నదీప కలికా నీరాజనం కుర్వతే'' (శి ఐ 65) దేవతలందరూ నీకాళ్ళమీద పడి మ్రొక్కుచు తమ కిరీటములందలి మాణిక్యదీపములతో నీరాజనము లిచ్చెదరు

325 సహస్రదః . అనంతమైనవిగా ఇవ్వగలవాడు
స్వామిన్ అస్థిర దేవతానుసరణాయా సేవకిం లభ్యతే
కావా ముక్తిరితః కుతో భవతి చేత్కిం ప్రార్థనీయం తదా (శి ఐ 33)
స్వామీ! అశాశ్వతులైన దేవతల నాశ్రయించుటవలన ఫలమేమి? వారినుండి పొందగలిగినదేమున్నది?

## 40. పక్షీచ పక్షిరూపశ్చ అతిదీప్తో విశాంపతిః ।
## ఉన్మాదో మదనః కామో హ్యశ్వత్థోర్థకరో యశః ॥

326. పక్షీ పక్షిశ్రేష్ఠుడైన గరుత్మంతుడు.

327 పక్షిరూపశ్చ . భక్తజన పక్షపాతి భక్తివత్సలుడు.

328. అతిదీప్తః · కోటిసూర్య ప్రకాశము గలవాడు శత్రుతేజస్సును హరించువాడు.

329. విశాంపతిః : సమస్త జనుల కధిపతి సమస్త జీవులకు పోషకుడు.

330. ఉన్మాదః : ఉన్మాదయతీతి ఉన్మాదః · మోహకః పరమయోగియైనను పిచ్చివానివలె యుండును. ఉన్మాదమును కలిగించును బాలోన్మత్తదేవ, మహాత్ములు పిచ్చివారివలె, బాలకుల భంగి; పిశాచములవలె ప్రవర్తించు చుందురు. ''వెఱ్ఱితనము మాని విజ్ఞానమూర్తియై బ్రహ్మభావమునను బర్యటింప, వెర్రియుంచు శుకుని వెంటనేతెంతురు వెలదు లర్భకులును వెఱ్ఱులగుచు'' భాగవతం. 1-519.

331 మదనః : మన్మథుడు - ప్రేమదేవత.

332. కామః : పురుషార్థముల కొఱకై కోరబడువాడు, కామేశ్వరుడు. ''సోఽకామ యత, బహుస్యాం ప్రజాయేయేతి'' తై.ఉ. (శి.స.నా.102; వి.స.నా 297).

333 అశ్వత్థః : రావిచెట్టు వంటివాడు అశ్వత్థ స్సర్వవృక్షాణాం. వృక్షములలో అశ్వత్థము వంటివాడు. భ.గీ.10-26. 2 రేపటిరోజున నుండని భగవంతుని అభివ్యక్తరూపమైన జగత్తు 'అశ్వత్థ' మనబడును ''అశ్వత్థ'' శబ్దము, మూలకారణమగు బ్రహ్మమును సూచించును (వి.స.నా.824)

334. అర్థకరః . పురుషార్థములను ముఖ్యముగా ఐశ్వర్యమును ఇచ్చువాడు.

335. యశః : కీర్తిప్రదుడు.

## 41. వామదేవశ్చ వామశ్చ ప్రాగ్దక్షిణశ్చ వామనః ।
## సిద్ధయోగీ మహర్షిశ్చ సిద్ధార్థః సిద్ధసాధకః ॥

336. వామదేవః కర్మఫలములను విభజించి యిచ్చువాడు

337. వామః · కర్మఫల స్వరూపుడు, ఆనందమయుడు.

338 ప్రాక్ః · (ప్రాచేనమః) అందరికన్నను ముందుగనే యున్నవాడు యోదేవానాం ప్రథమం పురస్తాత్ విశ్వాధిపోరుద్రోమహతి । హిరణ్య గర్భం పశ్యచ జాయమానంచ నోదేవః కృపయా సంరుధ్యా సంయునక్తు ॥

ఎవరు దేవతలందు ప్రథముడో, ప్రపంచమంతటికీ అధికుడో, అందరి కష్టముల తీర్చునో, అంతయు నెరిగిన సర్వజ్ఞుడో, హిరణ్యగర్భుని జననమును చూచినాడో అట్టి రుద్రుడు మనలను కాపాడుగాక

339 దక్షిణః దక్షత, దాక్షిణ్యము కలవాడు ముల్లోకముల పాలింప సమర్థత గలవాడు (వి.స.నా 918) శత్రువుల హింసించువాడు.

340. వామనః వామనావతారుడు ''మధ్యే వామన మాసీనం విశ్వేదేవా ఉపాసతే - ఆ విధముగా ఉపాసింపబడువాడు. (వి స నా 153)

341. సిద్ధయోగీః . యోగసిద్ధిపొందినవాడు. సనత్కుమారాది మహాత్ములవలె యోగసిద్ధి పొందినవాడు.

342. మహర్షిః : విశ్వాధికో రుద్రో మహర్షిః · రుద్రుడు విశ్వాధికుడైన మహర్షి భృగుం మరీచి మత్రించ పులస్త్యం పులహం క్రతుం వసిష్ఠంచ మహాతేజాః సోఽసృజత్ మనసా సుతాత్ ॥ భృగువు మరీచి, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు వీరందరూ పరమేశ్వరుని మానసపుత్రులు. శివస్వరూపులు (వి స.నా. 531)

343. సిద్ధార్థః : అన్ని సిద్ధులు పొందినవాడు. (వి స.నా. 252)

344. సిద్ధ సాధకః : విద్వాంసుడగు సన్యాసి. సిద్ధుల కోరికలను తీర్చువాడు. క్రియాసాధకుడు : అనుకొన్నది సాధించితీరును. (వి.స.నా. 255)

## 42. భిక్షుశ్చ భిక్షురూపశ్చ విపణో మృదురవ్యయః ।
## మహాసేనో విశాఖశ్చ షష్టిభాగో గవాంపతిః ॥

345. భిక్షుః . ఆదిభిక్షువు; సన్యాసి రూపమున నుండువాడు. దరిద్రత్ నీలలోహితః (రుద్రం) (లింగరూపధారి అయిన పరమహంస)

346 భిక్షురూపః భిక్షువువలె యుండువాడు. (లింగరహితుడైన పరమహంస)

347. విపణః . దండాదులు లేనివాడు (విలువ కట్టుటకు వీలులేనివాడు) అతనిని ఎవరూ ప్రలోభ పరచలేరు

348. మృదుః మెత్తని హృదయము కలవాడు

349 అవ్యయః . ఏ వికారములు లేనివాడు. వ్యయము వినాశము, అదిలేనివాడు. (శి.స.నా.974)

350 మహాసేనః · గొప్పసేనలు కలవాడు దేవసేనాధిపతి ''సేనాభ్యశ్చ'' సేనల రూపమున క్రీడించువాడు. (రుద్రం . 2-1)

351. విశాఖః · కార్తికేయుడు. సేనానీనామహం స్కందః : భ.గీ. (సేనలు ఇతడే, సేనా నాయకుడూ ఇతడే), ఇంద్రునికి సాయపడినవాడు

352 షష్టిభాగః అరవై భాగములు కలవాడు (మా ఉ)

353 గణపతిః : ఇంద్రియములనడిపించువాడు.

**43. వజ్రహస్తశ్చ విష్కంభీ చమూస్తంభన ఏవచ ।**
**వృత్తా వృత్త కరస్తాలో మధుర్మధుక లోచనః ॥**

354. వజ్రహస్తః . వజ్రాయుధమును ధరించిన ఇంద్రుని శక్తిగా యుండువాడు.

355. విష్కంభీ : విస్తారమైనవాడు

356. చమూ స్తంభనః : శత్రుసేనలను స్తంభింప చేయువాడు. అర్జునుడు యుద్ధ భూమి యందు తనకు ముందు శూలమును ధరించి ఒక మహా పురుషుడు శత్రు సైన్యమును నాశము చేయుట చూచెను. శ్రీ కృష్ణుని ''అతడెవరు?'' అని అడుగగా, ''అతడు రుద్రుడు'' అని చెప్పెను. శిఖండికి, ధృష్టద్యుమ్ననికి, అశ్వత్థామలకు కూడా ఆ శక్తినిచ్చినది శివుడే.

357. వృత్తావృత్తకరః : యుద్ధరంగమున తన రధమును ప్రదక్షిణముగా ఎదిరించి పోరాడుట వృత్తము; శత్రు సైన్యమును భేదించి, నాశమొనర్చి అప్రదక్షిణముగా వచ్చుట ఆవృత్తము. ఈ రెండింటియందు నేర్పు గలవాడు.

358. తాలః : సంసార సాగర లోతు అట్టడుగు వరకు తెలిసినవాడు.

359. మధుః : వసంతుడు, (2) వసంతఋతువు వలె భూమిని పులకింప జేయువాడు. (వి.స.నా 169.)

360. మధుక లోచనః : తేనెరంగు కన్నులు కలవాడు (2) మధుకమనునది ఒక జాతి పక్షి : దాని కన్నులవంటి కన్నులు గలవాడు.

**44.** వాచస్పత్యో వాజసనో నిత్యమాశ్రిత పూజితః ।
బ్రహ్మచారీ లోకచారీ సర్వచారీ విచారవిత్ ॥

361 వాచస్పతిః దేవగురువగు బృహస్పతితో సమానుడు

362 వాజసనః . వాజసనేయమను వేదభాగమును సూర్యరూపియై ప్రపంచము నకు అందిచ్చినవాడు (వి స నా 797)

363. నిత్యమాశ్రిత పూజితః : అనుదినము ఆశ్రితులచే పూజింపబడువాడు

364. బ్రహ్మచారిణః బ్రహ్మమునందే చరించువాడు బ్రహ్మనిష్ఠుడు

365. లోకచారిః : ప్రపంచమంతయు పరివ్రాజక రూపమున సంచరించువాడు.

366 సర్వచారీ : ఎల్లెడల, ఎల్లకాలములందు సంచరించునట్టివాడు. ఎంగెంగే పార్తాలుం ఎప్పొయిర్కుం అప్పొయిరాయి అంగెంగి రుప్పది నీ యంరో పరాపరమే (తాయుమానవర్) ''ఇందుగల డందులేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుడు'' - భాగవతం - (శి స.నా.277)

367. విచారవిత్ . ఆత్మవిచారము చేయువాడు. పరమజ్ఞాని అంతర్ముఖుడు.

**45.** ఈశాన ఈశ్వరః కాలో నిశాచారీ పినాకవాన్ ।
నిమిత్తస్థో నిమిత్తంచ నందిర్నందికరో హరిః ॥

368. ఈశానః : సర్వమును శాసించువాడు. పంచముఖములలో ఒకటి. ఈశానః సర్వ విద్యానామీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధిపతిర్బ్రహ్మ శివోమేఅస్తు సదాశివోం. (వి స.నా. 65)

369. ఈశ్వరః : అంతటా వ్యాపించువాడు. అనుభవించువాడు. అశ్నోతి వ్యాప్నోతీతి ఈశ్వరః (2) యస్సర్వైశ్వర్యవాన్ వర్తతే స ఈశ్వరః. సర్వైశ్వర్య యుక్తుడు. సర్వశక్తి మంతుడు, జ్ఞాని, ప్రభువు - (వి.స.నా. 37.)

370. కాలః : పుణ్యపాపములను లెక్కించు చిత్రగుప్తుడు.
(వి.స.నా. 418; శి.స నా. 152, 384, 533)

371. నిశాచారీ : కాళరాత్రియందు ప్రళయ తాండవము సల్పువాడు.

372. పినాకవాన్ · పినాకమనెడి విల్లును ధరించినవాడు.

373. నిమిత్తస్థః : శివుడే విలుకాడు; విల్లు; దాని బాణము, దాని లక్ష్యముకూడ.

374 నిమిత్తం : వీటన్నింటికీ కారణమైనవాడు.

375. నందిః జ్ఞాన సంపద కలవాడు (2) పరమానంద స్వరూపుడు (వి.స.నా. 619)

376. నందికరః సంతోషము కలిగించువాడు.

377 హరిః : రామకార్యార్థము హనుమంతుడుగా అవతరించినవాడు. రూపమాత్రంతు వానరః - కానీ గుణములలో సాక్షాత్తు రుద్రుడే. (శి.స.నా.208, 712, 787)

## 46. నందీశ్వరశ్చ నందీచ నందనో నందివర్ధనః ।
## భగహారీ నిహంతాచ కాలో బ్రహ్మా పితామహః ॥

378. నందీశ్వరః · నంది అనగా వృషభము దానికీశ్వరుడు, నంది వాహనుడు.

379 నంది : శివగణ స్వరూపుడు

380 నందనః . సంతోష పరుచువాడు (వి స నా 526)

381. నందివర్ధనః : క్రమముగా మనుష్యానందము, గంధర్వానందము, దేవానందము, బ్రహ్మానందమును చేకూర్చువాడు ఇట్లు సాధకుల ఆనందమును అతిశయింపచేయువాడు .

382 భగహారిణః భగః : సమగ్రమైన ఐశ్వర్యము, వీర్యము యశస్సు, శ్రీ, జ్ఞానము వైరాగ్యములు - వీటన్నింటినీ హరించువాడు

383. నిహంతా . మృత్యురూపమున ప్రాణాలను చంపువాడు.

384. కాలః : కళానాం చతుః షష్టి సమ్మితానాం నివాసః

కాలః (1) అరవది నాల్గు కళల కావాసమైనవాడు.

(శి.స నా. 152, 370, 533 వి.స నా.411) 2.
సర్వమును గణన చేయు కాలస్వరూపుడు. కాలపి కలయ తామహం.

385. బ్రహ్మ : అతిశయేన మహాన్ : అన్ని విధములగొప్ప బృహ, బృహి, వృద్ధౌ అను ధాతువునుండి బ్రహ్మ శబ్దము నిష్పన్నమగుచున్నది. 'సర్వేభ్యో బృహత్వాద్బ్రహ్మ'. అన్నిటి కంటె గొప్పవాడు; విరాజమానుడును, అనంత బలయుక్తుడు నగుటచే పరమేశ్వరునకు బ్రహ్మమనిపేరు. సర్వోత్కృష్టమగు అవినాశితత్వము బ్రహ్మము. (శి.స. నా.1002)

386. పితామహః : పితుర్విష్ణోరపిపితా : విష్ణువు తండ్రి ఆయనకు తండ్రి (శి.స నా.926, వి.స.నా. - 970.)

**47. చతుర్ముఖో మహాలింగః చారులింగస్తథైవచ ।
లింగాధ్యక్షః సురాధ్యక్షో యోగాధ్యక్షో యుగావహః ॥**

387. చతుర్ముఖః నాలుగు మోములుగల బ్రహ్మయు ఇతడే

388. మహాలింగః : మహత్ దేవాసురాది పూజ్యం లింగమస్య మహాలింగః దేవాసురులచే పూజింపబడు మహాలింగం మల్లికార్జునం, మధ్యార్జునం, పుటార్జునం అను మూడు చోట్ల గల లింగములు మహాలింగములు

389 చారులింగః . రమణీయమైన లింగము

390. లింగాధ్యక్షః : లింగమొక సంకేతము అది భావములను సూచించును ఈ భావములు ప్రత్యక్ష, అనుమానాది ప్రమాణముల ద్వారా నిర్ధారణచే వచ్చును శివలింగముగూడా గొప్ప భావములకు సంకేతము. ప్రపంచ సృష్టికి ఆధారమైన ప్రవృత్తి ప్రపంచలయకారణమైన నివృత్తి మార్గములకు శివలింగము ఒక సంకేతము. అది అన్ని సంకేతములలో శ్రేష్ఠమైనది

391. సురాధ్యక్షః · దేవతలకు అధ్యక్షుడు అనగా ఇంద్రియములకు అధిష్ఠాన దేవతలకు అధ్యక్షుడు దేవదేవుడు.

392. యోగాధ్యక్షః : జీవాత్మను పరమాత్మతో అనుసంధించుటకు ఎన్నియో యోగములున్నవి. వాటన్నింటికీ అధ్యక్షుడు.

393. యుగావహః : కృత, త్రేత, ద్వాపర, కలియుగములను నిర్దేశించినవాడు.

**48. బీజాధ్యక్షో బీజకర్తా అధ్యాత్మానుగతో బలః ।
ఇతిహాసః సకల్పశ్చ గౌతమోథ నిశాకరః ॥**

394. బీజాధ్యక్షః : సృష్టికి కారణము ప్రకృతి : దానికి అధ్యక్షుడు. మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే చరాచరం ( భ.గీ. 9-19)

395. బీజకర్త : ప్రకృతిని ప్రవర్తింప జేయునదియు ఇతడే.

396. అధ్యాత్మానుగతః : అధ్యాత్మమనగా; దేహి : స్వస్వరూపము లేక జీవాత్మ : భ.గీ. 8-3. (2) ఆధ్యాత్మ విద్యయనగా మోక్ష విద్య లేక బ్రహ్మ విద్య. అట్టి అధ్యాత్మ విద్యను అనుసరించెడివారు.

397. బలః : మిక్కిలి బలశాలి : ''బలవికరణాయ నమో, బలాయనమో, బలప్రమధ నాయనమః'' - రుద్రం - లంకానాథం లవణ జలధి స్థూలవేలోర్మి

దీర్ఘైః కైలాసంతే నిలయన గిరింబాహుభిః కంపయంతం ; ఆక్రోశద్భిః క్షరిత రుధిరై రాననై రాప్లుతాక్షై । రాపాతాళాదనయ దలసారఙ్ఘమంగుష్ఠ కర్మః - (అనామయస్తవం - 18) సముద్రతరంగములవంటి, మహాదీర్ఘములైన తన ఇరువది భుజములతో రావణుడు కైలాసమును బెకిలింపగా, నీ పాదాంగుష్ఠము నించుక కదలించి యణచి పట్టినంత మాత్రమున, ఏడ్చుచు, కనులవెంట రక్తమును, జలమును గార్చుచు పాతాళమున బడెను. అంతటి బలవంతుడు శివుడు

398 ఇతిహాసః : రామాయణ, భారతాది ఇతిహాస స్వరూపుడు, అవన్నియు పరమేశ్వరుని సాక్షాత్కరింపజేయుటకు ఏర్పడినవే.

399. సకల్పః . యజ్ఞ ప్రయోగములు, వ్రత కల్పములను బోధించువాడు మీమాంసాది కల్పశాస్త్రములన్నియు, నియమములను బోధించుచున్నవి ఆ శాస్త్ర స్వరూపుడు

400. గౌతమః . న్యాయదర్శనమును మనకందించిన మహర్షి గౌతముడు తర్కశాస్త్ర కర్త : ఆయన శివాంశుడే.

401. నిశాకరః : చంద్రుడు. చంద్రుడు చాంద్రవ్యాకరణకర్త

## 49. దమ్భో హ్యదంభో వైదంభో, వశ్యో వశ్యకరః కలిః ।
## లోక కర్తా పశుపతిః, మహాకర్తా హ్యనౌషధః – ॥

402. దంభః : శత్రూన్ దమయతీతి : శత్రువులను శిక్షించువాడు. త్రిపురాసురులను దండించినవాడు; (2) కపట వేషధారి.

403. అదంభః : నాస్తి దంభో దమకోయస్యః : తనను జయించగలవాడెవడును లేనివాడు; అవగుణములను సుగుణములుగ ప్రకటించుకొనుట దంభము : అదిలేనివాడు.

404. వైదంభః : దంభములేనివారికి ఆత్మీయుడు : కన్నప్ప మొదలగువారికి, నిరాడంబరులై సర్వసంగ పరిత్యాగులైనవారికి ఆత్మీయుడు.

405. వశ్యః భక్తపరాధీనుడు : ''మార్గావర్తిత పాదుకా పశుపతేరంగస్య కూర్చాయతే । గండూషాంబునిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే । కించిద్భక్షిత మాంసశేష కబళం నవ్యోపహారాయతే । భక్తిః కిం నకరోత్యహో వనచరో భక్తావతంసాయతే ॥'' భక్తుడైన కనప్ప, అరిగిపోయిన చెప్పులతో నిన్ను తుడిచెను; ఎంగిలి నీళ్లతో నీకభిషేకము గావించెను. ఎంగిలి

మాంసమును నీకు నైవేద్యమిడెను అటువంటివానికి మోక్షము నిచ్చితివి బాణాసురుని వాకిట కావలి కాచితిని.

406 వశకరః ఇతరులను వశము చేసుకొనువాడు దారుకా వనములోని స్త్రీలు, విష్ణువు, బ్రహ్మ, ఎందరో అసురులు శివుని పూజించెడివారే

407. కలిః : ధర్మాధర్మములతో, పుణ్య పాపములతో, ఒకరికొకరికి విరోధము పెట్టువాడు, కలిస్వరూపుడు. (శి.స నా.532)

408. లోకకర్తా లోకములను సృజించువాడు - ''స్రష్టా సకలజగతాం'' ''బహుళరజసే విశ్వోత్పత్తే భవాయనమోనమో'' జగదుత్పత్తి సమయమున - అమిత రజో గుణముచే, భవాయ, కారణ భూతుడవైనందున భవుడవు''

409. పశుపతిః : బ్రహ్మాది స్తంబ పర్యంతానాం జీవపశూనాంపతిః పాలకః. బ్రహ్మ మొదలు గరికపోచ వరకూ అన్నియు పాశబద్ధములే - పశువులే వాటికి పతి. (శి స నా 867)

410. మహాకర్తః · తొంబది ఆరు తత్త్వములను సృష్టించినవాడు

411 అనౌషధః : భోక్తకానివాడు. అన్నాదులను చూచినంతమాత్రాన తినినంత సంతోషపడువాడు. జీవులకు గల షడూర్ములు ఆయనకు లేవు. ఉండుట - పుట్టుట - పెరుగుట - మార్పు చెందుట - క్షీణించుట - మరణించుట వంటి వికారములు లేనివాడు. ఆయనకు ఏ ఔషధము పనిలేదు. రోగులకు మందు నిచ్చెడివాడు

## 50. అక్షరం పరమం బ్రహ్మ బలవాచ్ఛక్ర ఏవచ ।
## నీతిర్హ్యనీతిః శ్శుద్ధాత్మా శుద్ధో మాన్యో గతాగతః ॥

412. అక్షరం : అవ్యయము

413. పరంబ్రహ్మ : ఉత్కృష్టమైన ఆనంద రూపము.

అక్షరము స్థూలమైనదికాదు. సూక్ష్మమైనదికాదు హ్రస్వమైనదికాదు. దీర్ఘమైనదికాదు. ఈ అక్షరుని ప్రభావమువలననే సూర్యచంద్రాదులు నియమబద్ధమై నిలిచియున్నారు. అక్షరుడు కన్నులు లేకున్ననూ అన్నింటినీ చూడగలడు. చెవులు లేకున్ననూ అన్నింటినీ వినగలడు; మనస్సు లేకున్ననూ మననము చేయగలడు. ఇతడే పరబ్రహ్మము. అక్షరునికన్న మరొకడు చూచువాడుగానీ, వినువాడుగానీ, తెలుసుకొనువాడుగానీలేడు. క్షరస్సర్వాణి, భూతాని, కూటస్థోఽక్షర ఉచ్యతే - భ.గీ (వి.స. 17,480.)

414 బలవతే బలాభిమాని దేవతా స్వరూపము - (శి స నా 643)

415 శక్రః · శక్నోతీతి శక్రః శక్తిసంపన్నుడు ఇంద్రుడు (శి స 620.)

416 నీతిః దండింప దగువారి విషయమున దండము ప్రయోగించువాడు

417 అనీతిః . సామాద్యుపాయములులేనివాడు. అతడు ఎవరిచేతను నీతులు చెప్పించుకొనువాడుకాడు.

418 శుద్ధాత్మా విమలచిత్తుడు.

419 శుద్ధః · దోషరహితుడు

420 మాన్యః . పూజనీయుడు - ''స్వామిన్నస్థిరదేవతానుసరణా యాసేవకిం లభ్యతే కావా ముక్తిరితః కుతో భవతి చేత్కిం ప్రార్థనీయం తదాః (శి ల 33) శాశ్వతముకాని దేవతల నాశ్రయించుటవలన లాభమేమి? వారినుండి కోర దగినదేమున్నది? (వి స నా 750 )

421. గతాగతః - ''ఒక పరిజగముల వెలినిడి నొకపరి లోపలికి గొనుచు నుభయము తానై సకలార్థ సాక్షియగు నయ్యకలంకుని నాత్మమూలునే సేవింతున్ ప్రకృతిం స్వామ వష్టభ్య విసృజామి పునః పునః భ.గీ. 9-8 మరలమరల జగత్తును సృష్టించును. లీనము చేసుకొనును.

## 51. బహుప్రసాదః సుస్వప్నో దర్పణోఽథ త్వమిత్రజిత్ । వేదకారో మన్త్రకారో విద్వాన్ సమర మర్దనః ॥

422. బహుప్రసాదః : మిక్కిలి యనుగ్రహము కలవాడు - కరుణామయుడు. ఐహికాముష్మిక సుఖములను ప్రసాదించువాడు - ''తస్యాగారే గిరి శరమతే ధేనువత్ కామధేనుః । క్రీడావాటే విటపి సదృశః కల్పతే కల్పవృక్షః లాక్షారక్షామణిరివశంకరే తస్య చింతామణిస్స్యాద్ । యస్మిన్ సిద్ధస్సకృదపి కృపాదృష్టిపాత ప్రసాదః - (హలాయుధస్తవము 13) కైలాసవాసీ! నీకృపాదృష్టి ఎవడి పైబడునో, వానియింట కామధేనువు, కల్పవృక్షము, చింతామణి ఎల్లప్పుడూ వుంటాయి

423. సుస్వప్నః · స్వప్నావస్థాభిమానియైన తైజసుడు : మంచి మనసుగలవానికి మంచి కలలు వచ్చును.

424 దర్పణః . విశ్వమును అద్దమువలె ప్రతిబింబించువాడు · విశ్వందర్పణ దృశ్యమానవగరీతుల్యం నిజాంతర్గతం । పశ్యన్నాత్మని మాయయా బహురివోద్భూతం యథానిద్రయా । యస్సాక్షాత్కురుతే ప్రభోధసమయే స్వాత్మాన

మేవాద్వయం । తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణమూర్తయే॥ (ద.మూ.స్తో)
స్థావర జంగమాత్మకమగు ప్రపంచము ప్రతిబింబితమై అద్దమునందున్నట్లు ఆత్మ యందే కలదు

425 అమిత్రజిత్ . బాహ్యాభ్యంతర శత్రువులను జయించినవాడు త్రిపుర, గజాసురులనే కాకుండా, కామక్రోధాధులను జయించినవాడు

426. వేదకారః . నిశ్వాస రూపమున వేదములను వెలువరించినవాడు

427 మంత్రకారః సప్తకోటి మంత్రములు కలవు. వాటన్నింటికీ శివుడే కర్త.

428. విద్వాౕ · సకల కళాకోవిదుడు.

429 సమర మర్దనః . యుద్ధమందు శత్రునాశము చేయువాడు ఎక్కడ యుద్ధము జరిగిననూ, ఏ వైపువారు యుద్ధములో మరణించినను, దానికి కారకుడు రుద్రుడే.

## 52. మహామేఘ నివాసీచ, మహాఘోరో వశీకరః । అగ్నిజ్వాలో మహాజ్వాలో అతిధూమ్రోహుతో హవిః ॥

430. మహామేఘ నివాసీ : మహా ప్రళయ కాలమున మహా మేఘములందుండువాడు.

431. మహాఘోరః : మిక్కిలి ఘోర రూపుడు ''అఘోరేభ్యోథ ఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యః'' - (కాలాభ్ర భ్రమరాంజన ద్యుతినిభం) హరుని దక్షిణముఖం.

432. వశీ : సర్వము తన వశమందుంచుకొన్నవాడు.
వశీ సర్వస్య లోకస్య స్థావరస్య చరస్యచ (శ్వేతః ఉప · 3-18 )

433. కరః : కృణోతి హినస్తి జగదితి కరః సంహారకర్తా - సంహరించువాడు.

434. అగ్నిజ్వాలః : అగ్నేరివ జ్వాలా తేజో యస్య సః . అగ్నిజ్వాల వలె ప్రకాశించువాడు.
గతేస్త్రయోఽర్థాః : జ్ఞానం గమనం ప్రాప్తిశ్చేతి పూజనం నామ సత్కారః యోఽజ్ఞలి అచ్యుతే గతం గత్యేతి సోఽయమగ్నిః . జ్ఞానస్వరూపుడును సర్వజ్ఞుడును తెలియబడుటకును, పొందుటకును, పూజింపబడుటకును యోగ్యుడు.

435 మహాజ్వాలః తస్యభాసా సర్వమిదం విభాతి, మిక్కిలి ప్రకాశవంతుడు అతని తేజస్సువల్లనే మిగిలినవి ప్రకాశించుచున్నవి. జ్యోతిషామపి తజ్జ్యోతిః.

436. అతిధూమ్రః కాలాగ్నివలె నన్నింటిని దహించు సమయమున దట్టమైన పొగలు సంభవించుచున్నవి. అగ్నిని పొగక్రమ్మియున్నట్లు పరమాత్మని కప్పియున్న మాయకూడా ఇతడే.

437 హుతః : హోమేణ ప్రీతః - హోమము చేయుటవలన ప్రీతి నొందువాడు

438 హవిః హోమద్రవ్యముకూడా ఇతడే.
బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌబ్రహ్మణాహుతం
బ్రహ్మైవతేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా ( భ.గీ 4-24)
అహంక్రతురహం యజ్ఞః స్వధాఽహమహమౌషధమ్ । మంత్రోఽహమేవాజ్య
మహమగ్ని రహంహుతమ్ ( భ.గీ 9-16)

## 53. వృషణః శంకరో నిత్యం వర్చస్వీధూమకేతనః ।
## నీలస్తథాంగలుబ్ధశ్చ శోభనో నిరవగ్రహః ॥

439. వృషణః - కర్మఫలములను కురిపించువాడు, వర్షతి కర్మఫలానీతి వృషణః, యద్వాః వృషోధర్మో ఽస్మిన్నితి వృషణః (లేక) వృషః ధర్మము ధర్మముయొక్క రూపము నంది . నందివాహనుడు.

440. శంకరః - సుఖమునిచ్చువాడు - నమః శంకరాయచ : (రుద్రం) ఇతడు పితృదేవతారూపమున ఇహలోక సుఖములను, ఆచార్యరూపమున మోక్షమును కలుగజేయును, రుద్రాణాం శంకరశ్చాస్మి - (భ.గీ. 10.23) ఏకాదశ రుద్రులలో కల్యాణ కారకుడు శంకరుడు. (శి.స.నా.599, 600)

441. నిత్యంవర్చస్వీ - ఎల్లప్పుడు తేజో రూపమున నుండువాడు.

442. ధూమకేతనః : ఇతడు పొగను ధ్వజమందుంచుకొనిన అగ్నివంటివాడు

443. నీలః : మరకత స్వచ్ఛ విగ్రహుడు

444. అంగలుబ్ధః : లింగో నిత్యం సన్నిహిత ఇత్యర్థః : తనదు సంకేతమైన లింగమందు ఎల్లప్పుడు సన్నిహితుడై యుండెడివాడు

445. శోభనః : కళ్యాణ కారణుడైనవాడు, మంగళమూర్తి. (శి స.నా.971)

446. నిరవగ్రహః . నిరాటంకముగా తన మనోరథమును నెరవేర్చుకొనగలడు (లేక) భక్తుల మనోరథములను ఎడతెగక వర్షించువాడు.

**54. స్వస్తిదస్స్వస్తిభావశ్చ భాగీ భాగకరో లఘుః ।**
**ఉత్సంగశ్చ మహాంగశ్చ మహాగర్భ పరాయణః ॥**

447. స్వస్తిదః భక్తులకు మంగళము చేకూర్చువాడు. (వి స నా 901)

448 స్వస్తిభావః శుభకరములగు భావము గలవాడు అందరి క్షేమమునే కోరువాడు

449. భాగీ · యజ్ఞమందు భాగము కలవాడు ఒక యజ్ఞమందేకాదు అన్నింటి యందు భాగముకలవాడు

450 భాగకరః యజ్ఞములోని హవిస్సులను ఆయా దేవతలకు వారివారి భాగములను విభజించి యిచ్చువాడు. సృష్టి 36 తత్త్వములలో కూడినది ఏ ఏ తత్త్వమునకు ఎంతెంత భాగమో నిర్ణయించువాడు శివుడు.

451 లఘుః . అతి సులభుడు. వేగము కలవాడు. భక్తుల కోర్కెలను వెంటనే యిచ్చువాడు.

452. ఉత్సంగః · సంగరహితుడు. శ్మశానవాసి : దిగంబరుడు

453. మహాంగః మహాలింగ స్వరూపుడు

454. మహాగర్భ పరాయణః · ప్రజననాత్మకః కందర్ప ఇత్యర్థః. సృష్టికంతటికీ గర్భకారణుడు అగు మన్మధుడితడు. బ్రహ్మాండ భాండోదరుడు.

**55. కృష్ణవర్ణః సువర్ణశ్చ ఇంద్రియం సర్వదేహినాం ।**
**మహాపాదో మహాహస్తో మహాకాయో మహాయశః ॥**

455. కృష్ణవర్ణః : నల్లని దేహము కలవాడు. శ్రీ విష్ణువుకు ఈయనకు అభేదము : కృష్ణావతారముగా దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసినవాడు.

456. సువర్ణః : మంచి వర్ణము గలవాడు. సాంబరూపమున శ్వేతవర్ణము కలవాడు.

457. సర్వదేహినామింద్రియః : సకల ప్రాణుల ఇంద్రియములుగా నుండువాడు. ''అగ్నిర్మేవాచిశ్రితః, వాగ్ఘృదయే । హృదయంమయి । అహమమృతే, అమృతం బ్రహ్మణి ।'' శివసంకల్పమందు, మహాన్యాసమందు ఇంద్రియాదులు, అవయవములు తుదకు రోమములన్నియు శివ స్వరూపములే

458. మహాపాదః : గొప్ప పాదములు గలవాడు,

459. మహాహస్తః : గొప్ప చేతులు గలవాడు,

460 మహాకాయః . గొప్ప శరీరము కలవాడు. (శి.స.నా 39, 205)

461. మహాయశః : గొప్ప యశస్సు గలవాడు. వేదములు, శాస్త్రములు ఉపనిషత్తులు, దేవాసురులు ఆబాలగోపాలము ఇతని కీర్తించు చున్నవి. "మహీపాదాఘాత్ వ్రజతి సహసా సంశయపదం । పదం విష్ణోర్భ్రామ్యద్భుజ పరిఘరుగ్ణగ్రహగణం । ముహుర్ద్యౌర్దౌస్థ్యం యాత్య విభృత జటాతాడిత తటా జగద్రక్షాయై త్వంనటసి నమవామైవ విభుతా" (శివమహిమ్నాం 16) మహాదేవుని మహాకారము 457 నుంచి 475 నామములో వర్ణింపబడుచున్నది. దానినే పుష్పదంతుడు తన శివమహిమ్నా స్తోత్రమందు చెప్పుచున్నాడు "నీ పాదాఘాతమునకు భూమి యంతయు చిందర వందరై పాతాళమున అడగిపోవునా అను సందేహము కలిగించుచున్నది. నీ గొప్ప చేతుల దెబ్బలకు సూర్యాది గ్రహములు తుంపరలై పోవుచున్నవి; స్వర్గలోకము, నీవు నటించు చుండగా, గజగజలాడిపోవుచున్నది.

## 56. మహామూర్ధా మహామాత్రో మహానేత్రో నిశాలయః । మహాన్తకో మహాకర్ణో మహోష్ఠశ్చ మహాహనుః ॥

462. మహామూర్ధాః . గొప్ప శిరస్సు గలవాడు.

463. మహామాత్రః : గొప్ప ప్రమాణము గలవాడు.

464. మహానేత్రః : గొప్పనేత్రములు కలవాడు.

465. నిశాలయః : (నిశా. చీకటి; లయః : తొలగించువాడు. అవిద్యను నాశము చేయువాడు) రాత్రియే ఆలయముగా గలవాడు, "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్"

466. మహాంతకః : అంతకుడు యముడు; వానికి అంతకుడు యమునికి ఈ సృష్టి యంతయు అన్నమువంటిది. ఆ యముడు ఈ మహాంతకునికి ఊరగాయ వంటివాడు.

467. మహాకర్ణః : పెద్దచెవులు గలవాడు. దిక్కులే చెవులు. "కర్ణావాశాః"

468. మహోష్ఠః : గొప్ప పెదవులు కలవాడు

469. మహాహనుః . గొప్ప దవడలు కలవాడు (శి.స.నా 45)

**57. మహానాసో మహాకంబుః మహాగ్రీవః శ్మశానభాక్ ।
మహావక్షా మహోరస్కో హ్యన్తరాత్మా మృగాలయః ॥**

470. మహానాసః : పెద్దముక్కు గలవాడు. ఇతని శ్వాసవాయుదేవుడు.

471. మహాకంబుః పెద్ద కంఠము గలవాడు.

472. మహాగ్రీవః : గొప్ప మెడ కలవాడు.

473. శ్మశాన భాక్ : శ్మశానమందుండువాడు (2) శరీర బంధమును తొలగించువాడు.

474. మహావక్షః : విశాల వక్ష స్థలము గలవాడు.

475. మహోరస్కః : బలిసిన రొమ్ము గలవాడు

476. అంతరాత్మా : అన్ని పదార్థములందును సత్తా మాత్రముగా యుండు అంతరాత్మ.

477 మృగాలయః : జింకను తన చేత ధరించినవాడు చంచలమైన మనస్సును తన గుప్పెట యుందుంచినవాడు దక్షుని యజ్ఞము జింకరూపము ధరించి పారిపోతుండగా దానిని చేజిక్కించుకొన్నాడు.

**58. లంబనో లంబితోష్ఠశ్చ మహామాయః పయోనిధిః ।
మహాదంతో మహాదంష్ట్రో మహాజిహ్వో మహాముఖః ॥**

478. లంబనః : పదునాల్గు భువనములను దానిమ్మ పండ్లవలె మాలగా కూర్చి ధరించినవాడు.

479. లంబితోష్ఠః : ప్రళయ కాలమున బ్రహ్మాండములను మ్రింగుటకై తెరువ బడిన పెదవులు గలవాడు. ఈ నామములచే ప్రళయ కాల రుద్రుని ధ్యానించెదము.

480. మహామాయః : ఇతని మాయలను తెలుసుకొనుటకు సాధ్యముకాదు. మాయాంతు ప్రకృతిం విద్ధి మాయినంతు మహేశ్వరమ్ : ॥శ్వేత ఉప॥

481 పయోనిధిః : క్షీరసాగరుడు.

482. మహాదంతః : పెద్ద పెద్ద పలువరసలుకలవాడు.

483. మహాదంష్ట్రః : అతని గొప్ప కోరలు ప్రళయాగ్ని వలె భయంకరమైనవి.

484. మహాజిహ్వః : జగములనెల్ల కబళింపగల గొప్ప నాలుక కలవాడు.

485. మహాముఖః : గంభీరమైన ముఖము కలవాడు.

## 59. మహానఖో మహారోమా మహాకేశో మహాజటః ।
## ప్రసన్నశ్చ ప్రసాదశ్చ ప్రత్యయో గిరిసాధనః ॥

486. మహానఖః : వజ్రమువలె వాడి గోళ్ళు కలవాడు నృసింహావతారము

487. మహారోమః . గొప్ప రోమములు కలవాడు

488. మహాకేశః : నిడివైన కేశములు గలవాడు

489. మహాజటః : నటరాజుగా తాండవము సలుపునప్పుడు తన జటా మండలముతో స్వర్గమును చిందరవందర చేయువాడు అంతటి గంగా ప్రవాహమును తన జటలో బంధించినవాడు.

490. ప్రసన్నః : ఎప్పుడూ చిరునవ్వుతో భక్తులనాదరించువాడు. (శి.స.నా. 237)

491. ప్రసాదః : ప్రసన్నాత్ముడు. (ప్రేమ, కటాక్షము గలవాడు)
అన్బుం శివముం ఇరండెణ్బార్గళ్ పిలర్ (తిరుమంత్రం)
(490, 491 నామములకు) ''బాలోఽపి సంస్మరణ మాత్రమచేతనస్తే । లింగం కరోతి హర పాంసుమయం వినోదాత్ అత్యంత దేశ ధనధాన్య సమృద్ధిభాజి । రాజ్యం కరోషి హతకంటకమున్నతంచ'' (మృత్యుంజయ స్తవం 34) వినోదార్థము బాలకుడైనను ఇసుక ముద్దగువానిలో లింగమును చేసినచో వానికి ధనధాన్యలాభములతో తులతూగుచున్న రాజ్యాధికారము నిచ్చును.

492. ప్రత్యయః : అనుభవపూర్వక జ్ఞానము కలవాడు.

493. గిరిసాధనః . పర్వతమేవ సాధనం రణే జయహేతుర్యస్య గిరిధన్వేరిత్యర్థః · యుద్ధమందు మేరుపర్వతమునే విల్లుగా చేసుకొనినవాడు. రామ సహాయార్థము శివాంశతో జన్మించిన ఆంజనేయుడి ఆయుధముకూడా కొండలే.

## 60. స్నేహనోఽస్నేహనశ్చైవ అజితశ్చ మహామునిః ।
## వృక్షాకారో వృక్షకేతు రనలో వాయువాహనః ॥

494. స్నేహనః : పితృవత్ ప్రజా సుస్నేహవాణ్ : ప్రజలయందు పితృవాత్సల్యము కలవాడు.

495. అస్నేహనః : ఇతని స్నేహము అందరికీ దొరకదు

496. అజితః : అజేయుడు శివుని నమ్మినవారికి కూడ అపజయము లేదు. ''కిం నో మృత్యుః కరిష్యతి?'' యముడైననూ మమ్మల్నేమి చేయగలడు అనే ధైర్యం వస్తుంది (శి.స.నా. 195, 613)

497. మహామునిః : అత్యంత మౌనము వహించి మననము చేయుచుండువాడు

498. వృక్షాకారః : సంసార వృక్షమితడే
యస్మాత్పరం నా పరమస్తి కించిద్యస్మాన్నాణీయో నజ్యాయోఽస్తి కించిత్ వృక్ష ఇవస్తబ్ధో దివి తిష్ఠత్యే కస్తేదం పూర్ణం పురుషేణ సర్వం (ముండకః ఉప.)

499. వృక్షకేతుః : అతని పతాకమందు వృక్ష చిహ్నము కలదు. అది సంసార సూచకము.

500. అనలః అతడు అగ్నివంటివాడు ఎంతవేసిననూ చాలు అనడు (శి స.నా : 589, 642)

501 వాయువాహనః : వాయుర్వహతి యద్భీత్వా ఇతివాయు వాహనః ఇతనికి భయపడి వాయువు వీచుచున్నది. ''భయాదస్యాగ్ని స్తపతి, భయాత్తపతి సూర్యః భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః'' (కఠ ఉ : 2.3-3)

## 61. గండలీ మేరుధామాచ దేవాధిపతి రేవచ ।
## అధర్వ శీర్షః : సామాస్య ఋక్సహస్రామితేక్షణః ॥

502. గండలిః : పర్వత గుహలం దుండెడివాడు.

503. మేరుధామాః : మేరు పర్వతము నివాసముగా గలవాడు.

504. దేవాధిపతిః . దేవతలకు అధిపతి : అందువల్లనే ఆయన దేవాదిదేవుడు లేక మహాదేవుడుగా పూజింపబడుచున్నాడు.

505. అధర్వశీర్షః : అధర్వణవేదము శిరముగా గలవాడు

506. సామాస్యః : సామము ముఖముగా కలవాడు

507. ఋక్సహస్రామితేక్షణః : వేలకొలది ఋక్కులు గల ఋగ్వేదము శివుని విశాలనేత్రములు - 505, 506, 507, 508 నామములు శివుడు వేద స్వరూపుడని తెలుపుచున్నవి.

## 62. యజుః పాదభుజో గుహ్యః ప్రకాశో జంగమస్తదా ।
## అమోఘార్థః ప్రసాదశ్చ అభిగమ్యః సుదర్శనః ॥

508. యజుః పాదభుజః : యజుర్వేద మంత్రములు అతని పాదములు భుజములు.

509. గుహ్యః - వేదములేకాదు వేదాంతములైన ఉపనిషత్తులుకూడ ఈయన స్వరూపమే. (2) నాహం ప్రకాశ సర్వస్యయోగమాయా సమావృతః

(భ గీ 7-25) (వి స నా. 542) హృదయాకాశమునందు గుహ్యముగా నుండువాడు
ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే · కఠ 2-12

510 ప్రకాశః : ఎల్లరకు కనబడునట్టి ప్రకాశము కలవాడు (2) ఉత్తైనం విశ్వాభూతాని మృడయాతినః. ఆదిత్యమూర్తియై ఉదయాస్తమయములు జేయుచు ఎల్లప్రాణులకు ప్రత్యక్షముగు రుద్రుడు మమ్ముల బ్రోచుగాక. ప్రకాశ స్వరూపమయిన ఆత్మగలవాడు.(వి.స.నా 276)

511. జంగమః . అంతటా సంచరించువాడు; చేతన స్వభావముగలవన్నియు శివరూపములే.

512. అమోఘార్థః : అర్థో అర్థనం అమోఘ అర్థో యత్రసః
ఆయనను గూర్చి అభ్యర్థించినచో ఆ ప్రార్థన వ్యర్థముకాదు.

513. అభిగమ్యః : సులభముగా పొందదగినవాడు. భక్త సులభుడు.
''భక్తిమాత్ర సులభం - త్వాందేవ సేవామహే'' (బిల్వాష్టకము 7)
షోడచోపచారములతో పని లేకయే పూజలందుకొను స్వామి శివుడు. మహా సులభుడు.

514 సుదర్శనః · మంగళకరమైన స్వరూపముగలవాడు. మంగళావహం దర్శనం యస్య ॥ కదావా కైలాసే కనకమణి సౌధే సహగణై । ర్వసన్ శంభోరగ్రే స్ఫుట ఘటిత మూర్ధాంజలిపుటః । విభోసాంబస్వామిన్ పరమశివ పాహీతి నిగదన్ విధాత్రూణాం కల్పాన్ క్షణమివ వినేష్యామి సుఖతః ॥ (శి.ల. 24)
కైలాసమును చేరి, బంగారు రత్నాలమేడమీద ప్రమధ గణములతోకూడి పరమ శివునిముందు నిలుచుండి, చేతులు జోడించి, హే, విభో! హే సాంబ! హే స్వామీ! హే పరమశివ! పాహి అని పలుకుచు, బ్రహ్మ కల్పములను నిమేషమాత్రముగా గడుపుదునో అని శంకర భగవత్పాదులవారు ఆ మంగళకరమూర్తిని వేడుకొంటారు :

515. ప్రసాదః : దయాళువు (శి.స.నా. 491)

## 63. ఉపకారః ప్రియస్సర్వః కనకః కాంచనచ్ఛవిః । నాభిర్నన్దికరోభావః పుష్కర స్థాపితః స్థిరః ॥

516 ఉపకారః : సంతోషపరుచువాడు. ''నాలంవా పరమోపకారక మిదంత్వేకం పశూనాంపతే । పశ్యన్కుక్షిగతాన్ చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుం । సర్వామర్త్య పలాయనౌషధ మతి జ్వాలాకరం భీకరం । నిక్షిప్తం గరళం గళేన్న గళితం నోద్గీర్ణ మేవత్వయా!'' (శి.ల : 31). తన కడుపులోనున్న స్థావర

జంగమములను, వెలుపలియుండు దేవదానవులను రక్షించుటకై జ్వాలా కరము భీకరమైన విషమును, క్రక్కక, మ్రింగక, తన గొంతులోనే యుంచుకొన్నవాడు పరోపకార పరాయణతకు ఈ ఒక్కటి చాలదా!

517. ప్రియః . అందరిచే ప్రేమింపబడువాడు.

518. సర్వః (1) సర్వత్యభిముఖ ఆయాతి యితి సర్వః అతనికై మనము ఒక అడుగు ముందుకువేస్తే అతడు మనవైపు నాల్గు అడుగులు ముందుకు వచ్చును

నమః పురస్తాదథ పృష్ఠతస్తే । నమోస్తుతే సర్వత ఏవ సర్వ ।
అనంత వీర్యామిత విక్రమస్త్వం । సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః । (భ. గీ. 11-40)

(2) అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే -సర్వమునకతడే ప్రభువు. అన్నియు అతని వల్లనే నడచుచున్నవి (శి.స.నా.10)

519. కనకః స్వర్ణాది ప్రియవస్తురూపుడు (2) బంగారు వంటివాడు.

520. కాంచనచ్ఛవిః బంగారు కాంతి కలవాడు. హిరణ్యావర్ణుడు.

521 నాభిః చక్రమందలి "కుండ" దాని ఆకులద్వారా చక్రమునంతటికీ కేంద్రముగాయుంటూ, నాభివలెయున్నదో, అట్లే పరమేశ్వరుడు విశ్వానికంతటికీ నాభిగా నున్నాడు.

522. నందికరః : యజ్ఞ ఫలములను ఇనుమడించి యిచ్చువాడు సంతోషము నిచ్చువాడు

523. భావః : భవునికి సంబంధించినది భావము; జన్మతో సంబంధమును కలిగించువాడు (2) క్రతుశ్రద్ధాస్వరూపుడు.

524 పుష్కర స్థపతయః : పుష్కరస్య బ్రహ్మాండస్య స్థపతిః. స్వామి తామరపూవు వంటి బ్రహ్మాండమును స్థాపించినవాడు (2) పుష్కర తీర్థమును స్థాపించినవాడు.

525. స్థిరః : పర్వతాదులవలె స్థిరముగా నుండువాడు. (శి.స నా. 1)

## 64. ద్వాదశస్త్రాసన శ్చాద్యో యజ్ఞో యజ్ఞ సమాహితః ।
## నక్తం కలిశ్చ కాలశ్చ మకరః కాలపూజితః ॥

526. ద్వాదశః : మనుష్యులకు గర్భవాసము మొదలు మరణించు వరకు పది దశలు కలవు. పదునొకటవది స్వర్గప్రాప్తి (లేక నరకప్రాప్తి) కడపట మోక్షము - అది పండ్రెండవది - ఈ దశలకు కారకుడు శివుడే.

527. త్రాసనః  భయపరుచువాడు, భయము పోగొట్టువాడు నలిడే

528. ఆద్యః  అన్నింటికన్నాముందున్నవాడు. ''త్వమాదిదేవః పురుషః పురాణః భ.గీ. (11-38) ఆయన ఆదిదేవుడు  సంసారాత్ ప్రాచీనః శుద్ధః

529. యజ్ఞః  జీవాత్మను పరమాత్మయందు చేర్చుటయే యజ్ఞము  ఆయుర్యజ్ఞేన కల్పతాం । ప్రాణో యజ్ఞేన కల్పతాం, అపానో యజ్ఞేన కల్పతాం । వ్యానోయజ్ఞేన కల్పతాం । చక్షుర్యజ్ఞేన కల్పతాం । శ్రోత్రం యజ్ఞేన కల్పతాం । మనోయజ్ఞేన కల్పతాం । వాగ్యజ్ఞేన కల్పతాం । ఆత్మాయజ్ఞేన కల్పతాం । యజ్ఞోయజ్ఞేన కల్పతాం (రుద్రం)  (శి.స నా. 209, 216)

530 యజ్ఞ సమాహితః - యజ్ఞమను యోగమువలన లభ్యపడువాడు.

531. నక్తః : రాత్రిగానుండువాడు. చీకటి కాబట్టి కనబడనివాడు  మహామోహ స్వరూపుడు.  కాళరాత్రిర్మహారాత్రి  మోహరాత్రిశ్చ  దారుణా  (దేవీ మహాత్మ్యం)

532 కలిః : కలి  తత్కార్యభూతః కామక్రోధలోభాదిరూపః : కలిపురుషుని కార్యములగు కామ క్రోధాలోభాదుల రూపముననున్నవాడు  (శి.స నా 407)

533. కాలః  జన్మమరణ ప్రవాహం కాలయతి సంవలయతీతి : యోగశక్తి మూలమున జనన మరణ ప్రవాహమగు కాలమును కల్పించువాడు (శి స.నా. 152, 370, 384)

534 మకరః : మొసలి రూపముగల శింశుమార చక్రమనబడు నక్షత్ర మండల స్వరూపుడు.

535. కాలపూజితః : కాలుడగు యమునిచే పూజింపబడినవాడు  ''హరివిరించి సురాధిప పూజితం యమజనేశ ధనేశ నమస్కృతం త్రినయనం భువనత్రిత యాధిపం । భజత రే మనుజా! గిరిజా పతమ్'' - (శ్రీపృథివీపతి సూరి విరచిత పశుపత్యష్టకం)

## 65. సగణో గణకారశ్చ భూతవాహన సారథిః ।
## భస్మశయో భస్మగోప్తా  భస్మభూతస్తరుర్గణః ॥

536. సగణః . ప్రమథ గణములతో కూడు కొనినవాడు.

537. గణకారః : గణములను తయారు చేయువాడు; దేవగణము, అసురగణము, మున్నగు గణములను వారి వారి గుణకర్మల కనుగుణముగా మనుష్య జంతు

గణముల నేర్పరుచువాడు. రావణ, బాణాసురుడు; జరాసంధుడు మున్నగు వారందరూ మహాభక్తులు

538. భూతవాహనసారధి . సమష్టి భూతములుగల విశ్వము ఒక రథము, వాహనము, దానికి శివుడు సారథి (2) త్రిపుర సంహార సమయమున తన రథమునకు సృష్టికర్తయగు బ్రహ్మను సారథిగా గలవాడు.

539. భస్మశయః . విభూతియనబడు భస్మము మీద పరుండువాడు పాపములను పారద్రోలి ఆత్మను పవిత్రము చేయునదిగాన భస్మమునకు విభూతియని పేరువచ్చినది.

540. భస్మగోప్తాః రక్షార్థం మంగళార్థంచ, పవిత్రార్థంచ భామిని లాంఛనార్థంచ భక్తానాం భస్మదత్తం మయాపురాః - విభూతితో భగవంతుడు లోకములను కాపాడుచున్నాడు భస్మము ధర్మానికి ప్రతీక. అది రక్షాకరము, మంగళకరము, పవిత్రము, లాంఛనము, శివప్రసాదము.

541. భస్మభూతః . తాను భస్మ స్వరూపుడు, విభూతియే భస్మము. విభూతి అనగా ఐశ్వర్యము, సంపద, ప్రకాశము, సిద్ధి ప్రభావము, వైభవము, సామర్థ్యము, శక్తి, విస్తారము, రూపము, గొప్పదనము.

విః · విస్తారముగ; భూతి . ప్రకాశించునది

542 తరుః : బిల్వ; అశ్వత్థమున్నగు వృక్షములు; కల్పవృక్షము అన్నియు శివరూపములు. ''వృక్షేభ్యో'' (రుద్రము) (శి.స నా.685)

543. గణః . భృంగి; రిటి, నంది మున్నగు గణములు కలవాడు.

## 66. లోకపాల స్తథా లోకో మహాత్మా సర్వపూజితః ।
## శుక్ల స్త్రిశుక్ల సంపన్నః శుచి ర్భూతనిషేవితః ॥

544. లోకపాలః : లోకరక్షకుడు. (శి.స.నా.46)

545. అలోకః : లోకాతీతుడు (2) అలోకంబగు పెనుచీకటి. (3) ''సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగులం''. (పురుష సూక్తం)

546. మహాత్మాః : మహత్తైన ఆత్మ కలవాడు. పరిపూర్ణుడు. (శి.స.నా.42)

547 సర్వపూజితః : సర్వులచే పూజింపబడువాడు; శ్రీ కాళహస్తీశ్వరుని, బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదులేగాక, మహర్షులు, సాలెపురుగు, ఏనుగు, పాము, బోయ కన్నప్ప, అందరూ పూజించినవారే.

548 శుక్లః తెల్లనివాడు తెలుపు స్వచ్ఛతకు గుర్తు ప్రాలేయాచల చంద్రకుంద ధవళం గోక్షీర ఫేన ప్రభం భస్మా భ్యక్త మనంగదేహ దహన జ్వాలావళీ లోచనం । బ్రహ్మేంద్రాది మరుద్గణై స్తుతి పదైరభ్యర్చితం యోగిభిః వందేహం సకలం కళంకరహితం స్థాణోర్ముఖం పశ్చిమమ్'' - (శి.స నా 563)

549. త్రిశుక్లః . మనోవాక్కాయ కర్మలందు (త్రికరణములందు) నిర్మలముగా నుండువాడు

550 సంపన్నః కైవల్య సంపదగలవాడు మోక్షమునిచ్చువాడు.

551. శుచిః : ఎప్పుడూ శుచిగనే యుండువాడు తన్ను ధ్యానించు వారిని, స్తుతించు వారిని, ఆరాధించువారిని మెరుగు పరచువారు. (శి.స.నా 999)

552 భూతనిషేవితః : భూతైః పూర్వాచార్యై నిషేవితః పూర్వాచార్యులచే సేవింపబడినవాడు.

## 67. ఆశ్రమస్థః క్రియావస్థో విశ్వకర్మమతి ర్వరః ।
## విశాలశాఖ స్తామ్రోష్ఠో హ్యంబుజాల స్సునిశ్చలః ॥

553. ఆశ్రమస్థః : బ్రహ్మచర్య, గార్హచర్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములందు ఆయా ధర్మములుగా నుండువాడు

554. క్రియావస్థః : యాగాది క్రియలందుండువాడు ధర్మమునందు జిజ్ఞాస, ఆ తరువాత బ్రహ్మమునందు జిజ్ఞాస కలవాడు.

555. విశ్వకర్మమతిః : ప్రపంచమందలి సర్వదశలను తెలిసినవాడు దేవ శిల్పి విశ్వకర్మ, అతని కౌశలములు కూడా భవుడే.

556. వరః · అందరిచే కోరబడువాడు. (శి.స.నా. 7,69)

557. విశాలశాఖః : విశాలమైన బాహువులు కలవాడు.

558. తామ్రోష్ఠః . ఎర్రని పెదవులు కలవాడు.

559. అంబుజాలః : జలరాశియైన సముద్రుడు. ''సరసామస్మిసాగరః'' భ.గీ. 10-24. సముద్రము రత్నగర్భ గంభీరమైనది, లోతైనది, విశాలమైనది, శివుడుకూడా అంతే.

560. సునిశ్చలః : ''స్థావరాణాం హిమాలయః'' భ.గీ. 10-25 ఇతనిని కదలించుటకు సాధ్యపడదు.

**68. కపిలః కపిశః శుక్ల ఆయుశ్చైవ పరో౽పరః ।
గంధర్వోహ్యదితిస్తార్క్ష్యసువిజ్ఞేయ స్సుశారదః ॥**

561. కపిలః గోధుమ వర్ణము కలవాడు (2) సిద్ధానాం కపిలోమునిః'' (భ.గీ 10) ధర్మజ్ఞాన వైరాగ్య ఐశ్వర్యాది సిద్ధులు గలవారిలో శ్రేష్ఠుడును జన్మసిద్ధుడైన కపిలముని, సాంఖ్యదర్శన కర్త (వి స నా 898)

562. కపిశాయః : బంగారు వర్ణము కలవాడు

563. శుక్లః స్వచ్ఛమైన ధవళచ్ఛాయ కలవాడు (శి.స నా 548)

564 ఆయుః · ప్రాణకోటికి ఆయుర్దాయమును నిర్ణయించువాడు

565, 566. పరః, అపరః · పరః అనగా శ్రేష్ఠమైనది; అపర అనగా తక్కువైనది. భూమిరాపో౽నలోవాయుః ఖంమనో బుద్ధి రేవచ అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధాః (భ.గీ 7-4)
పంచభూతములను పృథివి, అప్, తేజో, వాయురాకాశములు, మనోబుద్ధి అహంకారములు అను ఎనిమిది భాగములుగా ఉండునది అపరా ప్రకృతి, దీనికన్నా శ్రేష్ఠమైనది. వీటనన్నింటినీ ధరించునది పరాప్రకృతి.
పరః అన్నిటికి మొదటనున్నవాడు. అపరః అన్నిటికి వెనుక నున్నవాడు. శివునకు పూర్వము గాని తరువాతగాని ఏమియు లేనందున అతడు కలాతీతుడు.
''నమః పూర్వజాయ చాపర జాయచ'' (రుద్రం)
శివుడజాడు, నిత్యుడు, శాశ్వతుడు, జనన మరణములు లేనివానికి పూర్వాపరములు లేవు సర్వప్రాణులు పుట్టుటకు ముందు సమస్తజీవులు నశించిన పిమ్మటను సత్తామాత్రగానుండువాడు శివుడు

567. గంధర్వః : గంధర్వరూపమునున్నవాడు. గంధర్వాణాం చిత్రరథః (భ.గీ. 10-26)

568 అదితిః : దేవతలకు తల్లియు శివుడే. (2) భూమికూడా శివుడే పృథివి లింగరూపముగా కాంచీ పురమున వెలసియున్నాడు.

569 తార్క్ష్య ః : గరుత్మంతుడు. ''వైనతేయశ్చ పక్షిణాం'' (భ గీ. 10-30)

570. సువిజ్ఞేయః : బాగుగ (సులభముగా) తెలియబడువాడు

571. సుశారదః : వాక్సంపన్నుడు. మిత, మధుర భాషి.

**69. పరశ్వధాయుధోదేవ అనుకారీ సుబాంధవః ।**
**తుంబవీణో మహాక్రోధః ఊర్ధ్వరేతా జలేశయః ॥**

572 పరశ్వధాయుధః - గొడ్డలిని ఆయుధముగా గలవాడు పరశురామావతారము శివునిదే

573 దేవః జయశీలుడు. (శి.స నా 938)

574 అనుకారీ . భక్తానుగ్రహమునకై వారిని అనుకరించువాడు ఉదా. అర్జునుని రక్షించుటకై కుప్పించి ఎగసి చక్రము చేపట్టినాడు.

575 సుబాంధవః : తల్లి, తండ్రి, గురువు, సఖుడు అన్నియునితడే.

576 తుంబవీణః రెండు అంచులందు సొరకాయ కలిగిన వీణకలవాడు దానినే రుద్రవీణ అనెదము.

577. మహాక్రోధః : మహాక్రోధాకారము కలవాడు నమస్తే రుద్రమన్యవ ఉతోత ఇషవేనమః (రుద్రము) = ఓ రుద్రుడా! నీ కోపమునకు, నీ ధనుర్బాణములకు నమస్కారము = జగత్సంహార సమయమున రుద్రుడు ఘోర రూపమును ధరించును

578. ఊర్ధ్వరేతః : ఊర్ధ్వరేతస్కులైన దేవతాస్వరూపము గలవాడు ఊర్ధ్వం దేవ మనుష్యేభ్య ఉపాయభిరేతః ప్రజా విష్ణ్వాది రూపోయస్య సః । బ్రహ్మ, విష్ణు, కుమారస్వామి, గణపతి మొదలగు దేవతలందరూ శివుని అంశలు కలవారే. ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవైనమః (తై. ఉ.) (శి స నా 137)

579. జలేశయః : మహాప్రళయానంతరము విశ్రమించుటకై సూక్ష్మరూపము వహించి జలాశయమందు విష్ణురూపమున వటపత్రము మీద శయనించువాడు

**70. ఉగ్రో వంశకరో వంశో వంశనాదో హ్యనిందితః ।**
**సర్వాంగరూపో మాయావీ సుహృదో హ్యనిలోఽనలః ॥**

580. ఉగ్రః . అధికముగా గ్రసించువాడు నమఉగ్రాయచ, భీమాయచ : శత్రువుల ఎడ కోపము గలవాడు. వారికి భయము కలిగించువాడు. (2) భయమును బలిమిచే జయించు వాడును అగు రుద్రునికి నమస్కారము (సాయన, భాస్కర భాష్యము (వి.స.నా. 421) (3) సూర్యాదులకును భయము కలిగించువాడు. ''భీషోదేతిసూర్యః'' శ్రుతి.

581. వంశకరః : వంశ ప్రవర్తకుడు . సూర్యవంశ, చంద్రవంశ, రఘువంశ మొదలగు జగత్ప్రఖ్యాతి వహించిన వంశకర్త.

582 వంశః  వెదురు చెట్టు శివుడే (2)సంసార స్వరూపుడు

583 వంశనాదః : పిల్లనగ్రోవి నుండి వచ్చు నాదము వేణునాదము ఆ నాదము సమ్మోహనకరమైనది

584 అనిందితః · నిందారహితుడు అతడు వందనీయుడేకానీ నిందనీయుడు కాడు. (శి స నా. 693)

585 సర్వాంగ రూపః . సర్వాంగములు శివమయమే. సర్వాంగ సుందరుడు అతని అంగసౌష్ఠవము దారుకావనమందు ఋషి పత్నుల మోహ పరచినది

586. మాయావీ . మహామాయలమారి ''మాయాంతు ప్రకృతింవిద్ధి మాయినంతు మహేశ్వరః'' । ప్రకృతిమాయ. మహేశ్వరుడు మాయావి ఇతని మాయ జగత్తునంతయు ఆవరించియున్నందున ప్రజలు పరమేశ్వరుని గుర్తింప జాలరు ఆ మాయను అతిక్రమించుట సాధ్యపడదు అనన్యదైవ భక్తిచే, అతని కృప వలన మాయను తరించుటకు వీలగును. మాయ మూలమున సృష్టి స్థితి లయములు జరుగుచున్నవి. ''మాయాకల్పిత దేశకాల కలనా వైచిత్ర చిత్రీకృతం. మాయావీవ విజృంభ యత్యపి మహాయోగీవ యస్స్వేచ్ఛయాః'' (దక్షిణామూర్తి స్తోత్రం) ఇంద్ర జాలకునివలె స్వసంకల్పమునచే యోగమాయచే దేశకాల విధముగ చిత్రవిచిత్రమగు జగన్నిర్మాణము చేయుచున్నాడు.

587. సుహృదః : మంచి హృదయము గలవాడు. ప్రత్యుపకారము నపేక్షింపక ఉపకారము చేయువాడు సుహృత్తనబడును

సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి భ గీ 5-29

సర్వభూతములకు హృదయస్థుడై హితము చేయువాడనైన నన్ను తెలిసుకొన్న వారు శాంతిని (మోక్షమును) పొందుచున్నారు. వి.స.నా 459

588 అనిలః . అనాధానాత్ అనిలః : వాయు స్వరూపుడు. అన్నింటికీ తాను ఆశ్రయుడు. అన్నింటికీ ప్రాణదాత. శ్రీ కాళహస్తీశ్వరుడు - వాయులింగం. (శి.స.నా. 641)

589. అనలః : అనంత దాహకశక్తి సంపన్నుడైన అగ్నిహోత్రుడు - పలు విధములుగ అనుగ్రహించువాడు. (శి.స.నా. 500, 642)

## 71. బంధనో బంధకర్తాచ సుబంధన విమోచనః ।
## సయజ్ఞారిః సకామారిః మహాదంష్ట్రో మహాయుధః ॥

590. బంధనః : సంసార పాశరూపుడు.

591. బంధ కర్తః  పాశములచే బంధించువాడు

592 సుబంధన విమోచనః  ఆపాశములనుండి విడిపించువాడు

మాయాకర్మ గుణాదులచే కూడినవారు పశువులు అవిద్యాపాశములచే బంధింపబడి యున్నవారు దేవీ భాగవతము 62 విధములైన బంధములను తెలుపుచున్నది.

593 సయజ్ఞారిః . దంభపూరితుడై దక్షుడు చేసిన యజ్ఞమును ధ్వంస పరచెను. (2) యజ్ఞములను పాడుచేయు రాక్షసులకు బాణాసురాదులకు విరోధి -

594 సకామారిః  కామమునకు విరోధి మన్మధుని భస్మము చేసినవాడు కామములను జయించిన స్థిత ప్రజ్ఞుల హృదయమందుండువాడు.

595 మహాదంష్ట్ర  పెద్దకోరలు కలవాడు. నృసింహావతారము - నృసింహుని చంపిన శరభరూపుడు

596 మహాయుధః . పెక్కు ఆయుధములు కలవాడు. శూలం, వజ్రంచ, ఖడ్గం, పరశుమభయదం దక్షభాగేవహంతం నాగం పాశం చ ఘంటాం, ప్రళయ హుంతవహం సాంకుశం వామభాగే ఇవన్నీ ఆయన ఆయుధములు

## 72. బహుదానిన్దిత శ్శర్వః  శంకర శ్శంకరోఽధనః ।
## అమరేశో మహాదేవో విశ్వదేవః సురారిహా ॥

597 బహుధానిందితాయ  దారుకావనమందలి మునులను శివుడు దిగంబరుడై భిక్షమడిగెను ముని పత్నులు ఈ సుందరేశ్వరుని జూచి మోహించిరి అందుకు మునులు క్రుద్ధులై శివుని నిందించిరి. అదే విధముగా దక్షుడు కూడ శివుని అనాచారములను ఎత్తి చూపి నిందించెను.

598 శర్వః  హింసించువాడు. దారుకావనమందలి మునులు శివునిగూర్చి అభిచార హోమముచేసి దుష్ట శక్తులను శివునిపైకి పంపిరి. ఈశ్వరుడు వాటిని హతమార్చి, మునులను మైమరపించునట్లు చేసెను. (2) శృణాతి, హినస్తి పాపమితి శర్వః : పాపమును హింసించువాడు (పోగొట్టువాడు) (3) శృణాతి, హినస్తి సర్వమంతకాలే ఇతిశర్వః . ప్రళయకాలమున అందరినీ హింసించు వాడు (వి.స నా 26)

599. శంకరః  దారుకావనమందలి మునులను మన్నించి వారికి మేలు కొల్పినవాడు. దక్షునికూడా మన్నించినవాడు, మన్మధుని తిరిగి బ్రతికించినవాడు. అందరికీ క్షేమము కలుగ జేయువాడు. (శి స.నా 440,600)

600. శంకరః · శంకలను (సందేహములను) పోగొట్టువాడు దారుకా వనమందలి మునీశ్వరుల సంశయములను తీర్చి వారికి జ్ఞానమును ప్రసాదించెను.

''ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైత వాసనా'' ఈశ్వరానుగ్రహమువలననే అద్వైత వాసనలు కలుగును ''దదామి బుద్ధి యోగంతం'' (భ గీ. 10) వారికి జ్ఞానమిచ్చెదను.
''శంకానాం సమూహః, శంకం, తస్యర ఇవరః శంకరః సర్వసంశయదాహకః, సకల సంశయములను అగ్నివలె దహించువాడు. (శి స.నా.440, 599)

601. అధనః : ధనములేనివాడు దరిద్రుడు. ''దరిద్రన్నీలలోహితః'' (రుద్రం) పరందుళగేశుం పడైత్తపిరానై ఇరందుణి ఎన్నర్గళెట్రు కిరక్కు నిరందరమాగ నినైయు మడియా రిరందుండు తన్కుళలెట్ట చైమారే (తిరుమంతిరం) ధనపతి సఖుడై యుండియు నెనయుంగా శివుడు భిక్షమెత్తగ వలసెన్ (సుమతి శతకం)

602. అమరేశః : దేవతలకు ఈశ్వరుడు.

603. మహాదేవః : దేవతలలో గొప్పవాడు. పూజ్యతే యః సురైః సర్వైర్మహాంచైవ ప్రమాణతః మహేతిధాతుః పూజాయాం మహాదేవస్తతః స్మృతః. ఎల్లదేవతలచే పూజింపబడుటవలననూ, అధిక ప్రమాణముగలవాడగుట వలననూ మహాదేవుడు

604. విశ్వదేవః · విశ్వమనగా విష్ణువు. విష్ణువుకు దేవుడు (విశ్వం విష్ణుః) (శి స నా.990)

605. సురారిఘ్నః : దేవతలకు శత్రువులైనవారిని సంహరించువాడు.

## 73. అహిర్బుధ్న్యోఽనిలాభశ్చ చేకితానో హవిస్తథా ।
## అజైకపాచ్చ కాపాలీ త్రిశంకు రజిత శ్శివః ॥

606. అహిర్బుధ్నః : ఆదిశేషరూపుడు. అహిః · సర్పము. బుధ్నః పాతాళవాసి. ఆదిశేషుడు. (2) సంకర్షణాత్మకో రుద్రో నిష్క్రమ్యాతి జగత్రయం : ప్రపంచమును తనయందుంచుకొన్న చీకటి వంటి తత్త్వము.

607. అనిలాభః : వాయువువంటివాడు. గాలి కంటికి కనబడదు. కానీ స్పర్శవల్ల తెలియబడుచున్నది. అట్లే శివుడు కనబడకున్నను భావన వలన, ఆయన యొక్క విభూతులవలన తెలుసుకోవచ్చును. ''యధాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్ (భ.గీ. 9-6)

608. చేకితానః : అతిశయేన చికేతి జానాతీతి చేకితానః యుగ పదశేష విశేష విజ్ఞాన వానిత్యర్థః : అన్నింటినీ తెలిసినవాడు. సర్వజ్ఞుడు.

609. హవిః · అన్నరూప భోగ్యవస్తు సముదాయము.

610. అజైకపాత్ : ఏకాదశ రుద్రులలో ఒకడు. ఒకే కాలిమీద యుండువాడు. చలనములేనివాడు. పుట్టుకలేనివాడు.

611 కాపాలీ : కాపాలమనబడు బ్రహ్మాండమునకు అధిపతి. భూమ్యాకాశములు రెండు కపాలములు, వాటికి అధిపతి (శి.స.నా. 110)

612. త్రిశంకః : సత్త్వరజస్తమో గుణాధిక్యమువలన ప్రపంచ కార్యముల కాధారమైనవాడు.

613. అజితః : ఈ మూడు గుణములవల్ల ప్రతి ఒక్కరూ జయింపబడుతారు కాని శివుడు త్రిగుణాతీతుడు అందుచేత అతడు అజేయుడు (శి స నా 195 , 496)

614. శివః : ఉపాధిరహితుడైనవాడు. అందువలన అతనికి మాలిన్యములేదు శుద్ధుడు. (శుద్ధః నిరుపాధిరిత్యర్థః విశుద్ధిః శివస్స్యతః : వాయు సంహితః) (వి.స నా : 27; 601)

## 74. ధన్వన్తరి ర్ధూమకేతుః స్కందో వైశ్రవణస్తథా ।
## ధాతా శక్రశ్చ విష్ణుశ్చ మిత్రస్త్వష్టా ధ్రువో ధరః ॥

615. ధన్వన్తరిః · వైద్యనాథుడు ''భిషజే భవరోగిణాం'' - జన్మజరా వ్యాధులకు వైద్యుడు. క్షీరసాగర మథనమునందు ఉద్భవించినవాడు
తమిళనాడునందలి వైదీశ్వర్‌కోయిల్ అనుచోట వైద్యనాథాలయము కలదు.

616. ధూమకేతుః : తోకచుక్క. దానివలె ఉత్పాతముల కలిగించువాడు

617. స్కందః : సుబ్రహ్మణ్య స్వరూపి, శివుని పంచముఖములు, శక్తి యొక్క ముఖము కలిసి ఆరుముఖముల కుమారస్వామి అయినాడు.

618. వైశ్రవణః . కుబేరుడు. సమేకామాన్ కామ కామాయ మహ్యం కామేశ్వరో వైశ్రవణోదధాతుః : నా ఆశల.న్నియు కామేశ్వరుడగు వైశ్రవణుడు తీర్చుగాక.

619. ధాతాః : సబ్రహ్మ సశివ సహరి స్సేంద్రః : అతడే బ్రహ్మ, శివుడు, హరి, ఇంద్రుడు. చతుర్ముఖ బ్రహ్మ కూడా భవుడే.

620. శక్రః · దేవేంద్రుడు. ''ఇంద్రశ్చమే'' - రుద్రం. (శి.స. 415)

621. విష్ణుః : విష్ణు - వ్యాప్తౌ - వేవేష్టి వ్యాప్నోతి చరాచరంజగత్ సవిష్ణుః ॥ : చరాచరాత్మకమైన జగత్తునందంతటగా వ్యాపించియుండుటచే పరమేశ్వరునకు విష్ణుః అనిపేరు. (వి.స.నా.22, 258, 621)

622. మిత్రః : సూర్యరూపుడు.

623. త్వష్టాః : విశ్వకర్మ . వి.స. 53 (ప్రజాపతి సంహార సమయమున సర్వభూత తనూకరణము చేయువాడు. (సూక్ష్మీకరించువాడు)

624. ధ్రువః . ధ్రువుడు, వినాశములేనివాడు (శి.స 26, 75) (వి.స నా.387)

625. ధరః : ధరించువాడు. సర్వమునకు ఆధారమైనవాడు.

## 75. ప్రభావః సర్వగో వాయు రర్యమా సవితా రవిః ।
## ఉషంగుశ్చ విధాతా చ మాంధాతా భూత భావనః ॥

626. ప్రభావః : సర్వ వస్తువులను చైతన్యవంతము చేయగలవాడు (2) అష్టవసువులలో ఒకడు. (వి.స.నా.35)

627. సర్వగోవాయుః - అంతటా సంచరించు వాయుదేవుడు. ''నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి'' (తై.ఉ)
''యో వాతి చరాచరం జగద్ధరతి బలినా బలిష్టః సవాయుః - చరాచర జగత్తును, ధరించి, జీవింపజేసి, లయింప జేయువాడు. బలవంతులకంటె బలమైనవాడు వాయువు. (తస్మిన్నపో మాతరిశ్వా దధాతి).

628 అర్యమా : ద్వాదశాదిత్యులలో ఒకడు. (2) అర్యమా అను పితృదేవత.

629. సవితాః : జగత్తును సృష్టించువాడు. (వి.స.నా 885, 969)
ప్రజానాంతు ప్రసవనాత్సవితేతి నిగద్యతే - సర్వజగదుత్పాదకుడు.

630. రవిః : సూర్యుడు. ''జ్యోతిషాం రవిరంశుమాన్ . ఇతడు పరంజ్యోతి రశ్మిమంతుడు. (వి.స.నా 882.)
''రసానాం చ తథా ఒ ఒ దానాత్ రవిరిత్యభిధీయతేః రసములను ఆకర్షణ చేయునట్టి ఆదిత్యరూపుడు.

631. ఉషంగుః : దహించే కిరణములు గలవాడు.

632. విధాతాః : వివిధ ప్రకారేణ పోషకః - నానావిధములుగ మనలను పోషించువాడు, శాసించువాడు. (ఆదిశేషుని; అష్టదిగ్గజములను, కుల పర్వతములను ధరించువాడు). (వి.స.నా 45, 483)

633 మాంధాతాః : ''నేను'' అనబడు జీవునకు తుష్టినిచ్చువాడు.
(2) సూర్యవంశపురాజులలో ఒకడైన మాంధాత.

634. భూతభావనః : భూతములను సృష్టించి, పోషించి వృద్ధినొందించువాడు (శి.స.నా.35; వి.స.నా.9) ''భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే'' భ గీ 10-15.

## 76. విభుర్వర్ణ విభావీచ సర్వకామ గుణావహః ।
## పద్మనాభో మహాగర్భః చంద్రవక్త్రోనని లో ఒ నలః ॥

635 విభుః : ముల్లోకములకు ప్రభువు. వివిధ రూపములలో నుండువాడు. (వి.స.నా.240.)

636 వర్ణవిభాపీ  చాతుర్వర్ణములను సృష్టించినవాడు (2) ఆకాశమునుండి పొ[illegible]
మంచు, సూర్యుడు, అగ్ని - మెరుములు మున్నగు వివిధ [illegible]
ప్రదర్శించి తన రూపమును సూచించువాడు

637. సర్వకామ గుణావహః  ఎల్లరచే కోరి భజింపదగిన సుగుణములు కలవాడు ''శంభో! ప్రసిద్ధ విబుదాధిప సిద్ధసాధ్య । విద్యాధరా హరి పితామహా లోకపాలాః । అన్యేపిసాధు విధినా సుధియో భవంత । మారాధ్య జగుశ్చరమ నాః పరమామరత్వం'' మల్హణస్తవం " శంభో! ఇంద్రుడు, బ్రహ్మ, విష్ణు, సిద్ధ, సాధ్యులు, విద్యాధరులు, దిక్పాలురు, చక్రవర్తులు, ఇంకను ప్రఖ్యాతులైన దేవతలు నిన్ను భక్తి, శ్రద్ధలతో కొలిచి ఆయాపదవులను పొంది ధన్యులైనారు

638. పద్మనాభః : ప్రపంచ సృష్టికి కారణమైన పద్మమును నాభిగాగల విష్ణురూపధారి (2) నాభియందలి మణిపూరక చక్రమున విశ్వమునొక్క స్థానము కలవాడు (వి.స.నా 49)

639. మహోగర్భః . బ్రహ్మాండములన్నియు తన గర్భమున ఉంచుకొనినవాడు. (శి.స.నా 854)

640 చంద్రవక్త్రః  చంద్రునివంటి సుందర వదనము కలవాడు.

641 అనిలః . స్వయంశ్రేష్ఠుడు. అతనిని మించినవారు లేరు. ఎల్లప్పుడూ జాగరూకుడై యుండువాడు. జ్ఞాన స్వరూపి (వి.స.నా 813) ఇలః ప్రేరణచేయువాడు. తద్రహితుడు అనిలుడు. 2. ఇలతిః స్వపితిః నిద్రించువాడు జాగరూకుడై ప్రబుద్ధస్వరూపుడు. 3. నిలః గహనమైన వాడు., శివుడు గహనమైనవాడుకాదు. భక్తసులభుడు. (శి.స.నా 588)

642. అనలః . అపరిమిత శక్తిమంతుడు, అనన్యభక్తి కలిగించువాడు. (2) అనలాధిష్ఠానరూపుడు. (వి స నా. 712, 293) (శి స నా. 500, 589)

## 77. బలవాంశ్చో పశాంతశ్చ పురాణః పుణ్యచంచురీ ।
## కురుకర్తా కురువాసీ కురుభూతో గుణౌషధః ॥

643. బలవాన్ మహాబలవంతుడు, దేహ, మనో, ఆత్మబలములన్నియు కలవాడు.

644 ఉపశాంతః : క్రోధమునణచుకొని, పృథ్వివలె శాంతముగా యుండువాడు. అద్వైతస్థితిలో, తురీయావస్థలో, శివం శాంతం. మాండూక్య : ఉ.ప మవ్యపదేశ్యమేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమా శాంతం శివమద్వైతం చతుర్థంమన్యంతే సవిజ్ఞేయః

645 పురాణః పురాతనుడు, ''త్వమాదిదేవః పురుషః పురాణ'' (భ.గీ. 11-38) కవింపురాణమనుశాసితారం (భ.గీ. 8-9)

646 పుణ్యాచంచుః : పుణ్యముచేత తెలియబడువాడు.
తెలిసియో, తెలియకయో, ఆచారముతోనో, అనాచారముతోనో పూర్వ జన్మమునందు అంతో ఇంతో పుణ్యముచేసియుండిననేగానీ భగవద్భక్తి కలుగదు. ''శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం । నచేదేవం దేవోనఖలు కుశలః స్పన్దితుమపి । అతస్త్వామారాధ్యం హరిహర విరించాది భిరపి । ప్రణంతుం స్తోతుంవా కథమకృత పుణ్యః ప్రభవతిః (సౌ.ల.1) అమ్మా! భగవతీ! సర్వమంగళ సహితుడగు శివుడు జగన్నిర్మాణ శక్తివైన నీతో గూడినవే జగములను సృజించుటకు సమర్థుడగును. అట్లుకాదేని అతడు కదలలేడు కదా! కావున హరిబ్రహ్మాదులచేతను పూజింపబడదగిన నిన్ను మ్రొక్కుటకు గానీ, పొగడుటకుగానీ, పుణ్యముచేయనివాడెట్లు సమర్థుడగును?

యేషాం త్వంత గతం పాపం జనానాం పుణ్యకర్మణామ్
తేద్వంద్వ మోహ నిర్ముక్తాః భజంతేమాం ధృఢవ్రతాః (భ గీ. 7-28)
పుణ్యకర్మలుచేసి, సకలపాపాలనూ పోగొట్టుకొన్న మహానుభావులు, సుఖదుఖ రూపమైన మోహాలనుంచి విముక్తులై గట్టి పట్టుదలతో నన్నుభజిస్తారు.

647. ఈః : లక్ష్మీ బీజాక్షరము. లక్ష్మీ స్వరూపుడు. సంపదలిచ్చువాడు.

648 కురుకర్తా · కురుపదేన కురుక్షేత్రముచ్యతే. కురుక్షేత్రమనబడు కర్మభూమిని సృష్టించినవాడు. దానికి అవిముక్తమనియు, ఉపాసనాస్థానమనియు పేర్లు గలవు. దీనియందనేకులు యజ్ఞములుచేసిరి. ఇదిమహా పుణ్యక్షేత్రము. ధర్మక్షేత్రముగా ప్రసిద్ధిచెందినది. ఇచ్చట (1) పరశురామ క్షత్రియులకును (2) పరశురామ భీష్ములకును (3) కౌరవ పాండవులకును యుద్ధము జరిగెను ఆ యుద్ధములు యజ్ఞములుగా మారినవి. (దక్షుడు చేసిన యజ్ఞము రణరంగమైనది.)

649. కురువాసీ : కురుక్షేత్రమందుండువాడు. (ధర్మక్షేత్రవాసి).

650. కురుభూతః : కురుక్షేత్రము కర్మభూమి, ఉపాసనాశ్రమము, క్షేత్రే ధర్మ క్షేత్రే కురు. శరీరమే క్షేత్రము. దేవాలయం. దానిని అనగా శరీరమును పరమ ధర్మమైన మోక్షమును పొందుటకనువుగా పరమేశ్వరుడే రూపొందించినాడు. శరీరమాద్యంఖలు ధర్మసాధనం.

651. గుణౌషధః : జ్ఞానము, ఐశ్వర్యము, వైరాగ్యము మున్నగు సద్గుణములను వృద్ధిపరచి మోక్షార్హతను ప్రసాదించువాడు. అతడే ఔషధము. అతడే వైద్యుడు.

**78. సర్వాశయో దర్భచారీ సర్వేషాం ప్రాణినాంపతిః ।
దేవదేవః సుఖాసక్తః సదసత్సర్వరత్నవిత్ ॥**

652. సర్వాశయః : అందరి యొక్క చివరిగమ్య మితడే సుషుప్త్యవస్థలో సర్వభూతాశయుడై 'ప్రాజ్ఞుడు'గా యుండువాడు

653. దర్భచారీ : దర్భలమీద యుంచబడిన హవిర్భాగములను స్వీకరించువాడు దర్భలు (కుశ) చాలా పవిత్రమైనది. ఉపాసనకు ధర్భాసనము శ్రేష్ఠము

654. సర్వేషాం ప్రాణినాంపతిః . సమస్త ప్రాణులకధిపతి

655 దేవదేవః : దేవతలకు దేవుడు.

656. సుఖాసక్తః . సుఖములందు ఆశకలవాడు. (లేక) ఆశలేనివాడు. (ఆసక్తః)
''ప్రాసాదై స్తవకిం శ్మశాన వసతేః స్నానైః కిమస్థి స్రజః
కిం వస్త్రైశ్చ దిగంబరస్య భసితాలేపస్య గంధైశ్చకిం । కింధూపైః శవధూమ ధూమ్ర వపుషః కిం కాలకూటాశినో నైవేద్యైరితి భక్తిమాత్రసులభం త్వాం దేవ! సేవామహే'' శ్మశానవాసికి ప్రాసాదాలెందుకు? ఎముకలు మాలలుగా గలవానికి స్నానాదులెందుకు? దిగంబరునికి గుడ్డలెందుకు బూడిద పూసుకొను వానికి గంధమేల? పీనుగలపొగచే నల్లనైన వానికి ధూపము లెందుకు? విషము మెక్కెడివానికి అన్నమేల? (బిల్హణస్తవము 7).

657. సత్ః : సత్ స్వరూపుడు ఓం తత్సత్ పదవాచ్యుడు : సత్ : అవినాశి, ఉన్నది స్థూలము, కనబడుచున్నది. ప్రకృతి, బ్రహ్మము, మంచిది.

658. అసత్ : అపరబ్రహ్మము. ఇది వినాశము కలది. అసలు లేనిది, సూక్ష్మమైనది, కనబడనిది. అవ్యక్తము : వికృతి, మాయ, చెడ్డది.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృత మశ్నుతే
అనాది మత్ పరంబ్రహ్మ నసదన్నా సదుచ్యతే భ. గీ. 13-12
ఏది తెలియదగినదో, దేనిని తెలిసికొనినచో మానవుడు మోక్షమును పొందునో అది అనాదియగు పరబ్రహ్మము. అది సత్తనిగానీ అసత్తనిగానీ చెప్పుటకు వీలులేదు. ఈ రెండింటి తారతమ్యము తత్త్వదర్శులకే ఎరుక.

659. సర్వరత్నవిదుః : ఎల్లరత్నములను అనగా శ్రేష్ఠములు గలవాడు. కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ । గృహస్థే స్వర్భూజామర సురభి । చింతామణి గణే । శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిల శుభే । కమర్థం దాస్యేహం భవతు భవదర్థం మమ మనః ॥ (శి.ల. 27)

ఓ గిరీశా! బంగారు కొండ చేతిలోనుండ కుబేరుడు దగ్గరనుండ, కల్పవృక్ష, కామధేను, చింతామణి గణము గృహమందుండ, శిరస్సున చంద్రుడుండ. పాదములందు అఖిల శుభములుండ - నేను నీకేమి ఇవ్వగలను? నామనస్సు ఇచ్చెదను తీసుకో

## 79. కైలాసగిరి వాసీచ హిమవద్గిరి సంశ్రయః ।
## కూలహారీ కూలకర్తా బహువిద్యో బహుప్రదః ॥

660. కైలాసగిరివాసీ . కైలాసగిరియందు నివసించువాడు.

661. హిమవద్గిరి సంశ్రయః : హిమాలయ పర్వతము నాశ్రయించినవాడు

662 కూలహారీ : మహాప్రవాహరూపమున తీరములను హరించువారు.

663 కూలకర్తా పుష్కర తీర్థము మొదలగు మహాతటాకముల నిర్మించువాడు లేక కూల్యమనగా తీరము సముద్ర, నదీ, తటాక తీరములందు లింగ రూపమున నుండువాడు

66 బహువిద్యః అనేక విద్యా స్వరూపుడు ''ఈశానః సర్వవిద్యానాం''

665. బహుప్రదః అధికముగా ఇచ్చేవాడు
''తవచరణ సరోజే దత్తమేకం ప్రసూనం ఫలతి జలధివేలా వేష్టితాం భూతధాత్రీం'' శంభో! నీ యొక్క పాదకమలములు ఉంచబడిన ఒక పుష్పము - సమస్త పృధ్వీచక్ర ప్రభుత్వమును ప్రసాదించు చున్నది
''ఏకబిల్వం శివార్పణం'' - అంటూ ఒక బిల్వదళాన్ని అర్పించినచో ''దంతి కోటి సహస్రాణాం, గోహిరణ్య సహస్రకం సర్వక్రతుమయం పుణ్యం'' కలుగుతుంది. తత్ఫలం ప్రాప్నుయాత్ సత్యం ఏకబిల్వం శివార్పణం

## 80. వణిజో వర్ధకీ వృక్షో వకుళశ్చందనచ్ఛదః ।
## సారగ్రీవో మహాజత్రు రలోలశ్చ మహౌషధః ॥

666 వణిజః : వర్తకుడు. ''నమో మంత్రిణే వాణిజాయ కక్షాణాం పతయే నమః రుద్రం ఊరూతదస్య యద్వైశ్యః = (పురుషసూక్తం)
వర్తకుడు దేశమందలి వ్యవహారములనెట్లు విచారించు చుండునో అట్లే శివుడుకూడా సర్వకర్మలను విచారించుచుండును (2) వర్తకుని యొక్క వ్యవహారము శివరూపమే. (3) వాణి వాక్కు, వాగ్రూపమున వున్నవాడు

[illegible] వృక్షకీ వజ్రాంగి సముస్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమః [illegible], [illegible]
వృక్షములను ఛేదించువాడు

668 వృక్షః చెట్టు (సంసార వృక్షము) ''నమో వృక్షేభ్యో హరికేశేభ్యః'' [illegible]
వృశ్చ్యతే ఇతి వృక్షః ఛేదింప బడునది [illegible] వృక్షము, [illegible]
నశించునట్టి ఉపాధులు (బ్రహ్మమొదలు [illegible] [illegible] [illegible]
అగుచున్నవి

669 వకుళః పొగడచెట్టు

670 చందనః శ్రీ గంధపుచెట్టు మూలేభుజంగాః : శిఖరే విహంగాః శాఖా
ప్లవంగాః కుసుమాని భృంగాః ఆశ్చర్యమేతత్ ఖలుచందనస్య పరోపకారాయ
సతాం విభూతయః చందన చెట్లు మొదట్లో పాములు, పైన పక్షులు
కొమ్మలమీద కోతులు, పూలపై తుమ్మెదలు ఉంటాయి. సత్పురుషుల గొప్ప
తనము వారి పరోపకార పరాయణతలో వుంటుంది అదే ఆశ్చర్యము

671 ఛదః ఏడేసి ఆకులుగల అరటి చెట్టు

672 సారగ్రీవః · ధృఢమైన (సారవంతమైన) కంఠము కలవాడు సకల దేవతలకు
భయంకరమై, మృత్యువు వంటిదైన విషమును శివుడు తన కంఠమందు
ఇంద్రనీల మణివలె ధరించెను (2) శివుని ''హుం'' కార మాత్రమునే
త్రిపుర సంహారము జరిగెను ''ఉచ్చైర్ఘోషం'' అని ఒకనామముంది

673 మహాజత్రుః · మెడవద్ద బలిష్ఠమైన ఎముకలు కలవాడు
''మహోన్నత మహాకాయం మహోదర మహాభుజం। మహావక్త్రం మహావృద్ధం
ఏకబిల్వం శివార్పణం'' శివుని అంగములన్నియు గొప్పవి

674 అలోలః : నిశ్చలముగా నుండువాడు. అచంచలుడు

675 మహౌషధః · ఓషధులన్నియు ఆయనే అతని రోమములు ఓషధులు వరి,
గోధుమలు, ఉలవలు, అన్నియు ఆయనే. ఇవన్నియు అన్నరూపములు.
అందుచే అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ (2) సంసార రోగ నివారకత్వమును బట్టి
మహౌషధం అని పేరు కలిగినది (వి.స.నా 287)
''ప్రాతఃస్మరామి భవభీతిహరం సురేశం । గంగాధరం వృషభ వాహన
మంబికేశం । ఖట్వాంగ శూలవరదాభయ హస్తమీశం । సంసార రోగహర
మౌషధ మద్వితీయం ॥ (శివప్రాతస్స్మరణమ్)

## 81. సిద్ధార్థకారీ సిద్ధార్థ శ్ఛందో వ్యాకరణోత్తరః ।
## సింహనాదః సింహదంష్ట్రః సింహగ స్సింహ వాహనః ॥

676. సిద్ధార్థకారీః · సాధకుల ప్రయత్నములను సఫలముచేయువాడు ఆధారం
స్థానము, కర్త, సాధనములు, కృషి ఇవన్నీయు చక్కగా యుండిననూ

దైవానుకూలము లేనిదే ఫలించవు. ఈశ్వరుని దయ అవసరము

''అధిష్ఠానం తథాకర్తా కరణంచ పృథగ్విధమ్ । వివిధాశ్చ పృథక్ చేష్టాః దైవం చైవాత్ర పంచమమ్'' (భ గీ. 18-14) కర్మలన్నిటికీ శరీరం, జీవాత్మ, ఇంద్రియాలు, వాటివేర్వేరు వ్యాపారాలు, దైవం అనే ఐదున్నూ కారణాలు. అందుచేత దైవానుగ్రహం లేకపోతే సాధకుని ప్రయత్నము ఫలించదు

677. సిద్ధార్థాయ ఛందోవ్యాకరణోత్తరః · పూర్వపక్షం నిరస్యయో నిష్పన్నో అర్థః ససిద్ధార్థ ఉచ్యతే. తస్యైవ విశేషణం ఛందో వ్యాకరణోత్తర ఇతివేద వ్యాఖ్యానోప బృంహిత - ఇత్యర్థః : వేదవ్యాఖ్యానమును సిద్ధాంత రూపముగా, ఛందో వ్యాకరణ బద్ధముగా, పూర్వపక్షము యొక్క వాదమును నిరసించి, **ఋజువు** పరచుట. ఆ వాదబలముకూడ **శివుడే. ''వాదః ప్రవదతామహం'' భ.గీ.** 10-32 : వాదము **మూడు విధములు. (1)జల్పము (2) వితండము (3)** వాదము ఇవన్నియూ శివస్వరూపములే.

678 సింహనాదః : పంచాననుడు. అందుచే సింహనాదముచేయువాడు మత్తేభము లైన కామక్రోధాదులు ఆనాదం వింటేనే పరమ పదం చేరుకొంటాయి

గర్జత్ ప్రచండ ఘనఘర్ఘరమేఘసంఘ సంఘట్టఘోషఘనఘోర రవేణకోన్యః పంచాననం దురితమత్త మతంగ జానాం.

679. సింహదంష్ట్రః : సింహపు కోరలు కలవాడు. ఆయన కోరలు మహాభయంకరములైనవి, వరాహ, నృసింహావతారములందు ఒక హిరణ్యాక్ష హిరణ్యకశిపులను సంహరించు ఆయుధములు ద్వాపరమున కురుపాండవ యుద్ధమున ఆ కరాళ దంష్ట్రలందు భీష్మద్రోణాది వీరగర్వితులుకూడా చిక్కుకొని గిజ గిజలాడిరి.

680. సింహగః : సింహ గమనుడు.

681. సింహవాహనః . సింహవాహనుడు. మహిషాసురాది రాక్షస సంహారమందు దుర్గ సింహమును వాహనముగా చేసుకొనెను. రాక్షస సైన్యాన్ని సింహమే సంహరించిన దేవికి శివునికి భేదములేదు. ఆమె వాహనమే ఈయనకు కూడ వాహనము.

## 82. ప్రభావాత్మా జగత్కాల స్థాలో లోకహితస్తరుః ।
## సారంగో నవచక్రాంగః కేతుమాలీ సభావనః ॥

682 ప్రభావాత్మాః : సత్యస్య సత్యం · సత్యమునకు సత్యమైనవాడు. ''ప్రాణావై సత్యం, తేషా మేష సత్యం'' ఇత్యర్థః

683. జగత్కాలస్థాలః . జగత్తును గ్రసించు కాలమును భోజన పాత్రగా కలవాడు.
"ఏకః స్రష్టా సకల జగతామాదిభూత స్స్వయంభూస్త్రాతా తేషాం త్రిభువన గురుర్వాసుదేవః ప్రసిద్ధః । యస్తావ్వావప్యతుల మహిమా సంహరత్యంతకాలే, కస్తస్యాన్యో భవతి సదృశః శ్రీ మహాకాలమూర్తేః (హలాయుధ స్తవము 4) సమస్తలోకములను సృజించుటలో బ్రహ్మయు; వీనిని కాపాడుటలో ప్రసిద్ధుడైన విష్ణువును, కర్తలై యున్నారు. కానీ ఆ ఇద్దరిని కూడా ప్రళయకాల మందు ఎవడు సంహరింపగలడో ఆ మహా కాలస్వరూపుడైన రుద్రునకు సాటియగువాడు మరొకడు కలడా!
కాలోఽస్మిలోకక్షయకృత్ ప్రవృద్ధో । లోకాన్సమాహర్తు మిహప్రవృత్తః ఋతేఽపిత్వాం న భవిష్యంతి సర్వే । యేఽవస్థితాః ప్రత్యనీ కేషుయోధాః (భ.గీ. 11-32) లోక సంహారానికి విజృంభించిన కాలస్వరూపుడను నేను ప్రస్తుతం ఈ ప్రపంచంలోని ప్రజలను చంపడమే నా సంకల్పం. నీవుయుద్ధం చేయకపోయినా శత్రుసైన్యంలోని వీరులంతా వినాశం పొందడం ఖాయం.

684 లోకహితః . లోకమందలి వారందరికీ మేలు చేకూర్చువాడు కరుణావరుణాలయుడు.

685 తరుః : జన్మ మృత్యు సంసార సాగరమును తరింప జేయువాడు
"నిరాకార మోంకార మూలంతురీయం । గిరాజ్ఞాన గోఽతీత మీశం గిరీశమ్ । కరాళం మహాకాళ కాలం కృపాళుం । గుణాగార సంసార పారం నతోహమ్ ॥ (గోస్వామి తులసీదాసు కృత రుద్రాష్టకం)
అపార సంసార సముద్ర మధ్యే । సమ్మజ్జతోమే శరణం కిమస్తి । గురో కృపాళో కృపయావదైత విశ్వేశపాదాంబుజ దీర్ఘనౌకాః (ప్ర.ఉ) అపారసంసార సాగరమున మునిగిపోవుచున్న నాకు దిక్కేది? జవాబు : సర్వేశ్వరుని పాదపద్మ మనెడి నౌక (ఆదిశంకరుని ప్రశ్నోత్తరి) (శి.స.నా.542)

686. సారంగః : విశిష్టమైన అంగములు కలవాడు. శ్రేష్ఠమైన వాటిని అందిచ్చువాడు, సారంగ పక్షిస్వరూపుడు.

687. నవచక్రాంగః : (1) నవావరణములుగల శ్రీ చక్రమును అంగముగా గలవాడు (2) సదానూతనముగా యుండు సూర్య చంద్రులను తన రథచక్రములుగా గలవాడు. (3) చక్రాకారముగా యుండు నవగ్రహరాశి చక్రములు తనకు అంగముగా గలవాడు. (4) పాలనుండి నీళ్లను వేరు చేయుగల హంసవంటి వాడు. (హంసోనామస్సదాశివః)

688. కేతుమాలిః : నెమలి, కోడి మొదలగు పక్షిరూపములనుండువాడు. (2) ధ్వజమునందు శోభించువాడు.

689 సభావనః : సభాం : ధర్మపరీక్షాస్థానం అవధీతి సభావనః ధర్మాసనములను న్యాయస్థానములను రక్షించువాడు.

## 83. భూతాలయో భూతపతి రహోరాత్రమనిందితః ॥

690. భూతాలయః సర్వప్రాణులకు ఉనికి పట్టు అయినవాడు.

691 భూతపతిః : ఎల్లప్రాణులకు రక్షకుడు

692 అహోరాత్రః : పగలురాత్రి స్వరూపుడు.

693 . నిందింపబడనివాడు, పూజనీయుడు.

ంం మహేశం రజతగిరి నిభం చారు చంద్రావతంసం
క్ష్వలాంగం పరశు మృగ వరాభీతి హస్తం ప్రసన్నమ్
సమన్తాత్ స్తుత మమరగణై ర్వ్యాఘ్ర కృత్తిం వసానం
విశ్వ బీజం నిఖిల భయహరం పంచ వక్త్రం త్రినేత్రం

## 84. ...తా సర్వభూతానాం నిలయశ్చ విభుర్భవః ।
## ...ఘస్సం యతో హ్యాశ్వో భోజనః ప్రాణధారణః ॥

694. ...తా సర్వభూతానాం : ప్రాణులను నడిపించువాడు.
ద్రశ ంతే పంచ భూతాని యేచ లోకాశ్చతుర్దశ । సముద్రాః పర్వతాదేవా రాక్షసా ఋ .యస్తథా దృశ్యంతే యానివాన్యాని స్థావరాణి చరాణిచ'' (శివగీత 6-6,7) పంచభూతములు, పదునాల్గులోకములు, సముద్రములు, పర్వతములు, దేవాసురులు, మునులు, స్థావర జంగమములు, గంధర్వులు, నాగులు ఇవన్నీ నా విభూతులే.

695. సర్వ భూతానాం నిలయః : సకలభూతములు అతని యందే ఇమిడి యున్నవి. ''మయిసర్వం యథారామ జగదేతచ్చరాచరం వర్తతే తద్దర్శ యామి నద్రష్టుం క్షమతే భవాః'' ''ఓ రామచంద్రా చరాచరాత్మ కంబై నాయందుండు దానిని నీకు చూపెదను'' అని శ్రీరామచంద్రునికి శివుడు తన విశ్వరూపమును చూపించెను. (శివగీత. 7-10)

696. విభుః · జన్మలేనివాడు అజుడు నిత్యుడు ''భవిష్యామిచ లోకేఽస్మిన్ మత్తోనాన్యోస్తి కశ్చన । వ్యతిరిక్తం నమత్తోస్తి నాన్యత్కించి త్సురేశ్వరాః (శి. గీ 6-11) నాకన్న మరియొకండు లోకాలలో లేడు. నాకన్యమైనదికూడా ఏదీలేదు (వి.స.నా 240 శి.స.నా. 145, 203, 635.)

697 భవః సకల ప్రాణులకు ఉత్పత్తిస్థానము. ''బహులరజసే విశ్వోత్పత్తౌ భవాయుచ నమోనమః । శివ మహిమ్న స్తోత్రం 30) (శి.స.నా 12) భవే భవే నాతి భవే భవస్వమాం । భవోద్భవాయ నమః ॥

698 అమోఘః తలని సంకల్ప మెన్నటికీ వృథాకాదు ''సత్యకామః సత్య సంకల్పః'' (ఛాం ఉప 20 . 8,7) పూజింపబడి స్తుతింపబడి సంస్మరింప బడి సర్వఫలములనిచ్చువాడు వృథాచేయనివాడు (వి స నా 110)

699 సంయుతః : ధారణ, ధ్యాన, సమాధులు, పూర్తి వైరాగ్యము కలవాడు. ''త్వామాత్మానం వరద పరమానంద బోధస్వరూపం । యే బుధ్యంతే విగలిత జగద్భేద మాయా ప్రపంచం । రాగత్యాగాత్ స్తిమిత మనసో దేవ జీవంత ఏవ భ్రశ్యన్మాయా నిబిడ నిగడ గ్రంథ యస్తే విముక్తాః'' (హలాయుధస్తవము 52)

కేవల పరమానందమును గలిగించి, సుజ్ఞానదమై, పరమాత్మ స్వరూపమైన, నిన్ను జగత్తునందలి హేయమాయా విస్తారమును నశింప జేయు వానినిగా దలంచుచు నేయోగీశ్వరులు ఉపాసించు చున్నారో, ఆ మహానుభావులును విషయాభిలాషను వీడి నిర్మల హృదయులై, గాఢమైన మాయా పాశమును త్రెంచివేసి జీవిత కాలముననే ముక్తులగుచున్నారు.

700. అశ్వః ఉచ్చైశ్రవ సమశ్వానాం (భ గీ 10-27) గుఱ్ఱములలో ''ఉచ్చైశ్రవమను గుఱ్ఱమును నేను'' (2) శ.స ల కు బేధములేదు అస్వాయ · ధనములేనివాడు దరిద్రుడు (3) అశ్వస్తినికులనబడు ఋషులను పాలించువాడు. వారు ఏ పూటకు ఏది కావలయునో తెచ్చుకొని జీవించెడివారు కూడబెట్టరు (4) హయగ్రీవుడు

701 భోజనః · సర్వప్రాణులకు భోజనము చేకూర్చువాడు (వి స నా 143)

702. ప్రాణధారణః : ప్రాణముల నిలుపువాడు

## 85. ధృతిమాన్ మతిమాన్ దక్షః : సత్కృతశ్చ యుగాధిపః । గోపాలి ర్గోపతిర్గ్రామో గోచర్మవసనో హరిః ॥

703. ధృతిమాన్ : ధైర్యము కలవాడు. ధృతి ధైర్యము, ధారణ, పట్టుదల, ధృడమగు మనోనిశ్చయము.

704. మతిమాన్ : బుద్ధిమంతుడు (అందుచేతనే కాలకూట విషమును తన కంఠమున నుంచుకొనెను)

705. దక్షః : ఉత్సాహము కలవాడు. నిరంతరము తాండవము చేయువాడు సామర్థ్యము దాక్షిణ్యము కలవాడు జీవులయందు కనికరము కలవాడు అజ్ఞానులను జ్ఞానమార్గమున నడుపువాడు.

706. సత్కృతః : ఆదరింపబడినవాడు. అందరిచే పూజింపబడువాడు ''బ్రహ్మేంద్ర విష్ణు సురదానవలోకపాలై రన్యైశ్చ సిద్ధమునిభిః పరిపూజి

తత్వా! దృష్ట్వా యదత్ర పునరిచ్ఛతి దేవమన్యం! సంసారిణో నరకహేతురయం విమోహః'' (మల్లిణాస్తవం - 5) (''శివో ఏకోధ్యేయః, శివంకరః సర్వమన్యత్పరిత్యజ్య'') మహాదేవా! విష్ణు, బ్రహ్మ, మహేంద్రులు, రావణాది రాక్షసులు, వాయువు, అగ్ని, కుబేరాది దేవతలు, హరిశ్చంద్రాది చక్రవర్తులు సిద్ధులు, సానందాది మునులు నిన్ను గొలిచియే తరించుచున్నారు. ఇట్టి మహాదేవునిగా నిన్ను తెలిసియు, ఇతరదేవతల నారాధించి ఫలముల నపేక్షించువారు మరల మరల సంసార నరకముననుభవించుట తథ్యము అందుచే అందరూ కడపటికి శివునే ఆశ్రయించెదరు. (వి స నా. 701)

707 యుగాధిపః : శుభాశుభములు, లాభ నష్టములు, జయాపజయములు, మానావమానములు మొదలగు ద్వంద్వములకతీతుడు, (2) యుగాధిపతి (3) పుణ్యపాపకర్మలకు ఫలమునిచ్చెడివాడు

708. గోపాలిః : ఇంద్రియములకు పాలకుడు. (గోపాయ, గోపనమితాయ నమశ్శివాయ)

709 గోపతిః : భూపతి (2) రశ్మిలను కలిగిన సూర్యుడు (3) వేదవాక్కులకు పతి (వి.స.నా. 494, 593)

710 గ్రామః . సమూహము. పదిమంది యుండేచోట పరమేశ్వరుడుంటాడు

711. గోచర్మవసనః ఆవు, చర్మమును వస్త్రముగా ధరించువాడు.

712. హరిః : భక్తుల దుఃఖమును హరించువాడు. (వి.స.నా · 651) (శి స నా. 208, 377, 787) ''ప్రణత భక్తజనార్తి హరం - పరం, భజతరే మనుజా గిరిజాపతిం''

## 86. హిరణ్య బాహుశ్చ తథా గుహాపాలః ప్రవేశినాం ।
## ప్రకృష్టారి ర్మహాహర్షో జితకామో జితేంద్రియః ॥

713. హిరణ్యబాహుః : నమో హిరణ్య బాహవే హిరణ్య వర్ణాయ హిరణ్య రూపాయ హిరణ్య పతయే ఉమ్బికా పతయే ఉమా పతయే పశుపతయే నమో నమః ॥ హితమును రమణీయమును అగునది హిరణ్మయము. అట్టి చేతులుగలవాడు. బాహువులు హిరణ్మయములని చెప్పినప్పుడు సర్వాంగములకు అన్వయించు కొనవలయును. మనోరంజకమైన రూపము గలవాడు.

714. ప్రవేశినాం గుహాపాలః : ధ్యాననిష్ఠులు, నిర్వికల్ప సమాధి యందుండు యోగులయొక్క దేహమును కాపాడువాడు. చాలా కాలము వారు సమాధిస్థితి యందుండగా దేహము చెడిపోగలదు. అట్లు చెడనీయక కాపాడెడివాడు.

715. ప్రకృష్టారిః . అంతః శత్రువులగు కామక్రోధాదులను - కాంతాకనకాలనేది వ్యామోహాన్ని అణచివేసినవాడు.

''వేధా ద్వేధా భ్రమంచక్రే । కాంతాసు కనకేషుచ । తా సంతేష్వప్యనాసక్తః సభర్గో మానవాకృతిః'' సృష్టికర్త స్త్రీ యందును, ధనమునందును భ్రమను కలుగజేసియున్నాడు. ఇట్టి స్త్రీ ధనములందు ఎవడు ఆసక్తి కలవాడు కాడో అట్టి మనుష్యుడు మానవ శరీరముదాల్చిన భర్గుడే (ఈశ్వరుడే) అగుచున్నాడు.

716. మహాహర్షః : మిక్కిలి సంతోషముతో నుండువాడు సచ్చిదానంద స్వరూపుడు. ఆనంద నటరాజు.

717. జితకామః : కామమును జయించినవాడు. ''ఫాలలోచన జాతపావక దగ్ధ మన్మథ విగ్రహం''

718. జితేంద్రియః : ఇంద్రియములను జయించినవాడు

## 87. గాంధారశ్చ సువాసశ్చ తపస్సక్తో రతిర్నరః । మహాగీతో మహానృత్యో హ్యప్సరో గణసేవితః ॥

719 గాంధారః : సప్తస్వరములలో ఒకటైన ''గాంధార'' రూపుడు. (2) భూమిని ధరించువాడు.

720. సువాసః : శోభనం వసతి స్థానం కైలాసాఖ్య మస్య దివ్యమగు కైలాస పర్వత మందుండువాడు. ''గిరిశన్తాభిచాకశీహి'' (రుద్రం) కైలాస పర్వతమందుండి నిత్యము ప్రాణులకు సుఖము కలిగించువాడు.

721. తపస్సక్తః : తపస్సునందాసక్తిగలవాడు. ఆయన తపోమూర్తి.

''నమస్తే నమస్తే తపోయోగ గమ్య; నమస్తే నమస్తే శ్రుతిఃజ్ఞాన గమ్య''

722. రతిః · సుఖస్వరూపి; ఆనందరూపుడు. ఆత్మారాముడై ఆత్మానందములో తేలియుండువాడు. ''యుస్త్వాత్మ రతి రేవస్యా దాత్మ తృప్తశ్చ మానవః ఆత్మన్యేవచ సంతుష్టస్తస్య కార్యం నవిద్యతే'' (భ.గీ. 3-17) ఆత్మతృప్తుడై, ఆత్మరతుడైన వానికి చేయదగినదేదియు లేదు.

శివతాండవము చేయువాడు. ''ధరాధరేంద్ర నందినీ విలాస బంధు బంధుర స్ఫురద్దిగంత సంతతి ప్రమోదమాన మానసే, కృపా కటాక్షధోరణీ నిరుద్ధ దుర్ధరాపది క్వచిద్దిగంబరే మనోవినోద మేతు వస్తుని''

''ఆత్మ క్రీడ ఆత్మరతిః క్రియావాన్ ఏషబ్రహ్మ విదాం వరిష్ఠః ''

ముండ. ఉ (3-4)

723 నరః నయతి ప్రాపయతి బ్రహ్మాండమితి నరో విరాట్ బ్రహ్మాండమును నడిపించు విరాట్పురుషుడు. (శి స నా 873)

724 మహాగీతః శ్రేష్ఠమైన గీతముగానున్నవాడు నాదశరీరుడు సామగాన లోలుడు వేద, శాస్త్రములచేతను, పండిత పామరులచేతను గానము చేయబడువాడు త్వాందీప్యమాన మకుటోత్తట చారుహార । కేయూర కుండలధరా గిరి గహ్వరేషు । గంధర్వలోక లలనాలితై శ్వచోభి । రుచ్చైః కృతాంజలిపుటం భగవంస్తువంతి (మల్లిణస్తవము 22)
ప్రభో! మేరు మందరా చలములలో నివసించు గంధర్వ కాంతలు మిక్కిలి భక్తితో మ్రొక్కుచు ప్రకాశమగు కిరీటములను, ముత్యాలసరములను, పుష్యరాగకమ్మలు దాల్చి కమ్మని పాటలతో పాడుచున్నారు

725 మహానృత్యః నటరాజ శిఖామణి
జయత్వదభ్ర విభ్రమ భ్రమద్భుజంగమ శ్వస
ద్వినిర్గమత్ క్రమస్ఫురత్ కరాళఫాల హవ్యవాట్
ధిమిద్ధిమిద్ధిమి ధ్వనన్మృదంగ తుంగ మంగళ
ధ్వనిక్రమ ప్రవర్తిత ప్రచండ తాండవ శ్శివః (రావణకృత శివతాండవము)
''వేదాంగళాడ, మిగు ఆగమమాడ, గీతంగళాడ, కిళరండ మేళాడ, భూతంగళాడ, భువనములుదాడ, నాదం కొండాడినాౕ జ్ఞానానందకూత్తే'' (తిరుమంతిరం)

726. అప్సరో గణసేవితః అప్సర సమూహము చేత సేవింప బడువాడు సంగీతము, నృత్యము, నాట్యము, రతి వుండుచోట అప్సరలు తప్పక ఉంటారు.

## 88. మహాకేతుర్మహాధాతుః నైకసానుచర శ్చలః ।
## ఆవేదనీయ ఆదేశః సర్వగంధ సుఖావహః ॥

727. మహాకేతుః : శ్రేష్ఠమైన పతాకము కలవాడు. వృషధ్వజుడు, చత్వారి శృంగాత్రయో అస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తో అస్యత్రిదా బద్ధో వృషభో రోరవీతి మహోమర్త్యాగ్ ఆవివేశః -
(తైత్తిరీయ నారాయణవల్లీ 10 అను) ''ఆవృషభము ధర్మమునకు సంకేతము. గాయత్రీ మహామంత్రము. ఆ వృషభమునకు నాలుగు కొమ్ములు. మూడు పాదములు, రెండు శిరస్సులు, సప్త హస్తములు, ముప్విధములుగా అటువంటి వృషభమును తన ధ్వజమునందుంచుకొన్నాడు

728. మహాధాతుః . శ్రేష్ఠమైన ధాతువులతో నిండియుండు మేరు పర్వతమును ధరించినవాడు. మేరు శ్శిఖరిణామహం . (భ.గీ. 10-23 )

729 నైక సానుచరః కైలాసము, మేరు, హిమాలయము శ్రీ శైలము, శ్రీ కాళహస్తిలోని శివానందైక నిలయము వంటి అనేక పర్వత శిఖరములందు సంచరించువాడు

730 చలః పట్టుబడక పరుగులెత్తువాడు తానే వరమిచ్చిన భస్మాసురునికి చిక్కక పరుగులెత్తినవాడు. మనసుకన్నా వేగముగా పరుగెత్తువాడు మనోనిగ్రహము, శీలము, భక్తి, శ్రద్ధలు మున్నగు దైవీ సంపదలు లేనివారికి పట్టుబడడు.

731. ఆవేదనీయః . ''యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ'' వాక్కులకు అందనివాడు వాచామగోచరుడు అయితే గురువు యొక్క ఉపదేశము వలన, దయవలన తెలియబడగలడు.

అనాద్యంతమాద్యం పరంతత్త్వ మర్థం, చిదాకారమేకం, తురీయం త్వమేయం। హరిబ్రహ్మ మృగ్యం । పరబ్రహ్మ రూపం మనోవాగతీతం మహాశైవమీడే'' (శివ భుజంగ ప్రయాతం - 2)

732 ఆదేశః · సాక్షాత్ ఉపదేశ రూపః · సాక్షాదుపదేశ రూపుడు, ''తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి; అయమాత్మాబ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ, శివోహం'' వంటి మహావాక్యములను గురూపదేశము అపరోక్షానుభూతితో తెలుసుకో దగినవాడు.

733. సర్వగంధ సుఖావహః ఒకేసారి సర్వగంధములకు సుఖము కలిగించువాడు ఆయన కటాక్షమువలన జన్మాంతర వాసనలన్నియు సుఖదాయకములే అగును గంధములు (వాసనలు) ఎల్లప్పుడూ దుఃఖదాయకములే - అవి యిచ్చు సుఖములు చివరకు దుఃఖములో ముంచును. పరమేశ్వరాను గ్రహమున కలిగినచో - పాపములు కూడా పరిహరింపబడి శాశ్వత సుఖము కలుగును చేతిలో భిక్షాపాత్ర కలిగిననూ, ఐశ్వర్యవంతుడు త్రిలోకాధిపతి. ఎంతభోగియో అంతటియోగి, విషము తినిననూ అమృతుడు; ఎంతటి రుద్రుడో అంతటి శాంతమూర్తి కాముని సంహరించిన పార్వతీపతి కామేశ్వరుడు శృంగార రస సంపూర్ణుడు. ఎముకలు ధరించిననూ పవిత్రుడు. శిరస్సున గంగ, నొసట అగ్ని; ఇట్టి విరుద్ధ విషయములున్ననూ ఆయనది శాశ్వత సుఖము - (అనామయ స్తవం 31)

యోగీభోగీ విషభుగమృత శ్చాత్ర ప్రాణస్తపస్వీ । శాంతః క్రూర
శ్చమితి విషయః శైలకన్యాసహాయః । భిక్షావృత్తిస్త్రి భువన పతిః
శుద్ధిమానస్థిమాలీ । శక్యో జ్ఞాతుం కథమివ శివత్వం విరుద్ధ స్వభావః -

**89. తోరణస్తారణో వాతః పరిధీ పతి ఖేచరః ।
సంయోగో వర్ధనో వృద్ధో అతివృద్ధో గుణాధికః ॥**

734. తోరణః . ముక్తి సౌధమునకు ద్వారము వంటివాడు
''ఉపదిశతి యదుచ్చైర్జ్యోతి రామ్నాయ విద్యా । పరమ పరదూరం దూరమాద్యంత శూన్యం త్రిపుర జయిని తస్మిన్ । దేవదేవేశ తేమే భగవతి పరివర్తో న్మాదినీ భక్తిరస్తు'' (అనామయస్తవము - 31) ఋతం సత్యం పరంబ్రహ్మ ఏ కో రుద్రో నద్వితీయా - అని వేదవేదాంతములు ఏ ఉన్నతమైన జ్యోతిని పరముగాను, అపరముగాను, దూరదూరముగాను, ఆద్యంతములు లేవని ఉపదేశించుచున్నవో - ఓ మహాదేవా! అట్టి గుణైశ్వర్యములు గల త్రిపురముల జయించిన నీయందు నా భక్తి నిరంతరము సంచరించుగాక!

735. తారణః : సంసార సాగరమును దాటించువాడు. యదాపాద మాత్రాయ తేర్లం ఘ్యశక్తిః కృతాంతాద్భువాన్ భక్తదాక్షిణ్యభావః । తదాపాహిమాం పార్వతీ వల్లభాన్యం । నపశ్యామి పాతారమే తాదృశంమేః ॥
అత్రహిజంతోః : ప్రాణైరుత్క్రమమాణస్య రుద్రస్తారకం బ్రహ్మవ్యాచష్టే (జాబాల్యుపనిషత్తు, వి.స.నా. 337)

736. వాతః : వాయురూపుడు. ''నమో వాత్యయచ'' పవనః పవతామస్మి

737. పరిధిః : విశ్వమున కంతటినీ పరిధి అయినవాడు. చుట్టూ కోటగోడవలె వృత్తమునకు పరిధివలె కాపాడువాడు

738. పతిఖేచరః : పక్షిరాజగు గరుత్మంతుడు, వైనతేయశ్చ పక్షిణాం ( భ.గీ. 10-30)

739. సంయోగవర్ధనః : ప్రజాభివృద్ధికి, జగత్పరిణామ కారణమగు స్త్రీ పురుష సంయోగమును వృద్ధిపరచువాడు. ప్రకృతి పురుషుల కలయిక, జీవాత్మ పరమాత్మల ఐక్యత, అర్ధనారీశ్వర తత్త్వము.

740. వృద్ధః : పార్వతీ పరమేశ్వరులు జగత్తులకు పితరులు . పరమేశ్వరుడు జ్ఞానధర్మవృద్ధుడు. దక్షిణామూర్తియై ఋషులకు జ్ఞాన ధర్మాదివిద్యల బోధించెను.

741. అతివృద్ధః : వృద్ధులకెల్ల వృద్ధుడు.
''నమో వృద్ధాయచ సం వృధ్వనేచ'' రుద్రం : వృద్ధాయచః వయో వృద్ధుడు. సంవృధ్వనేచః అతి వృద్ధుడు, ఎల్లప్పుడును స్తోత్రముచే వృద్ధి బొందుచున్న వానికిని, లేక భక్తులకు చక్కగా వృద్ధి బొందించు వానికిని నమస్కారము.

742. గుణాధికః : సద్గుణ వరిష్ఠుడు.

## 90. నిత్యమాత్మ సహాయశ్చ దేవాసురపతిః పతిః ।
## యుక్తశ్చ యుక్తబాహుశ్చ దేవో దివి సుపర్వణః ॥

743. నిత్య ఆత్మ సహాయః : ఎల్లప్పుడు జీవులకుపకారిగా నుండువాడు.

744. దేవాసురపతిః : దేవదానవులకధిపతి.

745. పతిః : సమస్తమునకధిపతిః : ఈశానః సర్వ విద్యానాం ఈశ్వరః సర్వ భూతానాం బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధి పతిర్బ్రహ్మా అస్తు సదాశివోం ఎల్లరకు రక్షకుడైనవాడు, వేదములకు, బ్రహ్మకు అధిపతి. అట్టి సదాశివునకు నమస్కారము.

746. యుక్తః . అన్నింటికి ఐకమత్యము చేకూర్చువాడు. (2) యుద్ధమునకు సిద్ధముగా యుండువాడు

747. యుక్తబాహుః : సహస్రాణి సహస్రధా బాహవోస్తవ హేతయః: సమర్థవంతములగు వేలకొలది ఆయుధములు హస్తములందుగల రుద్రుడు మమ్ము రక్షించుగాక శివుడు ప్రయోగోపసంహారములందు ప్రసిద్ధుడు స్వామీ! ఆ నీ ఆయుధములను మా శత్రువులపై ప్రయోగింపుము

748. దివిసుపర్వణోదేవః . స్వర్గాధిపతియగు ఇంద్రునకును దైవమైనవాడు. - ''స్వర్గే విచిత్ర సురపాదప మంజరీభి । ర్మందాకినీ కనక పంకజయోజితాభిః । ఇంద్రాప్సరోరభిరమరైరిసురై రుపేతః । పూజాం విధాయ భవతః ప్రణతో మహేశ (మ్హ్లణస్తవము 21). ఓ మహేశ్వరా! నిన్ను భక్తితో విద్యుక్తముగా పూజించి శరణాగతుడైన మహానుభావుని, స్వర్గమునందు చిత్ర విచిత్రములైన కల్పతరుపుష్పములతోను, ఆకాశ గంగలో పూయు బంగారు తామర పూలను చెండ్లుగా గట్టి చేతబట్టుకొని మహానంద మొలుకగ ఇంద్రుడును అప్సర స్త్రీలును దేవదానవులును, ఎదుర్కొని తమ పంక్తిలో ప్రముఖునిగా సన్మానించుచున్నారు కదా!

విశే : శివభక్తునకే అంతటి సన్మానము జరుగగా, శివునికెంతటి ఘనత కలదో గమనించదగినది. శివభక్తుడు ఇంద్రాదులకంటె గొప్పవాడు. ఇక శివుని విషయము వేరుగా చెప్పపనిలేదు. ''బ్రహ్మణః సృష్టికర్తృత్వం విష్ణోర్దానవ మర్దనం. ఇంద్రస్య స్వర్గరాజ్యంచ శివపూజావిధేః ఫలమ్'' (శైవాగమము)

## 91. ఆషాఢశ్చ సుషాఢశ్చ ధ్రువోఽథ హరిణోహరః ।
## వపురావర్త మానేభ్యో వసుశ్రేష్ఠో మహాపథః ॥

749. ఆషాఢః : భక్తులకు ఓరిమి కలుగు చేయువాడు. సర్వసమర్థుడు.

750 సుషాఢః ఉత్తమమైన సహనము కలవాడు
''గంగాతరంగ జలధౌత జటాకలాప । కామాంగ దగ్ధసిత భస్మవిభూషితాంగ
చంద్రార్ధహార ఫణిరాజ విరాజితాంగ దేవాధిదేవ తవ పాదయుగం నమామి''
(మల్హణస్తవం - 38) ఈ రూపము స్వామియొక్క సహనమును తెలుపును

751. ధ్రువః అచంచలుడు. అజం శాశ్వతం కారణం కారణానాం । శివంకేవలం భాసకం భాసకానామ్। తురీయం తమః పార మాద్యంత హీనం ప్రపద్యే పరం పావనంద్వైతహీనమ్ । శంకర భగవత్పాదుల వేదసార శివస్తవః (శి.స నా 26, 624, వి స నా 387)

752 హరిణః - గోక్షీరమువలె తెల్లని వర్ణముకలవాడు పరిశుద్ధుడు (శి.స 991)
తుషారాద్రి సంకాశగౌరం గభీరం । మనోభూతకోటి ప్రభాసీ శరీరం
స్ఫురన్మౌళి కల్లోలినీ చారుగంగా । లసద్భాల బాలేందు కంఠే భుజంగాః

753 హరః శూలమును ధరించినవాడు (2) దుఃఖముపోగొట్టువాడు (1)
భవలోక నారక హారకహే । భవతారక పాతకదారకహే । హర శంకర కింకర కర్మహరయం । జనతారణ తారయ తాపితకమ్ ॥ (శి స 18, 106)

754. సపునరావర్తమానేభ్యః : సంసారము నందనేక పర్యాయములు భ్రమింపజేయు శరీరములనిచ్చువాడు ''స్థిత్వాకాలం చిరతరమపి బ్రహ్మశక్రాది లోకే, కర్మచ్ఛేదాత్ పునరపి తతః స్యాదవశ్యం నిపాతః ఏకం నిత్యం పదముపగతంక్లేశ కర్మోర్మి పాకం । శైవం జ్యోతి ర్యదిహ సులభం జ్ఞాన యోగేన పుంసాం ॥'' (హలాయుధ స్తవము 58) ఏ పుణ్యముచేతనో సత్యలోకము స్వర్గలోకము మున్నగువానిలో నివసించి దీర్ఘకాలము సుఖములననుభవించినను ఆ పుణ్యము క్షీణించిన తర్వాత మరల మర్త్య లోకమున జనన మరణ బాధ లనుభవించవలసినదే కానీ జ్ఞానయోగము చేత శివజ్ఞానమును పొందగలరు ఈ శివం పరంజ్యోతి - అద్వితీయం, నిత్యము - పరంధామము -

755. వసుశ్రేష్ఠః - ఆపోధ్రువశ్చ సోమశ్చ ధరశ్చైవానిలో౽నలః ప్రత్యూషశ్చ ప్రభావశ్చ వసవోష్టౌ ప్రకీర్తితాః - ఈ ఎనమండుగురు వసువులకు శుభము చేయుట పని అట్టివారిలో శ్రేష్ఠుడు అగ్ని ఈ అగ్ని శివస్వరూపుడు
(2) వసు - ఐశ్వర్యము - శివునికన్న మించిన మరొక ఐశ్వర్యము లేదు
''పశుపతిం, ద్యుపతిం, ధరణీపతిం, భుజగలోకపతించ సతీపతిమ్ ।
ప్రణత భక్త జనార్తి హరం పరం, భజతరే గిరిజాపతిమ్''
(3) అన్ని పదార్థములకు ఆత్మగా నున్నవాడు సకల జీవములకు జీవమైనవాడు

756. మహాపథః శిష్టాచార రూపః ఉత్తమమైన మార్గమును చూపువాడు
త్రయీ సాంఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితిచ । రుచీనాం వైచిత్ర్యాత్
ఋజుకుటిల నానాపథ జుషాం నృణామేకో గమ్యస్త్వమసి పయసా మర్ణవ ఇవ''
(శివమహిమ్నస్తవం -7) వైదిక కర్మకాండలు, సాంఖ్యమతము, యోగము, పాశుపతం, వైష్ణవం అని ఇట్లు వేర్వేరు ప్రస్థానములున్నవి ఇందు కొన్ని పెడమార్గములు కొన్ని సరళమార్గములు. ఇవన్నీ కలిసిన ఒకే మార్గము నీది నదులన్నియు ఎన్ని వంకరలు తిరిగినా సముద్రంలో చేరునట్లు నీది మహాపథము, మహాపదము (గమ్యస్థానము)

**92. శిరోహారీ విమర్శశ్చ సర్వలక్షణ లక్షితః ।**
**అక్షశ్చ రథయోగీచ సర్వయోగీ మహాబలః ॥**

757. శిరోహారీ విమర్శః : క్రోధముతో బ్రహ్మదేవుని ఐదవ శిరస్సును కొనగోటితో త్రుంచివేసిన వివేకవంతుడు.

758 సర్వలక్షణ లక్షితః : అన్ని శుభలక్షణములు కలవాడు ''కళాతీత కళ్యాణ కల్పాంతకారీ, సదాసజ్జనానంద దాతాపురారిః । చిదానంద సందోహ మోహాపకారీ ప్రసీద ప్రసీద ప్రభో మన్మధారీ (తులసీదాస్) (వి స. 360)

759. అక్షాయ రథ యోగినః రథ చక్రముల కడచీలవలె చాల ముఖ్యమైనవాడు.

760. సర్వయోగీ : (1) ఇహపరసౌఖ్యములనన్నింటిని భక్తులను ప్రసాదించువాడు. (2) అన్నింటి యందు యుగళ భూతుడై యుండెడివాడు. (3) అన్ని యోగములను పరిపూర్ణముగా నెరిగినవాడు.

761. మహాబలః · మహాబలము కలవాడు. (వి.స. 173) (శి స. 86)

**93. సమామ్నాయో౽ సమామ్నాయ స్తీర్థదేవో మహారథః ।**
**నిర్జీవో జీవనో మంత్రః శుభాక్షో బహుకర్కశః ॥**

762. సమామ్నాయః : వేదసముడు ''వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో'' (భ.గీ 15-15) సమస్తవేదములు తెలుసుకొనినవాడు. వేదములచే తెలియబడు వాడు, వేదములే శివుడు

763. అసమామ్నాయః ఆగమములు, శాస్త్ర పురాణములు, అన్ని వర్ణముల వారు ఆచరించు అవైదిక, అనాచార కర్మకాండలుకూడా శివుడే.

''ఏ వేదంబు బఠించెలూత; భుజంగంబే శాస్త్రములు చదివెదా
నేవిద్యాభ్యాసనంబొనరించెగరి చెంచే మంత్ర మూహించె బో
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా! కావునీ పాద సం
సేవాసక్తియె కాక జంతు తతికిన్ శ్రీకాళహస్తీశ్వరా ॥ (ధూర్జటి)
కన్నప్ప నందనారువంటి పామరులు తమ భక్తిచే శివసాయుజ్యము పొందిరి.

764. తీర్థదేవః : తీర్థ స్వరూపుడు : తరింప జేయునవి తీర్థములు : మహా భక్తులు ఆశ్రమముల నిర్మించుకొని అచట తీర్థముల నిర్మించి తపస్సు చేసి ముక్తి నొందిరి. కపిల తీర్థము, పక్షి తీర్థము, భరద్వాజ తీర్థము, రామతీర్థము మున్నగునవి ఆ తీర్థములకధిష్ఠాన దేవత.

తీర్థాలు బాహ్యాలనీ, అభ్యంతరాలనీ రెండు విధములు. కాశీ, శ్రీకాళహస్తి, శ్రీ శైలం వంటివి బాహ్యతీర్థాలు. శిరస్సున ఉండు శ్రీశైలతీర్థం మల్లికార్జున స్వామికి; 1. నాసలూ ముక్కు కలిసేచోటు అవిముక్తము (కాశీ) అనియు, అది విశ్వేశ్వరునికి స్థానము; 2. ఫాలభాగంలో మంచువంటిదీ నిర్మలమైనదీ కేదార తీర్థం, 3.కుచాగ్రాలలో కురుజాంగల తీర్థం వుంది. 4. కనుబొమల నడిమి భాగాన ఆనందవన తీర్థం వుంది 5 అంతరంగంలో వుండేది ప్రయాగ. 6

765 మహారథః . త్రిపుర సంహారమునకు శివుడుపయోగించిన రథము :
''రథః క్షోణీ యాతా శత ధృతి రగేంద్రో ధనురథో
రథాంగే చంద్రార్కౌ రథచరణపాణిః శర ఇతి
దిధక్షోస్తే కోఽయం త్రిపుర తృణమాడంబరవిధి
ర్విధేయైః క్రీడన్త్యోనఖలు పరతంత్రాః ప్రభుధియః ॥ (శివమహిమ 18)
భూమిని రథముగను, బ్రహ్మసారథిగను, మేరువును విల్లుగాను, సూర్య చంద్రులు చక్రములుగాను, హరిని బాణము గాను, విరచించియుద్ధ యాత్ర సాగించితివి. ఈ ఆడంబరమంతయు ఆ సేవకుల వినోదార్థమేకానీ, ఆ ముగ్గురు రాక్షసుల సంహారము ఆయనకొక లెక్కలోనిదికాదు విశ్వమందలి గొప్ప సాధనములన్నియు ఆ రథమున చేరినవి.

766. నిర్జీవః : సర్వమూ రుద్రస్వరూపము అనినప్పుడు జీవము లేని జడ పదార్థములు శివములుకావా?

767. జీవనః సకల ప్రాణులకు జీవమైనవాడు : చేతన రూపుడు. ప్రాణః కాలస్తథా మృత్యురమృతంభూతమప్యహం : శి గీ 6-25 వి.స. 930

768. మంత్రః : శివపంచాక్షరి, అష్టాక్షరి, షోడశి మృత సంజీవని వంటి ఏడుకోట్ల మంత్రములు శివుడే. మననముచే రక్షించునది. (శి.స.నా.79; వి స నా 280)

769. శుభాక్షః . శాంత శుభములగు చూపు దృష్టికలవాడు

''తందేవ నరక హుతవహ బహుళ జ్వాలా కలాప సంతాపం త్వద్దృష్టిర్ వృష్టిరివ ప్రశమయతి శివ ప్రసీద విభో - (మలయరాజస్తవము - 18) శివా! ప్రభూ! అత్యధికమైన అగ్నిజ్వాలలను వర్షము చల్లార్చి వేయునట్లు నీ కృపాకటాక్షము మహానరక బాధనుండి శమింప చేయుచున్నది

ప్రణత జనదక్షిణేన క్షణమేకం కాలకామ వామేన । త్రినయన సమగ్ర దర్శిన్ దాసజనం చక్షుషాపశ్య · ఓ సమ్యగ్దర్శీ! ముక్కంటీ! శరణాగతులైన భక్తుల సంరక్షించునదియు, యముణ్ణీ, మన్మదునీ, నిగ్రహించినట్టి నేత్రముతో నన్నొక నిముసమాత్రము అవలోకింపుము

''తస్యాగారే గిరిశరమతే ధేనువత్ కామధేనుః ।

క్రీడావాటే విటపసదృశః కల్పితే కల్పవృక్షః । లాక్షార క్షామణిరివ ।

కరేతస్య చింతామణిస్యాద్ । యుస్మిన్ సిద్ధ సకృదపి కృపాదృష్టి పాత ప్రసాదః''॥ (హలాయుధస్తవము 13) కైలాసవాసీ! నీ కరుణాదృష్టి యొక్క పరి భక్తునియందు ప్రసరింపవలయునే, కానీ వానికి లభింపనిదేమున్నది? వానియింట కామధేనువుఆవు వలెను, వాని ఉద్యానవనంలో కల్పవృక్షమును, వానిచేతికి లక్కపూసతో కూడిన కంకణమువలె చింతామణియు యుండును

770. బహుకర్కశః . సంహారకుడగుటవలన మిగుల కఠినుడు ''ఛిత్వా బ్రహ్మ శిరోయది, ప్రధయతి ప్రేతేషు సఖ్యయది । క్లీబః క్రీడతి మాతృభిర్యది రతిధత్తే శ్మశానేయది । సృష్ట్వా సంహరతి ప్రజా యది తాదాప్యాదాయ భక్త్యామనహస్తం సేవేకరవాణి కింత్రిజగతీ శూన్యాస ఏవేశ్వరః'' ॥

శివుడు కర్కశుడు. ''బ్రహ్మ శిరస్సును పెరుకుట, ప్రేతములతో సహవాసము, పురుషత్వము లేక సప్తమాతృకలతో క్రీడించుట, కాటి మీద ప్రేమ, సృష్టించిన జనులను సంహరించుట - ఇటువంటి పనులు చేయువానినే కొలుచుచున్నావే - మనసా! ఏమిచేయుదుము? ఈ ముల్లోకములు శూన్యమే వాడొక్కడే ఈశ్వరుడు

## 94. రత్న ప్రభూతో రత్నాంగో మహార్ణవ నిపానవిత్ । మూలం విశాలోహ్యమృతో వ్యక్తావ్యక్తస్తపోనిధిః ॥

771. రత్న ప్రభూతః : రత్నములను ఉత్పత్తి చేయువాడు. సృష్టిలో శ్రేష్ఠమైన వాటిని రత్నములందురుము. అట్టి ప్రకాశవంతమైన పదార్థములందుండువాడు

772. రత్నాంగః : రత్నములవంటి ప్రకాశవంతమైన దృఢమైన అవయవములు కలవాడు. ''కోటి సూర్యప్రతీకాశం కోటి శీతాంశు శీతలం । వ్యాఘ్రచర్మాంబర ధరం నాగయజ్ఞోపవీతినం । సర్వాభరణ సంయుక్తం విద్యుత్పింగ జటాధరం । నాగయజ్ఞోపవీతినం । నీలకంఠం వ్యాఘ్రచర్మోత్తరీయం చంద్రశేఖరం । నానావిధాయుధోద్భాసి దశబాహుం త్రిలోచనం । యువానం పురుష శ్రేష్ఠం సచ్చిదానంద విగ్రహమ్ (శి గీ. 4-28-31)

773. మహార్ణవ నిపానవిత్ . (నిపానములు . పశువులు నీరు త్రాగుటకు కట్టిన కుండములు) సముద్రములనెడి ఆ నిపానములను ఎండించువాడు. అగస్త్యుడు శివస్వరూపుడు; ఆయన సముద్రములను ఔపాసనము పట్టినవాడు.

774. మూలః ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్ (భ. గీ. 15·1) అశ్వత్థ వృక్షమువంటి సంసారమునకు మూలము (వేరు) వంటివాడు.

775. విశాలః : అతడు కదలకుండియే అన్నిలోకములకు వ్యాపింపగలడు. విశ్వమెంత విశాలమైనదో తానుకూడా అంతమాత్రమేకాక, ఆ పైన మూడింతలు ఉండువాడు. ''త్రిపాదస్యామృతందివి'' - ''వటబీజేతి సూక్ష్మేపి మహాన్వట తరుర్యథా సర్వదాస్తేన్యథావృక్షః కుతఆయాతితద్వద''. శి గీ. 7.5. వటబీజము - వటవృక్షములనుదాహరణముగా చెప్పుచున్నారు

776. అమృతః : మృతిలేనివాడు. అమృతము వంటివాడు. హాలాహలము త్రాగినను శాశ్వతుడు. నాశరహితుడు. (వి.స. 120)

777 వ్యక్తావ్యక్తః : వ్యక్తము మహత్తత్వము - మహత్తత్వమునుండి పుట్టినది అహంకారము : ''భూత భావ వికారేణ ద్వితీయేన సదుచ్యతే వ్యక్తిం తేన విహీన త్వాత్ అవ్యక్త మసదత్యపీ - (లింగ పురాణం) సత్ భావ వికారముచే రెండవదిగానున్నదే వ్యక్తము. ఆ స్థితివికారము లేనిదే అవ్యక్తము. అసత్ అగుచున్నది. వ్యక్తమనగా అక్షరము, నశింపనిది. అవ్యక్తము : క్షరము; నశించునది. లింగములలో మూడు రకములున్నవి. (1) వ్యక్త (2) వ్యక్తావ్యక్త (3) స్వయంభుః.

778. తపోనిధిః తపస్సంపన్నుడు. ఆయన తపస్సు వల్లనే విశ్వమేర్పడినది. ''కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః ఫలాభ్యాం'' (శి.ల. 11) పార్వతీ పరమేశ్వరులిర్వురు తపస్సులచే ఒకరినొకరు పొందిరి.

**95. ఆరోహణో౽ధిరోహశ్చ శీలధారీ మహాయశాః ।
సేనాకల్పో మహాకల్పో యోగో యుగకరోహరిః ॥**

779. ఆరోహణః : భక్తులకు ఉత్తరోత్తరాభివృద్ధి కలిగించువాడు
చిత్రైర్మాలారచిత కుసుమై ర్ధూర్జటే పూజయిత్వా
యస్తౌతిత్వాం జయ జయ మహాదేవ దేవేతి వాచా
సో౽ప్యారోహ॒ హరతవ పురం మౌళిబద్ధాంజలీనాం
శక్రాదీనాం స్తుతి విషయతాం త్వత్ప్రసాదాత్ప్రయాతి
(హలాయుధస్తవం 28)
ఓ ధూర్జటీ! హరా! ఏ భక్తుడు రంగురంగుల పూల దండలతో నిన్ను అర్చించి ''జయ! జయ! మహాదేవ దేవ!'' అని కీర్తించుచున్నాడో వాడు ఈ లోకము నధిరోహించి నీ కృపవలన, మ్రొక్కులిడుచువచ్చు ఇంద్రాదుల యొక్క స్తోత్రములనంది ప్రశంసింపబడుచున్నాడు

780 అధిరోహః . పరమపదమందుండువాడు.

781. శీలధారిణః : సద్గుణసంపన్నుడు అందరినీ సమముగా చూచువాడు

782. మహాయశః గొప్పకీర్తికలవాడు.
యత్తేతత్త్వం నిరుపధి పరం వాఙ్మనః పారభూతం । బ్రహ్మాదీనామపి హర గిరస్తత్ర భగ్నాః ప్రవేష్టుం । అర్వాచీనం యదపర మిదం పార్వతీ వల్లభం తే రూపం భక్త్యావరద తదహం వాగ్భిరభ్యర్చ యామి (హలాయుధస్తవం 7)
భక్తవత్సలా! నీ తత్త్వము (యశము) వాఙ్మనసములకతీతమైనది. పరాత్పరమైనది. దీనిని వర్ణించుటలో బ్రహ్మవాక్కులు కుంఠితమై పోయినవి. (నేనెంతటివాడను?) నీ అప్రమేయమైన రూపమును చింతింపజాలక భక్తులందరూ కీర్తించే పార్వతీపతి రూపమునే ధ్యానించి అర్చించుచున్నాము. (శి.స నా. 41,461)

783. సేనాకల్పః . సేనలకు అలంకారమగు పరాక్రమములను కలిగించువారు.

784. మహాకల్పః అనేక దివ్యాభరణములు ధరించినవాడు. (2) ఇష్టదేవ తానుగ్రహము పొందుటకై చేయు వ్రత విధానము కల్పము. (వినాయక వ్రత కల్పము. వరలక్ష్మీ వ్రత కల్పము ) శివునికి చేయుపూజ శ్రేష్ఠమైన కల్పము. (3) 100 బ్రహ్మ వర్షములు ఒక మహాకల్పము.

785. యోగః : చిత్తవృత్తులను నిరోధించుటయోగము. సమత్వం యోగ ఉచ్యతే.

786. యుగకరః . యుగములను చేయువాడు. కృత, త్రేత, ద్వాపర, కలియుగములు.

787 హరిః విష్ణురూపుడు. ''శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే'' సర్వపాపములను హరించువాడు. (శి.స నా 208, 377, 712) (వి.స 651)

## 96. యుగరూపో మహారూపో మహానాగహనో వధః ।
## న్యాయ నిర్వపణః పాదః పండితో హ్యచలోపమః ॥

788. యుగరూపః కాలస్వరూపుడు. ఆయా యుగాలలోని ధర్మ అధర్మముల రూపము గలవాడు.

789. మహారూపః : శ్రీ రామచంద్రునికి శంకరుడు తన విశ్వరూపాన్ని చూపెను. అప్పుడు రాముడు చేసిన స్తోత్రము ''ప్రదదా తస్మై దివ్యంచక్షుర్మహేశ్వరః । అథాదర్శయదేతస్మై వక్త్రం పాతాళ సన్నిభం : విద్యుత్కోటి ప్రభం దివ్య మతి భీమం భయావహం । తద్దృష్ట్వైవ భయాద్రామో జానుభ్యామవనీంగతః ప్రణమ్య దండవ ద్భూమౌతుష్టావచ పునః పునః ॥ అథోద్ధాయ మహావీరః యావదేవ ప్రపశ్యతి । వక్త్రం పురభిదస్తత్ర హంత బ్రహ్మాండ కోటయాః చణకా ఇవలక్ష్యంతే జ్వాలా జాలా సమాకులాః ॥ మేరు మందర వింధ్యాది గిరయ స్సప్తసాగరాః ॥ దృశ్యంతే చంద్రసూర్యాద్యాః పంచభూతానితే సురాః అరణ్యాని మహానాగా భువనాని చతుర్దశ । ప్రతి బ్రహ్మాండ మేవంతు దృష్ట్వా దశరథాత్మజః ॥ శ్రీరాముడు ఆ దేవదేవుని ముఖమును చూచి అందు అనేక బ్రహ్మాండకోటులు ధగద్ధగాయమానములుగా అణువులవలె ఉన్నవాటిని చూచి, వానియందు మేరుమందర వింధ్యాది పర్వతాలను, సప్త సముద్రాలను, పదునాల్గులోకాలను, చంద్రసూర్యులను, అనేక బ్రహ్మాండాలను చూచినాడు. అటువంటి మహారూపం గలవాడు (శివగీత 7, 22) (శి.స.నా. 38)

790. మహానాగహనః : గొప్ప గజాసురుని సంహరించినవాడు లోకభయంకరుడైన గజాసురుని దౌర్జన్యాలకు కాశీవాసులు గడగడలాడి పోయారు. ఆ రాక్షసుణ్ణి చూచి విశ్వేశ్వరుడుగ్రుడైనాడు. శూలం విసరి వాణ్ణి వధించాడు. మరణమాసన్నంకాగా వాడు భక్తితో స్వామిని కీర్తించాడు. వాణ్ణి ఒక వరం కోరుకొమ్మన్నాడు అందుకు వాడు ''ప్రభూ! నయనానందమైన నీ రూపాన్ని చూచాను ఈ శూలంతో నా శరీర చర్మాన్ని ఒలిపించి, రక్తం ఒలుకుతున్న

దానిని ఒలుకుతున్నట్లే నీవు కట్టుకోవాలి అది ఎన్నటికీ కంపుకొట్టరాదు. మొద్దుపారకూడదు చినగ కూడదు నీవు ఏనాడూ దాన్ని విసర్జించరాదు''

791 వధః . సర్వసంహారకుడు

792. న్యాయ నిర్వపణః ధర్మానుసారముగ తీర్పులిచ్చువాడు. (కోర్టులు నిచ్చువాడు)

793. పాదః : పొందదగు గమ్యుడు : పద్యత ఇతిగమ్యః - ''త్వత్తోజగద్భవతి దేవ! భవ! స్మరారే! త్వయ్యేవతిష్ఠతి జగన్మృడ' విశ్వనాథ, త్వయ్యేవగచ్ఛతి లయం జగదేత దీశ! లింగాత్మకం హర చరాచర విశ్వరూపిన్ - (వేదసార శివస్తవః)

794. పండితః : పరోక్ష జ్ఞానాని : అన్ని విషయములను చక్కగా నెరిగినవాడు. పండాః : ఆత్మ విషయాబుద్ధిః యేషాతేహి పండితాః . ఆత్మ విషయమైన బుద్ధికి పండా అనిపేరు. ''విద్యావినయ సంపన్నే బ్రాహ్మణేగవి హస్తినిశునిచైవ శ్వపాకేచ పండితా సమదర్శినః (భ గీ 5-18) విద్యావినయాలు కలిగిన బ్రాహ్మణుడిని, గోవును, ఏనుగును, కుక్కను, కుక్కను తినువానిని సమముగా చూచువాడు (అంతటా పరమాత్మను దర్శించువాడు) పండితుడు.

795. అచలోపమః : అతని స్వరూపము, శక్తి, గుణములన్నియు పర్వతమువలె అచలమైనవి. స్థితప్రజ్ఞుడు.

## 97. బహుమాలో మహామాల శ్శశీహర సులోచనః ।
## విస్తారో లవణః కూపస్త్రియుగ స్సఫలోదయః ॥

796. బహుమాలః : అనేక లీలలు చేయుచు శోభించువాడు. అన్ని రూపములను ధరించువాడు.

797. మహామాలః : సుగుణములన్నియు ఆయనకు మాలలగుచున్నవి ఆయనకు విధి నిషేధములులేవు. అనాచారములు ఆయనకు ఆచారములగుచున్నవి. అస్థిమాలలు ఆయనకు దివ్యపుష్పహారములు. మహాసర్పములు కూడా పూలదండలు.

798. శశినే హరసులోచనః : చంద్రుని కాంతిని హరించు చల్లని కన్నులు కలవాడు. ఆయన కనులనుంచి అమృతమే వర్షిస్తుంది. భక్తుల హృదయములలో సుఖశాంతులను చేకూర్చును.

799. విస్తారో, లవణః కూపః విస్తారమైన లవణ సముద్ర శివునకు భావిగా నున్నది.

800. త్రియుగః కృత, త్రేత, ద్వాపర యుగ రూపుడు
(1) జ్ఞానము, శక్తి (2) బలం, ఐశ్వర్యము (3) వీర్యం, తేజస్సు ఈ మూడు జంటలు గలవాడు

801. సఫలోదయః · శివభక్తి కలిగిన ఎడల ఆ భక్తుని కోరికలన్నియు సఫలమగును. "యత్తే భక్త్యా హరచరణ యోరర్పితం పుష్పమేకం సద్యస్సూతే ఫలమభిమతం కోటిశః కామరూపం" (హలాయుధస్తవము : 23) మహేశ్వరా! భక్తితో నీపాద సన్నిధి నర్పించిన పుష్పమొక్కటియే ఇష్టము ననుసరించి కోట్లకొలదిగ నపుడే ఫలించును. ఇది మహాద్భుతం ఏతచ్చిత్రం క్వచిదపి మయానైవ దృష్టం . ఎక్కడా నా చేత చూడబడలేదు.

## 98. త్రిలోచనో, విషణ్ణాంగో మణివిద్ధో జటాధరః ।
## బిందుర్విసర్గస్సుముఖః శరః సర్వాయుధః సహః ॥

802. త్రిలోచనః · సూర్యచంద్రాగ్ని నేత్రుడు (2) శాస్త్రము, ఆచార్యుడు, ధ్యానము అనుమూడు ధర్మసాధనములు ఆయన కన్నులు

803 విషణ్ణాంగః · ఇతడు అష్టమూర్తి · "భూరంభాస్యనలోఽనిలోంబర మహర్నాథో హిమాంశుః పుమాన్ ' ఇత్యాభాతిచరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్టకం, నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభో । తస్మై శ్రీ గురుమూర్తయేనమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే" పృధివ్యాది పంచ భూతములు, సూర్యుడు, చంద్రుడు, జీవుడు. అనునవి అష్టమూర్తులు ఇవి లేనిచో విశ్వమేలేదు లోకోపకారార్థము అష్టమూర్తి అయినాడు

804. మణి విద్ధః : రత్నకుండలములను ధరించువాడు

805. జటాధరః . జడలను ధరించినవాడు.

806. బిందుః . బిందురూపుడు "పరశివ రవికర నికరే ప్రతిఫలతి విమర్శదర్పణే విశదే ప్రతిరుచిరుచిరే కుడ్యే చిత్తమయే వివశతే మహాబిందుః (కామకలా విలాసం) బిందువు అనగా పూర్ణం. అహమేవపూర్ణః.

బిందు స్ఫుటేన మాత్రేణ వర్ణానాంచ సముద్భవః । తస్మాదాకాశ ముఖ్యాని భూతాని సమజాయత ॥ బిందుః శ్రీ చక్రరాజస్య పర బ్రహ్మాత్మకస్థితివిధి ॥ బిందుస్ఫుట మాత్రమున అకారాది అక్షరములుత్పన్నమగుచున్నవి. అందుండి ఆకాశాది మహాభూతములుద్భవించుచున్నవి. శ్రీ చక్ర మందలి బిందువు పరమాత్మకమైనది (శివగౌరీ సంవాదము)

807 విసర్గః · శివుడు బిందువు. శివశక్తులు కలిసినపుడు విసర్గ అయినది అర్ధనారీశ్వరతత్త్వము లేక బిందువు ఐక్య స్వరూపము విసర్గము విమర్శ స్వరూపము

808. సుముఖః : వ్యక్తమైన వర్ణములు కలవాడు. (వి స. : 456)
ముక్తాహారం మునిభిరనిశం మౌనిభిర్ధ్యాయమానం । ముక్తాగౌరం శిరసి జటిలే జాహ్నవీ ముద్వహంతం । నానాకారం నవశశి కలాశేఖరం నాగహారం । నారీమిశ్రం ధృతనర శిరోమాల మీశం నమామి. (అనామయస్తవము. 27)
నిరాహారులైన మునులచేతను; మౌనిభిః : మౌనముగానుండువారిచే ధ్యానింప బడువాడును, ముత్యములవలె తెల్లనైనవాడును, జడలుగల తలయందు గంగను పైకి తాల్చినవాడును, వివిధరూపుడును, సర్పభూషణుడును, ఉమాసహాయుడును, కపాలమాలలు ధరించినవాడును అగు ఈశుని మ్రొక్కెదను.
సుందరమైన ముఖము కలవాడు - సుందరేశ్వరుడు.

809. శరః : బాణము : శరోహ్యాత్మా. (ముం . ఉ. 2:6) శరమే జీవుడు.

810. సర్వాయుధః · శూలాద్యనేక ఆయుధములు గలవాడు.

811. సహః : మిక్కిలి ఓర్పుగలవాడు. పరమశాంతమూర్తి (శి.స.నా.213)

## 99. నివేదనః సుఖాజాతః సుగన్ధారో మహాధనుః ।
## గన్ధపాలీచ భగవానుత్థాన స్సర్వకర్మణాం ॥

812. నివేదనః : అన్ని విషయములు తెలిసినవాడు. మనోవృత్తులనన్నింటినీ అణచుకొనినవాడు. ''చారూద్రేసే రజసి జగతాం జన్మసత్త్వే ప్రకృష్టే యాత్రాం భూయస్తమసి బహుళే బిభ్రతీం సంహృతించ బ్రహ్మాద్యేతత్ ప్రకృతి గహనం స్తంబ పర్యంత మాసీత్ క్రీడావస్తు త్రినయన మనోవృత్తి మాత్రానుగం తే (అనామయస్తవము 6)
ఓ ముక్కంటీ! రజో గుణాధిక్యమువలన సృష్టియు, సత్త్వగుణంవల్ల స్థితియు, తమోగుణోల్బణమున సంహారమును నీ అధీనములై యున్నవి. ప్రకృతిలో బ్రహ్మ మొదలు గడ్డిపోచవరకు అంతయు నీ ఆట వస్తువులే. ఇదంతయు నీ మనోసంకల్పమే.

813. సుఖాజాతః : సుఖరూపమున ఆవిర్భవించినవాడు. సత్‌చిదానందరూపుడు. ''ప్రశాంతమనసంహ్యేనం యోగినం సుఖముత్తమం ఉపైతి శాంత రజసం బ్రహ్మ భూతమకల్మషం'':- (భ.గీ.6-27) మనో నిగ్రహమువలన ప్రశాంత

చిత్తుడైన యోగి ఉత్తమ సుఖమును బడయును నిష్కల్మషమైన ఆనందమునమభవించును అదే శివము శాంతము, అద్వైతము

814. సుగంధారః . గాంధార దేశమమందలి చక్కని గుఱ్ఱము వంటివాడు హయగ్రీవుడు

815. మహాధనుః · మహాధనుస్సు : అపారమహిమ కలది. ''ప్రణవో ధనుః'' ముండ.ఉప.2-24: ''త్రయీంత్రిస్రోవృత్తీ స్త్రి భువన మథోత్రీనపి సురా । నకారాద్యైర్వర్ణైస్త్రిభి రభిదధత్తీర్ణ వికృతి । తురీయంతే ధామ ధ్వనిభిరవరుంధాన మణుభిః । సమస్తం వ్యస్తం త్వాం శరణదగృణాత్యోమితి పదం .- (మహిమ్నస్తవం . 28):-

ఓ రక్షకా! వేదములకెల్ల మూలభూతమైన ఓంకార ప్రణవము నీ చరాచరాత్మకమైన స్వరూపమును ఇట్లు పొగడుచున్నవి ఈ ఓంకారమునందు అ, ఉ. మ్ అను మూడక్షరములు కలవు ఇవి ఋగ్యజుస్సామములనెడి వేదములను, సత్వరజస్తమోగుణములను, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను, నాద, బిందు, కళలను అపక్షత్వ, వినాశ, పరిణామములనెడి మూడు వికారములను, వ్యస్త, అవ్యస్త, వ్యస్తావ్యస్తములనెడి రూపములకంటె అతీతమైన తురీయస్థితిని పొగడుచున్నవి నీవే సచ్చిదానంద ప్రకాశుడవు. నీ ధనుస్సు వేదమయము.

816. గంధపాలినే భగవాన్ : గంధాః లేశాః సూక్ష్మాః ప్రపంచ వాసనాః తాఃపాలయతీతి గంధపాలీ; సర్వప్రాణి ధీవాసనా మయ ఇత్యర్థః స ఏవ భగవాన్ ఈశ్వరః.

ప్రళయకాలమందు ప్రాణుల పాపపుణ్యావాసనలను బీజరూపమున కాపాడి, తిరిగి సృష్టి సమయమున వాటిని మొలకెత్తించువాడు.

817. సర్వకర్మణా ముత్థానః : సర్వకర్మలను సృష్టి సమయమున పునరుద్ధరించువాడు.

అన్ని కర్మలను ఆయనే చేయించువాడు. ఆయన సంకల్పము లేనిచో గడ్డిపోచకూడ కదలదు. చీమకూడ కదలదు.

## 100. మంథానో బహులోవాయుః సకలః సర్వలోచనః । తలస్తాలః కరస్థాలీ ఊర్ధ్వ సంహననో మహాన్ ॥

818 మంథానోబహులోవాయుః : ప్రళయకాలమందు వీచు వాయువు. 2. జీవుల సర్వనాడులందు సంచరించు ప్రాణవాయువు.

819. సకలః · పరిపూర్ణుడు ఈశావాస్యమిదం సర్వం (ఈశోపనిషత్-1) . ''భవిష్యామిచ లోకేఽస్మిన్ మత్తో నాన్యోఽస్తి కశ్చన, వ్యతిరిక్తం నమత్తోస్తి నాన్యత్కించిత్సురేశ్వరాః'' (శివగీత 6-11) నాకంటె మరొకడు లోకాలలో లేడు. నాకంటె అన్యమైనది ఏదీలేదు

820. సర్వలోచనః . అంతయు చూచువాడు అందరి హృదయాలలో సాక్షిగా యుంటూ అన్నింటినీ చూచువాడు. ''మయ్యేవ జగత్సర్వం జగత్స్థావర జంగమం'' (శివగీత 11-12)

821. తలస్తాలః : తాళములను అరచేతిలో యుంచుకొనినవాడు.

822. కరస్థాలీ · చేతులే అతని భోజనపాత్రలు : సర్వసంగ సన్న్యాసి. కరతల భిక్షతో తృప్తి పడువాడు

823. ఊర్ధ్వ సంహననః : శ్రేష్ఠమైన పటిష్ఠమైన శరీరము కలవాడు. వజ్రశరీరి. ''స్వచ్ఛమాకాశ లింగం తారాపుష్పైః శిరసి రచితా భ్యర్చనం చంద్రచూడ'' ఓ చంద్రశేఖరా! ఈ నిర్మలమైన ఆకాశమనెడి లింగంయొక్క తలయందు నక్షత్రములనెడి పూలచేత చేయబడిన పూజగా యున్నది.'' (హలాయుధ స్తవము : 38).

824 మహాన్ · మహాతత్త్వ స్వరూపి : అత్యున్నతమైనవాడు అందరూ సాధారణ దేవుళ్లే ఈయన మహాదేవుడు. కిరీటే నిశేశో లలాటేహుతాశో భుజే భోగిరాజో గళేకాళిమాచ । అహోదేవ మన్యం, మహాదేవ సామ్యం నజానే నజానే నజానే · (భుజంగ ప్రయాతం) (శి.స.నా.51,116)

బుద్ధేరాత్మా మహాన్ పరః ॥ కఠ.ఉ.

## 101. ఛత్రం సుచ్ఛత్రో విఖ్యాతో లోకః సర్వాశ్రయః క్రమః । ముండో విరూపో వికృతో దండీ కుండీ వికుర్వణః ॥

825. ఛత్రం : దారేషణ, పుత్రేషణ, ధనేషణ అను ఈషణత్రయము వలన గలుగు తాపమునుండి రక్షించు ఛత్రము వంటివాడు.

826. సుచ్ఛత్రః : వైరాగ్యమను ఉత్తమ ఛత్ర నీడయందుండువాడు. విరాగి.

827. విఖ్యాతోలోకః : లోకమందందరికీ ఎరుకైనవాడు.

''త్వం సర్వేషాం స్మృతిముపగత స్సర్వపూర్ణత్వ హేతుః'' నీవు అందరి స్మరణను పొందినవాడవై సకల పూర్ణమునకు కారణుడవుగా నెంచబడు చున్నావు. (హలాయుధస్తవము.36).

828. సర్వాశ్రయ క్రమః : అన్నింటియందు వ్యాపించి అన్నింటిని క్రమబద్ధముగా నడిపించువాడు. క్రమబద్ధతను ఋతమందురు
''ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్'' మొట్టమొదట ఆత్మ ఒకటియే యుండును.
''నాన్యత్కించనమిషత్'' ఇతరమైనదేదియు లేదు
''సఈక్షియలోకాన్ను సృజాఇతి'' లోకముల సృజించెదనని ఆ ఆత్మ ఆలోచించెను (ఐతరేయోపనిషత్తులో ఈసృష్టి విషయము: ఇంద్రియము లను, వాటి అధిదేవతలు వారివారికి నిర్ణయించబడిన విధులను విశదముగా చెప్పబడియున్నవి.)

829. ముణ్డః .ముండనము చేయబడినవాడు ''నమః కపర్దినేచ వ్యుప్త కేశాయచ'' ముణ్డః = శిరస్సు : దేహానికి శిరస్సెట్లో అట్లే దేవతలందరిలోను ప్రధానమైన వాడు (శి.స.నా.)

830. విరూపః · విరూపేభ్యో విశ్వరూపేభ్యః - రుద్రం
''గృహ్యాం తాం వసనేషు చర్మభుజగో హారేషు యానేషు గౌర్ధుత్తూరం కుసుమేషు నాత్ర రుదిమః కింత్వత్ర కంపామహే । అబ్ధౌ కౌస్తుభ కాలకూట కమలా కల్పద్రుమోచ్చైశ్శ్రవః । పీయూషాదిషు సత్సుతాత భవతాయః కాలకూట గ్రహః (బిల్హణస్తవము-15) స్వామీ! వస్త్రములలో చర్మమును, భూషణము లలో సర్పమును, వాహనములలో ఎద్దును, పుష్పములలో ఉమ్మెత్తను తీసుకొంటే తీసుకొన్నావు సరే సముద్రంలో కౌస్తుభం, కాలకూటం, లక్ష్మి, కల్పవృక్షం, ఉచ్చైశ్రవములుండగా, కాలకూటాన్ని ఆహారంగా తీసుకొన్నావంటేనే కంపించిపోతున్నాము
నగ్నంగా, చితాభస్మం పూసుకొని, బేసికండ్లతో, కోరలవంటి పండ్లు, కపాల మాలలు, సర్పభూషణములు, జడలు, కూడా కుక్కలు, అటువంటి అవతారం కలవాడు.

831. వికృతః . వివిధమైన పనులు చేయువాడు. ''యోగీ భోగ విషభుగమృత శ్శస్త్ర పాణిస్తపస్వీ । శాంతః క్రూర శ్శమిత విషయః శైల కన్యా సహాయః భిక్షావృత్తిస్త్రిభువనపతిః శుద్ధిమానస్థిమాలీ । శక్యోజ్ఞాతుం కథమివ శివత్వం విరుద్ధ స్వభావః (అనామయ స్తవము 30)
శివా! నీవు భోగములు కలవాడవనుకొందునా? (లోకసృష్టి మున్నగు క్రీడల గలవాడవు) అందుకు విరుద్ధముగా చిత్తవృత్తుల నిరోధించి, యోగివై యున్నావు. విషము తిన్ననూ, మరణరహితుడవు విషయముల జయించి (కాముని సంహరించి) పార్వతిని పెండ్లాడినావు. ఒకవైపు త్రిభువన పతివి,

మరోవైపు బిచ్చగాడివి. ఎముకల దండలను వేసుకొన్నావు పరమ పవిత్రుడవు ఇట్లు విరుద్ధ స్వభావముల గుణములతో కూడిన నిన్ను ఎట్లు తెలిసికొనసాధ్యము?

832. దండి : విష్ణు కంకాళమును దండముగా గలవాడు. విష్ణువు మత్స్యావతారమున సోమకాసురుని (శంఖాసురుడు తమోసురుడు) సంహరించి సముద్రమును ఉల్లోలకల్లోలముగావించు చుండినందున వానిని శివుడు సంహరించి వాని వెన్నెముకను దండముగా గరించెను. (పద్మ.సృ.1.ఉ.60,61)

833. కుండీ : కమండలువు దాల్చినవాడు. 2 తీర్థపాత్రగల బ్రహ్మచారి.

834 వికుర్వణః : కేవలము కర్మానుష్ఠానమువల్ల లభ్యపడడు. ''నకర్మణానప్రజయా ధనేన త్యాగేనైకేనామృతత్వ మానశుః'' కైవల్యోపనిషత్.
''శివభక్తి విహీనశ్చ సంసారాన్నైవ ముచ్యతే ఆసక్త ఫలరాగేణ
యత్వైదిక కర్మణి'' (శివగీత 16-7)

## 102. హర్యక్షః కకుభో వజ్రీ శతజిహ్వః సహస్రపాత్ ।
## సహస్రమూర్ధా దేవేంద్రః సర్వదేవ మయో గురుః ॥

835. హర్యక్షః : హర్యక్షః కేసరీ హరిః - సింహమువంటివాడు.

836. కకుభః : సర్వదిగ్రూపుడు. దిగంబరుడు. దిక్కులే అంబరముగా కలవాడు.

837. వజ్రీ : వజ్రాయుధమును ధరించినవాడు. పిడుగులు కురిపించువాడు. యదిదం కించ జగత్సర్వం ప్రాణఏజతినిః సృతం మహద్భయంవ్రజముద్యతం య ఏతద్విదురమృతాస్తేభవంతి. (కఠ.ఉప.2-3-2) (శి స.నా.972)

838. శతజిహ్వః : అనేక నాలుకలు కలవాడు. కేనేషితం వాచ మిమాం వదంతి. (కేన.ఉ)

839. సహస్రపాత్ సహస్రమూర్ధా : అనేక పాదములు అనేక శిరస్సులు కలవాడు. అన్ని ప్రాణులలోను జీవాత్మగాయుండువాడు శివుడే అందుచే అందరి నాలుకలు, శిరస్సులు, పాదములు అతనివే.

840. దేవేంద్రః - దేవేంద్రుడు కూడా శివుడే.

841. సర్వదేవమయః . సర్వదేవతా స్వరూపుడు.

842. గురుః : గురుస్వరూపుడు. గురవే సర్వలోకానాం । భిషజేభవ రోగిణాం । నిధయే సర్వవిద్యానాం, దక్షిణామూర్తయే నమః (వి.స నా.209)

## 103. సహస్రబాహు స్సర్వాంగః శరణ్యః సర్వలోకకృత్ ।
## పవిత్రం త్రికకున్మంత్రః కనిష్ఠః కృష్ణపింగళః ॥

843. సహస్రబాహుః : అనేక హస్తములు కలవాడు.

844. సర్వాంగః : సర్వమును పొందువాడు. ''సర్వం అంగాని ప్రాప్నోతీతి సర్వాంగః'' అన్ని సిద్ధులు కలవాడు (శి.స.నా.16)

845. శరణ్యః : ''శరణు జొచ్చినవారిని కాపాడువాడు. ''ప్రణమామి నమామి నమామి భవం భవజన్మకృతి ప్రణషూదనకమ్ గుణహీన మనంతమితం శరణం జనతారణ తారయ తాపిత కిం'' (మ.స్తవం.18)
త్వత్పాదాంబుజ మర్చయామి పరమం త్వాం చింతయామ్యన్వహం
త్వామీశం శరణం వ్రజామి వచసా త్వామేవ యాచేవిభో
వీక్షాం మేదిశ చక్షుషీం సకరుణాం దివ్యైశ్చిరం ప్రార్థితాం
శంభో లోకగురో మదీయ మనస సౌఖ్యోపదేశం కురు. (శి.ల.29)
ఏనాంసి మానసిక వాచిక కాయికాని । కుర్మస్తథాపి చరణం శరణం దదీథాః । యోదోషవంతమపి రక్షతి రక్షితాసౌ । కోవానరక్షతి నిరాగస మిందుమౌళే (బిల్హణస్తవం-6)
ఓ చంద్రశేఖరా! మనోవాక్కాయ కర్మలతో పాపము చేసినది వాస్తవమే. అయినను నీ పాదములను శరణుజొచ్చినాను. తప్పుచేసినవాణ్ణి కాపాడినవాడే నిజమైన రక్షకుడు. దోషములేని వానినెవరు బ్రోవరు?

846. సర్వలోకకృత్ : సకలలోక నిర్మాత.
త్వంపాసి హంసి విదధాసి తరస్కరోషి । ముక్తిం పరాం నయసి నిత్యమశేష లోకాన్ । సర్వప్రదోసి శివ సర్వ కరస్త్వమేవం । మత్వాऽవికల్పమితి జంతురలేపకఃస్యాత్ (మల్హణస్తవం-6).
ఓ సాంబ! నీవు సదా సమస్తలోకములను (అందులోని ప్రాణులను) రక్షించు చున్నావు. ఉపసంహరించుచున్నావు సృష్టించుచున్నావు. మాయం చేయు చున్నావు. శ్రేష్ఠమైన ముక్తినిచ్చుచున్నావు. సర్వమును నీవే చేయుచున్నావు. దీనిని తెలిసికొనిన మానవుడు నిర్లిప్తుడగుచున్నాడు.

847. పవిత్రః : ''ధ్యాతో దృష్టః కీర్తితశ్చస్తుతః సంపూజితః స్మృతః ప్రణతః పాప్మః సర్వానున్మూల్యాలయతి'' ఆయనను స్మరించిన మాత్రముననే పవిత్రులగుదురు. ఆయనే పవిత్రుడు. (శి.స.నా.50, 978)

848 త్రికకున్మంత్రః : మంత్రములన్నింటికి బీజము, శక్తి, కీలకములని ముఖ్య విభాగములు కలవు. వాటి స్వరూపుడు.

849 కనిష్ఠః అదితి కొడుకులలో చిన్నవాడైన వామనుడు ''నమః కనిష్ఠాయచ'' (రుద్రం) పరమశివుడు యువక బాలరూపముతో అతిసూక్ష్మ రూపముతో కనిష్ఠనామధారియై కళ్యాణకరుడగుచున్నాడు యువకుడైన కుమారస్వామి రూపమున తారకాసురుని సంహరించెను. బాలుడుగా దక్షిణామూర్తి రూపముదాల్చి సర్వ విద్యాదాత ఆయెను. బలరామునికి తమ్ముడుగా బాలగోపాలుడుగా గోవర్ధనగిరిధారి, కాళీయ మర్దనుడుగా, కంసారిగా ప్రఖ్యాతి వహించెను.

850. కృష్ణపింగళః · నలుపు తెలుపు వర్ణములు కలవాడు. పార్వతి : నలుపు, శివుడు: పింగళ (బంగారువన్నె) వర్ణము కలవాడు హరి, నీలవర్ణుడు, హరుడు తెల్లని (స్వర్ణ) ఛాయ కలవాడు. హరిహరాత్మక (లేక) అర్ధనారీశ్వర తత్త్వము, ''ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళం ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవై నమః'' (మహా నారా.ఉప)

## 104. బ్రహ్మదండ వినిర్మాతా శతఘ్ను పాశ శక్తిమాన్ ।
## పద్మగర్భో మహాగర్భో బ్రహ్మగర్భో జలోద్భవః ॥

851 బ్రహ్మదండ వినిర్మాతా : బ్రహ్మదండము అను ఆయుధమును నిర్మించిన వాడు

852. శతఘ్నుపాశ శక్తిమాన్ : ఒకేసారి నూరుమందిని హతమార్చగల శతఘ్ని మరియు పాశము, శక్తి మొదలగు ఆయుధములు కలవాడు

853. పద్మగర్భః . బ్రహ్మ.

854. మహాగర్భః : సకల చరాచరములను తనయందుంచుకొనినవాడు. (శి.స నా.639)

855 బ్రహ్మగర్భః : వేదగర్భితుడు.

856. జలోద్భవః : జలమయమైనప్పుడు పుట్టినవాడు, (మాయారూపముతో)

## 105. గభస్తిః బ్రహ్మకృత్ బ్రహ్మీ, బ్రహ్మవిత్ బ్రాహ్మణోగతిః ।
## అనంతరూపో నైకాత్మా తిగ్మతేజా స్వయంభువః ॥

857. గభస్తిః : మహాతేజోవంతమైన కిరణములు కలవాడు. కోటి సూర్యప్రభలతో వెలుగొందువాడు. (వి స నా 85.)

858 బ్రహ్మకృతః - వేదములను సృజించినవాడు. (వి.స.నా.663.)

859. బ్రహ్మ : వేదాధ్యాయి (వి.స.నా.669.)

860. బ్రహ్మవిత్ : వేదార్థమును తెలిసినవాడు (వి.స.నా.667.)

861 బ్రాహ్మణః : బ్రాహ్మణ స్వరూపి. (వి స.నా.668.)

862 గతిః : ప్రాప్తి స్థానమైనవాడు మానవుని చివరి మజిలీ (శి స.నా.169)

863 అనంతరూపః : ''యో రుద్రోఽగ్నౌ యో అప్సుయ ఓషధీషు యో రుద్రో విశ్వాభువనాఽఽవివేశ తస్మై రుద్రాయ నమోఽస్తు'' సృష్టిలోని రూపములుగల వస్తువులన్నియూ ఆయన రూపములే.

864. నైకాత్మనః : అనేక శరీరములను ధరించినవాడు. అవతారములన్నియూ ఆయనవే. అష్టవిధములుగా అయినవాడు. ''సాధకస్యతు లక్ష్యార్థం తస్యరూప మిదం స్మృతం'' భక్తుని భావనాసిద్ధికొరకు పరమేశ్వరుడీ మూర్తిరూపము ధరించును. ''ఉర్వీసమీర యజమాన జలానలార్క సోమాంబరాదిభిరహో భవతస్తమాభిః వ్యాప్తం సమస్త భువనం సమవేక్ష్య భగవాన్ । కుర్యాన్నకోఽత్ర భగవంస్త్వయి పక్షపాతః'' (మల్హణస్తవం-4)

శివుని దేహమందు మనవలె రక్తమాంసాదులుండవు ''సవీర్యమపి నిర్దేహం, మాంసాస్థిరుధిరంనచ, ఇంద్ర చాపవదాకాశే దర్పణేప్రతిబింబవతీ'' (వాతూలాగమము) శివుని అష్టమూర్తులనుకు ''వినాకాశం జగన్నేహవినా క్ష్మా, వాయునావినా తేజసా వారిణాచైవ యజమానేన భావినా భానునా శశినాలోకస్త స్త్యైతాస్తనవః ప్రభో, తదస్యదేవ దేవస్య మూర్త్యష్టకమయం జగత్'' (లింగపురాణం)

865. తిగ్మతేజః - స్వయంభవః : శివునితేజో పరాక్రమములచే బ్రహ్మాముగ్ధుడైనాడు. ''స్తవైర్బ్రహ్మాదీనాం జయజయవచోభిః (శి ల.) ''యత్తే తత్త్వం నిరుపధిపరం వాఙ్మనః పారభూతం బ్రహ్మాదీనామపి హరగిరస్తత్ర భూన్నాః ప్రవేష్టుం'' (హలాయుధ స్తవం-7). భక్తవత్సల శివా! నీ తత్త్వము వాక్కులకు, మానసములకు అందరానిది. అచింత్యమైనది. దీనిని వర్ణించుటలో బ్రహ్మాదుల వాక్కులుకూడ కుంఠితములైనవి.

## 106. ఊర్ధ్వగాత్మా పశుపతి ర్వాతరంహా మనోజవః । చన్దనీ పద్మనాలాగ్ర స్సురభ్యుత్తరణో నరః ॥

866 ఊర్ధ్వగాత్మా - దేశము కాలము వస్తువులచే పరిచ్ఛిన్నుడు కాక వాటికి అతీతుడై యుండువాడు. ''సభూతం విశ్వతోవృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులం'' (పురుషసూక్తం)

867 పశుపతిః మాయకర్మ గుణ దులచే కూడిన అజ్ఞానులు పశువులు. వారికి పతి పొట్టకూటి కోసం బ్రదికేవాడు పశువు వారిని సక్రమముగా నడిపించేవాడు పశుపతి 'నిత్యంస్వోదర పోషణాయ సకలా నుద్దిశ్య విత్తాశయా వ్యర్థం పర్యటనం కరోమి భవతస్సేవాం నజానేవిభో । మజ్జన్మాంతర పుణ్య పాకబలతస్త్వం శర్వ సర్వాంతర స్తిష్ఠం స్యేవహి తేన వా పశుపతే రక్షణీయో ఉస్మ్యహమ్ ॥ (శివా ల.57) పశుపతీ! మహేశ్వరా! నిత్యము నా ఉదరపోషణార్థమై ధనార్జనకై అందరి చుట్టూ తిరుగుతున్నాను. నీసేవ చేయనైతిని. నా జన్మాంతర పుణ్యపరిపాకవశమున నీవు సర్వాంతర్యామిగా నా అంతరమున యున్నావు కదా! అందుచేతనైనను నేను నీచే రక్షింపదగినవాడను.
నమో రుద్రేభ్యో హరికేశేభ్యః పశూనాంపతయే నమః
బ్రహ్మాది స్థావరాంశ్చ పశవః పరికీర్తితా' బ్రహ్మ మొదలు స్థావరములు ద్విపాత్‌లు చతుష్పాత్తులు అన్నియు పశువులే ఆయన పశుపతి (శి స నా.409)

868 వాతరంహాః · వాయువేగము కలవాడు

869. మనోజవః . మనోవేగము కలవాడు. (వి.స.నా 691)
అనేజదేకం మనసోజవీయో (ఈశ.ఉ 4) సర్వప్రాణులలోని చైతన్యము సర్వ వ్యాపారములను నడిపించే (శక్తి) వేగము - ఇదంతయు శివుని మనోవేగమే.

870. చందనీ చందనమును పూసుకొనినవాడు.

871 పద్మనాళాగ్రః : శరీరములోని సుషుమ్నానాడి బిసతంతువలె యుండును. కుండలిని శక్తి సుషుమ్న నాడిద్వారా సహస్రారమున జేరి సదాశివునితో ఐక్యమగును

872. సురభ్యుత్తరణః : కామధేనువుయొక్క దర్పము నణచినవాడు.
సురభి (కామధేనువు), మొగిలిపూవు, ఈరెండున్నూ స్త్రీలరూపము ధరించి శివదర్శనార్థమై వచ్చుచుండినారు. అదే సమయమున బ్రహ్మ, విష్ణువులకు శివుని ఆద్యంతములను దర్శించుటకై పందెము వేసుకొనిరి. బ్రహ్మ హంసరూపము ధరించి ఆకాశమున కెగిరెను. విష్ణువు వరాహరూపమును ధరించి క్రిందికిపోయెను బ్రహ్మ శివుని శిరస్సును చూచితిననెను. అందులకు కామధేనువు, తలతో చూచెననియు, తోకతో చూడలేదనియు సాక్ష్యము చెప్పెను అప్పుడు శివుడు సురభిని శపించెను. ఆమెతోకకే పూజ (నిద్ర లేవగానే గోవుముఖము చూడరాదు )

873. నరః : న రాతి ఆధత్తే ఇతినరః . దేనియందునురక్తి లేనివాడు. 2. నీటి యందుండువాడు. 3 శివుని ఆద్యంతముల తెలిసికొనగోరిన బ్రహ్మవిష్ణువుల రూపము గలవాడు. (శి.స.నా.723)

## 107. కర్ణికార మహాస్రగ్వీ, నీలమౌళిః పినాక ధృత్ ।
## ఉమాపతి రుమాకాన్తో జాహ్నవీధృ దుమాధవః ॥

874 కర్ణికార మహాస్రగ్వి : సహస్రారమందలి పద్మకర్ణికలో నుండు సదాశివుడు. 2. కర్ణికార పూలతో చేయబడిన హారము కలవాడు

875. నీలమౌళిః : నీలమణులు చెక్కిన కిరీటము కలవాడు.

876. పినాకధృత్ : పినాకమను విల్లును ధరించినవాడు

877. ఉమాపతిః : పార్వతీ పతి - శివపార్వతులు విడదీయరాని జంట భక్తరక్షణార్థముశివుడు పార్వతీదేవితో సన్నిధానము చేయును. (శి స నా.94)

878. ఉమాకాన్తః · ఉమయాదయైవ బ్రహ్మవిద్యయా, కాంతః, కామితః వశీకృతః, ఉమాకాంతః . బ్రహ్మవిద్యా స్వరూపిణియైన ఉమాదేవిచే కాంక్షింపబడి పొందబడిన మహేశ్వరుడు.

879 జాహ్నవీధృత్ : గంగను ధరించినవాడు. గంగ అనగా జ్ఞానము జ్ఞానాన్ని ధరించినవాడు. ''కస్యాపరస్య మకరాహత ఘోరనక్ర చక్రక్రమాత్ కమలలోల జలాచగంగా । ఖండేందు కోటి కరకోరక భారభాజి బభ్రామ బభ్రుణి జటాపటలే విమూఢా ॥ (మల్హణస్తవం-8)

ఓ పరమేశ్వరా! మొసళ్లచేత కొట్టబడిన, భయంకర నక్రములు (కుంభీరములు) పోరాడుట వల్ల, కమలములవలె చంచలమైన తనలోని జలములు ఉల్లోలకల్లోములగుచుండగా గంగానది భయంకరాకారము పొందినపుడు, బాలచంద్రుని శృంగములమండి వెలువడిన మల్లెమొగ్గలవంటి కిరణములుగల, బంగారువన్నె కలిగిన నీజడలలో తప్ప మరెవని శిరమునందు బద్ధమై నిరంతరము తిరుగుచు వసతి ఏర్పరచుకొనినది? (అట్టి విరాళమైన గంగను నీవు మాత్రమే జడలో అణచి దాచుకోగలిగితివి.)

వేగాకృష్ట గ్రహరవిశశి వ్యశ్నువానం దిగంతాన్ । న్యక్కుర్వాణం ప్రళయపయసా మూర్మిభంగావలేపం । ముక్తాగౌరం హర తవజటా బంధన స్పర్శి సద్రో । జజ్ఞే చూడాకుసుమ సదృశం వారి భాగీరథీయా : (అనామయస్తవము :12) హరా! వేగముతో లాగబడిన నక్షత్రములు, సూర్యచంద్రులు గల్గినట్టియు, దిక్కుల చివరవరకు వ్యాపించుచున్నట్టియు, ప్రళయకాలపు సముద్రజలముల యొక్క తరంగముల గర్వమును తిరస్కరించునట్టియు, ముత్యములవలె తెల్లని ఆ మహా గంగాజలమునీ జడలు సోకినంతనే ఒక చిన్నపుష్పమువలె శాంతముగనుండును. (గంగాధరుని కథ, రామాయణ, మహాభారథ, భాగవత, వాయు, బ్రహ్మ, విష్ణు పురాణాదులలో చూడవచ్చును.)

880. ఉమాధవః · పార్వతీ భర్త.

**108.** **వరోవరాహో వరదో వరేణ్యః సుమహాస్వనః ।**
**మహాప్రసాదో దమనః శత్రుహా శ్వేతపింగళః ॥**

881. వరో వరాహః : ఆదివరాహావతారమెత్తిన విష్ణువు శివుడే.

882. వరదః : వరః(శ్రేష్ఠః రూపైః నానావతారైః జగత్పాలయతీతి వరదః - శ్రేష్ఠమైన రూపములతో సమస్త జగత్తును పాలించువాడు.
త్వామారాధ్య త్రిదశపత యో భుంజతే రాజ్యలక్ష్మీం
భిక్షాభుక్ త్వం తదపిచ మహాదేవ శబ్దైక వాచ్యః
నైరాశిష్యం వరద పరమైశ్వర్య కోటిప్రతిష్ఠం
తచ్చేదస్తి త్వయి కిమపరైః ఫల్గుభిః శ్రీ విలాసైః (హలాయుధస్తవము-30)
ఓ వరదా! భక్తవత్సలా! దేవాధీశ్వరులైన ఇంద్రోపేంద్రులు నిన్ను కొలిచియే రాజ్యలక్ష్మిని అనుభవించుచున్నారు. ఐనను నీకే మహాదేవ శబ్దము సరిపోవుచున్నది నీవు భిక్షాన్నము తినెడివాడవు నీలోని వైరాగ్యము నిస్సారములైన సంపద్విలాసములకంటె శ్రేష్ఠమైనది కిం? వాటితో ప్రయోజనమేమి? (శి.స నా.6; వి.స నా.337)

883 వరేణ్యః .పూజింపదగినవాడు. ''ప్రభో, శూలపాణే, విభో, విశ్వనాథ మహాదేవ శంభో! మహేశ, త్రినేత్ర, శివాకాంత శాంత స్మరారే పురారే త్వదన్యో వరేణ్యో నమాన్యో నగణ్యః'' (శంకరాచార్య - వేదసారశివస్తుతి-9)

884. సుమహాస్వనః . గొప్పస్వరము కలవాడు.
గర్జత్ప్రచండ ఘన ఘర్ఘరమేఘసంఘ సంఘట్ట ఘోషఘన ఘోర రవేణ కోఽన్యః శ్వేతం నయంతమతి ఘోర కరాళ కాలం భస్మావశేష మకరోద్ధర - హుంకృతేన (మల్లణస్తవము-15)
శ్వేతుడను రాజు శివపూజ చేయుచుండెను. అప్పుడాతని ఆయుష్షు తీరి యముడు కాలపాశమును వేసి బలాత్కారముగా లాగుచుండెను. అప్పుడు శ్వేతుడు శివుని గూర్చి విలపించెను కరుణామయుడైన శివుడు తన హుంకారమాత్రమున యుముణ్ణే కాల్చి - శ్వేతుని రక్షించెను.
2. వేద గర్జితో హయగ్రీవః వేదముల ఘోషించు హయగ్రీవుడు.

885. మహాప్రసాదః చిత్తశుద్ధిని, స్వచ్ఛతను, శాంతిని, నిర్మలత్వమును ప్రసాదించువాడు. ''త్వత్ప్రసాదేవ నిత్యం భూయాద్భూయ స్తవ చరణయోర్భూయసీ భక్తిరేకా'' నీ కృపవలన నాకు నిత్యమూ మరల మరల నీ చరణము లందు ఏకాగ్ర భక్తియుండుగాక!''

886. దమనః . దమనంతో పూజింపబడువాడు. దండించువాడు.
జగతి తవశక్తి రతులా సకల జగద్ఘస్మరా యయాసపది
కాలోఽపి లీలయైవం, నయనానల శలభతాం నీతః (మలయరాజస్తవం-58)
లోకములో నీ శక్తిసామర్థ్యము అసమానమైనది. సకల లోకముల శిక్షింప సామర్థ్యము కల యమధర్మరాజును నీ కంటిమంటతో భస్మము చేసితివి.

887. శత్రుహా : ఈయన కామారి (మన్మథుని జయించినవాడు) కాలారి : యముణ్ణి శిక్షించినవాడు.

888. శ్వేత పింగళః : అర్ధనారీశ్వరుడు. దక్షిణభాగము కర్పూరగౌర వర్ణము వామభాగము కనక పింగళ వర్ణము.

## 109. పీతాత్మా పరమాత్మాచ ప్రయతాత్మా ప్రధానధృత్ ।
## సర్వపార్శ్వముఖస్త్ర్యక్షో ధర్మసాధారణో వరః ॥

889. పీతాత్మః : బంగారువన్నె శరీరము కలవాడు.

890. పరమాత్మః : అన్నింటికన్నా మిన్నయైన ఆత్మ గలవాడు
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః - యోలోక
త్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః (భ గీ.15-16)
ఈలోకమునగల క్షరమగుపదార్థములును, అక్షరమగు జీవాత్మ ఈ రెంటికీ అన్యుడై వేరుగాయున్న, అవ్యయుడై, ఈశ్వరుడై నాశరహితుడును అయి, బ్రహ్మాండమంతయు వ్యాపించి దానిని ధరించియున్నాడో అట్టి ఉత్తమ పురుషుడు పరమాత్మ అనబడుచున్నాడు (వి స.నా 11)

891 ప్రయతాత్మః : పరిశుద్ధమనస్కుడు.

892. ప్రధానధృత్ : ప్రధానమనగా ప్రకృతి : అట్టి ప్రకృతికి ఆధారభూతుడు
ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామం మిమంకృత్స్నం అవశః ప్రకృతేర్వశాత్ భ గీ 9-8
ప్రకృతికి అధీనమై అస్వతంత్రమైన సకలభూత సంఘాన్నీ స్వాధీనంలో ఉంచుకొన్న నా ప్రకృతితో మళ్లీ మళ్లీ సృష్టిస్తుంటాను

893 సర్వపార్శ్వముఖః : తత్పురుషమను ముఖము తూర్పువైపు 2. అఘోర మనునది దక్షిణపువైపు 3. సద్యోజాతమనునది పడమరవైపు 4. వామదేవ మనునది ఉత్తరపువైపు 5. సదాశివము ఊర్ధ్వమువైపునయున్నవి. అన్ని దిక్కులా ముఖము కలవాడు.

894 త్ర్యక్షః . సూర్యచంద్రాగ్నినేత్రుడు.

''అప్యాయనస్తమోహర్తా, విద్యయాదోషదాహకృత్, సోమసూర్యాగ్ని నయన స్త్రినేత్రస్తేన శంకరః'' సత్త్వరజస్తమో గుణములచే వ్యాపించిన సర్వ విశ్వదోషములను సూర్యచంద్ర అగ్ని రూప త్రినేత్రములతో సాకల్యముగ నవలోకించు సామర్థ్యము శివునికే కలదు. జగత్తులోని ద్వంద్వములను చూచుటకై రెండు కన్నులు, ఆధ్యాత్మను చూచుటకై జ్ఞాననేత్రమును కలిగియున్నాడు. ఆయన విరూపాక్షుడు, విషమాక్షుడు.

895. ధర్మసాధరణో వరః : పుణ్యానుగుణమైన ఫలము నిచ్చువాడు. కర్మఫల ప్రదాత.

## 110. చరచరాత్మా సూక్ష్మాత్మా అమృతో గో వృషేశ్వరః ।
## సాధ్యర్షి ర్వసురాదిత్యో వివస్వాన్సవితా మృతః ॥

896. చరాచరాత్మా · స్థావర జంగమాత్మకమైన విశ్వరూపుడు.

897. సూక్ష్మాత్మః : అన్నింటిలోనూ సూక్ష్మముగా యుండువాడు. మయి సర్వమిదం ప్రోతం సూత్రామణిగణానివ. (భ గీ.7-7)
దారం హారంగా మణులను కలిపినట్లే సమస్త జగత్తునీ ధరిస్తున్నాను.

898. అమృతాయ గోవృషేశ్వరః : నిష్కామ ధర్మమునకు మోక్షరూపమైన ఫలము నిచ్చువాడు. ''మాం పూజయతి నిష్కామ స్సర్వదా జ్ఞానవర్జిత. సమేలోకం సమాసాద్య భుంక్తె భోగాన్యధే ప్సితాన్ । జ్ఞాత్వామాం పూజయేద్యస్తు సర్వకామ వివర్జితః మయా సమానస్సన్మమలోకే మహీయతే'' (శివగీత.13-3)
ఐదు విధములైన మోక్షములు కలవు. 1.సాలోక్యము, 2.సారూప్యము, 3.సార్ష్టి, 4.సాయుజ్యము, 5.కైవల్యము. వానిలో సారూప్యమోక్షము కలుగుతుంది.

899. సాధ్యర్షః · దేవతలకు సాధ్యులకు ఆచార్యుడు. ఆయన జగద్గురువు.

900. వసురాదిత్యః : అదితి పుత్రుడగు వసువుయొక్క రూపము గలవాడు.

901. వివస్వాన్ సవితామృతః : కిరణములతో శోభించు జగత్తును సృష్టించు అమృత స్వరూపుడైన సోముడు ''సోమస్య వివస్వత్వం అమృతత్వంచ జ్ఞేయం తేవ త్రిపదమేకం నామం'' విశేషణ వస్తే అచ్ఛాయదత్యనేన భువనమితి వివః : అంశుజాలం తత్వాన్ సూయతే ఇతిసవితా (సోముడు? సూర్యుడు?)

## 111. వ్యాస స్సర్గస్సు సంక్షేపో విస్తరః పర్యయోనరః ।
## ఋతుసంవత్సరో మాసః పక్షస్సంఖ్యా సమాపనః ॥

902. వ్యాసః : పురాణేతిహాస కర్త : ''అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ''

903. సర్గః సుసంక్షేపో విస్తారః : వేదములను విభజించినవాడు. వాటిని సంక్షిప్తముగ సూత్రములుగను, పురాణములుగ విస్తరించి శిష్యప్రశిష్యులకు బోధించిన వాడు.

904. పర్యయోనరః : అంతటనూ వ్యాపించిన సమష్టిరూపుడు.

905. ఋతుః : ఋతుస్వరూపుడు (వి.స.నా.416)

906 సంవత్సరః : సంవత్సర స్వరూపుడు. (వి.స.నా.422)

907. మాసః · మాసస్వరూపుడు.

908. పక్షః : పక్షస్వరూపుడు

909. సంఖ్యా సమాపనః : అయనములను, పక్షములను లెక్కించుటకు అనుగుణముగ మకర, కటక సంక్రమణములు, అమావాస్య, పౌర్ణమి మొదలగు పుణ్యసమయములు శివునిరూపమే.

## 112. కలా కాష్ఠాలవామాత్రా ముహూర్తాహః క్షపా క్షణాః ।
## విశ్వక్షేత్రం ప్రజాబీజం లింగమాద్యస్తు నిర్గమః ॥

910. కలాః : (సంవత్సర స్త్వమృత వో మాసోమాసార్థ మేవచ, యుగానిమేషాః కాష్ఠాశ్చ నక్షత్రాణి గ్రహబలాః) 30 కాష్ఠములు ఒక కల

911. కాష్ఠా : 18 నిమిషములు.

912. లవాః : నళినీ పత్ర సంహత్యాః సూక్ష్మ సూచ్యవిభేదనే దలే దలేతు యః కాలః సకాలో లవవాచకః. తామరాకులను కట్టకట్టి సన్నిటి సూదితో ఆ ఆకులను గ్రుచ్చినచో ఒక్కొక్క ఆకు బాగా సూది దిగుటకు ఎంతకాలము పట్టునో ఆ సమయము లవము
అట్టి 30 లవములు 30 ఒక త్రుటియగుచున్నది.

913. మాత్రాః :ఇదియు కాలమందలి స్వల్పభాగమే.

914. ముహూర్తః : 12 క్షణములు ఒక ముహూర్తము.

915. క్షణః : 30 కలలు ఒక క్షణము ( త్రుటి)

కలాముహూర్తాః కాష్ఠాశ్చ హోరాత్రశ్చ సర్వశః అర్ధమాసా మాసా జాతవః సంవత్సరచ్చ కల్పతాం (మ.నా ఉ) (అను-8వ మంత్రము) ఆదిత్యాదిగ్రహ పరికరో యాతి చాయాతి నిత్యం। కాలశ్చాయం దివసరజని పక్షమాసర్తు చిహ్నః। ఏతత్సర్వం నను నఘటతే ప్రేరకత్వం వినాతే।
కార్యే చాస్మిన్నపునర పరస్యాస్తి సామర్థ్యమేతత్. (హలాయుధస్తవము-12)
మహేశా! ఈ సూర్యాది తారా నికరము వచ్చుచు పోవుచున్నది పగలు, రేయి, నెల, పక్షము, ఋతువులు గలకాలము కూడా అటులే పరుగిడు చున్నవి. సర్వనియామకుడగు నీయాజ్ఞ లేకయే ఇదంతయు జరుగుట అసంభవం. ఈ యద్భుత కార్యము నొనర్చుటకు నీవు తప్ప మరియొకడు శక్తుడా!

916 విశ్వక్షేత్రః : బ్రహ్మండ వృక్షస్య ఆలవాలం చిన్మాత్రం.
ప్రపంచముద్భవించుటకు మూలస్థానమైనవాడు, జగద్యోని

917. ప్రజాబీజః : ప్రజానాం బీజం మాయా విశిష్ట చైతన్యరూపం అవ్యక్తం : మాయతోకూడిన చైతన్యస్వరూపుడు.

918. లింగః · సంకేతము - మహత్తనబడు తత్త్వము
''లీనం విలీనమపి సర్వజ్ఞ త్వాద్గచ్ఛ త్యవగచ్ఛతి జానాతీతిలింగః''
లీనమైనదానిని తెలుసుకొను సర్వజ్ఞుడు కావున లింగం.

919. ఆద్యోనిర్గమః . ప్రపంచతోత్పత్తికి అంకురము వంటివాడు.

## 113. సదసద్వ్యక్తమవ్యక్తం పితామాతా పితామహః।
## స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం త్రివిష్టపం ॥

920, 921 సత్ అసత్ :
ఇదం రూపం రూపం సదసదమమలం రూప మితిచే । న్నజానే
రూపం తత్పరమ మవిభిన్నం పరతరం। యతోనాన్యద్రూపం
నిరతమపి వేదైర్నిగదితం । నజానే సర్వాత్మన్ క్వచిదః నమో నంత శివే
(విష్ణుకృత శివస్తోత్రం-15)

దేశకాల నిమిత్తములచే పరిచ్ఛిన్నమైన ప్రతిపదార్థము నిరంతరము ఏకరసముగాని ఏకరూపముగాని లేకుండుటచే నాశవంతమైనది. అశాశ్వతమైనది మిధ్యలేక అసత్ అనబడుచున్నది. కానీ అట్టి పరిచ్ఛేద రహితమైనది నిరంతరము ఏకరసముగా యుండు అవినాశి, నిర్వికారియైనది సత్ అనబడును ఇట్టి సదసద్రూపములు రెండున్నూ శివుని రూపములే
(శి స.నా.657, 658)

922. వ్యక్తః : ఇంద్రియ గోచరమైనది. ప్రకటము, తెలిసినది, కనబడునది, స్పష్టమైనది, స్థూలప్రకృతి

923. అవ్యక్తః : ప్రకటముకానిది, తెలియబడనిది, అస్పష్టమైనది. మూలప్రకృతి : ఈ అవ్యక్తము సర్వమునకు ఆధారముగాయున్నది. అదియే అక్షరము అనియు, పరబ్రహ్మమనియు, పురుషోత్తముడనియు పిలువబడుచున్నది. సృష్టి సమయమున అవ్యక్తమునుండియే సకల చరాచర జగత్తు ఉత్పత్తి అగుచున్నది ప్రళయమందు ఈ జగత్తంతయు అవ్యక్తమందే లీనమగుచున్నది పరస్తస్మాత్తు భావోన్యోఽవ్యక్తో ఽవ్యక్తాత్సనాతనః । యస్స సర్వేషు భూతేషు నశ్యత్సునవినశ్యతి ॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాంగతిమ్ । యం ప్రాప్యనని వర్తంతే తద్ధామ పరమం మమ. భ గీ 8-20-21.

924. పితా తండ్రి - మాతాపితాచ నేతా భూతానా మంతరగం విజ్ఞాతా । సాంబ నిఖిలేష్ట దాతాలోకానాం త్వమసి ముక్తి సంధాతా ॥

925. మాతా : తల్లి.

926. పితామహః - తాత. బ్రహ్మ. (శి.స.నా.386)

927. స్వర్గద్వారః : ఇష్టాపూర్తానికర్మాణి మత్త్వైత్యైకురుతే నరః యజ్ఞ యాగాది క్రతువులు, ఇష్టాపూర్తాదులచే పుణ్యకర్మలచే స్వర్గమునకు పోవుచున్నారు. ఆస్వర్గద్వారములు శివుడే.

928. ప్రజాద్వారః : ప్రజోత్పత్తికి, అవిచ్ఛిన్నముగా సమాజము అభివృద్ధి చెందుటకు, ''అపుత్రస్యగతిర్నాస్తి'' వంశాభివృద్ధి చెందుటకు, పితృదేవతలకు పిండాదుల ప్రదానమునకు- వేదవిహిత సంస్కారముల చేయుటకు సంతానాభివృద్ధి కొరకు ప్రజాద్వారము అవసరము. ఆద్వారము కూడా శివుడే.

929. మోక్షద్వారః : ఆ బ్రహ్మ భువనాల్లోకా పునరావర్తినో అర్జునః అన్ని లోకములందలి వాసము తాత్కాలికమే. తిరిగి దిగిపోవలసినదే. పరమేశ్వర సాయుజ్య ముక్తినొందిన వారికి పునర్జన్మ లేదు. అదే మోక్షము. ''యస్తు విజ్ఞాన వాన్భవతి అమనస్కస్సదాశుచిః సతుతత్పద మాప్నోతి యస్మాద్భూయో నజాయతే'' - జ్ఞానముచే అమనస్కుడు, శుచియు అగునతడు జన్మములేని పదమును పొందును. (శి.గీ.12-23)

930. త్రివిష్టపః : స్వర్గహేతువైన ధర్మము : వేదములలోనున్న కర్మలు స్వర్గ మార్గములు.

## 114. నిర్వాణం హ్లాదనశ్చైవ బ్రహ్మలోకః పరాగతిః ।
## దేవాసుర వినిర్మాతా । దేవాసుర పరాయణః ॥

931. నిర్వాణం : ''అహం నిర్వికల్పో నిరాకారరూపో । విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణాం నచాసంగతంనైవ నముక్తి ర్నమేయః । చిదానందరూప శ్శివోఽహం శివోఽహమ్'' (నిర్వాణషట్కం-6) నేను సంకల్ప వికల్పములు లేనివాడను. నేను నిరాకారుడను. నేను అంతటా వ్యాపించియుండువాడను. నేను సర్వేంద్రియములకు ప్రభుడను నేను సంగములేనివాడను. నేను నిత్యముక్తుడను. చిదానందరూపుడగు శివుడను నేను. ఇదే అద్వైతస్థితి :

932. హ్లాదనః : ఆనందపరచువాడు · నిరంతర బ్రహ్మధ్యానమువలన అన్య వస్తువులు నశించి బ్రహ్మస్వరూపుడగుచున్నాడు. ''పరమ ప్రేమాస్పదత్వ మానం దత్వం'' = ప్రేమకు నిరంతర తృప్తికి ఆస్పదస్వభావం ఆనందత్వం = ఎక్కడ అన్యపదార్థాల అంతరాయం లేదో, ఎక్కడ అన్యభావాల అంకుశం లేదో, ఎక్కడ అన్యవ్యాపారాల అవస్థలులేవో, ఎక్కడ తనలో తానే చూచుకొని ఆనందించే స్వభావమున్నదో - అదే ఆనందత్వం. (త్రిశతి శంకరభాష్యంలో) ''బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి'' ''బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి'' అధికమైన అనంతమైన ఉత్తమమైన బ్రహ్మానందమునుభవించుచున్నది. ''యస్య బ్రహ్మణిరమతే చిత్తం నందతి నందతి నందత్యేవ''-
''ఏషహ్యేవానంద యాతి'' (తై. ఉప.)

933. బ్రహ్మలోకః : బ్రహ్మలోకమనగా సత్యలోకము'' - ఛాయాతపయోరివ బ్రహ్మలోకే'' (కఠ. ఉప.3-3-5). బ్రహ్మలోకమునందు ఆత్మదర్శనము. సుస్పష్టము అయిననూ అచట చూడబడునది, చూచువాడు, చూచుట అను త్రిపుటి ఉంటుంది. క్రమముక్తిలో బ్రహ్మలోకము దాటినచో కైవల్యము అక్కడికి పోయినవాడికి పునర్జన్మ యుండదు కానీ - కైవల్యమునందు కొనుటకు కొంతకాలమచ్చట యుండవలయును.

934 పరాగతిః : పరమశివుడే పరమగతి. సర్వోత్కృష్టమైన మోక్షస్థానము. క్రమముక్తి చేతగానీ, సద్యోముక్తివల్లగానీ చేరవలసినది ఆ పరమ పదమే. ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః అనేక జన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిం (భ.గీ.6-45)
యోగసిద్ధికి ఒక జన్మ చాలదు. అనేక జన్మల పూర్వసంస్కారముచేత తీవ్ర ప్రయత్నము చేతనే లభించును. అతడే పరాగతి:-
''పురుషాన్నపరం చిత్సాకాష్ఠా సా పరాగతిః'' (కఠ. ఉప.1-3-11)

935. దేవాసుర వినిర్మాతః : దేవదానవులను సృష్టించినవాడు.

936. దేవాసుర పరాయణః : దేవదానవులకు ఆశ్రయమైనవాడు.
= అభయం, సత్త్వసంశుద్ధి, జ్ఞానయోగ వ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవం
అహింసా సత్యమక్రోధః త్యాగశ్శాంతి రపైశునం
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలం
తేజః క్షమా ధృతిశ్శౌచం అద్రోహో నాతిమానితా (భ.గీ.16-1-3)
ఈ ఇరవై ఆరు సుగుణాలు దేవతలవి .
దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ అజ్ఞానం చాభి జాతస్య పార్థా సంపదమాసురీం (భ.గీ.16-4). పైన చెప్పిన దైవగుణాలకు వ్యతిరేకమైనవన్నియును, దంభము, దర్పము, అభిమానం, క్రోధము, కఠినత్వము ఇవి కలిగినవారు అసురులు. ఈ ఇరువర్గాలకు సృష్టించినది శివుడే. వారిరివురికీ ఆశ్రయమైనవాడూ శివుడే.

## 115 దేవాసుర గురుర్దేవో దేవాసుర నమస్కృతః ।
## దేవాసుర మహామాత్రో దేవాసుర గణాశ్రయః ॥

937 దేవాసురగురుః 938. దేవః 939. దేవాసుర నమస్కృతః 940. దేవాసుర మహామాత్రః 941. దేవాసుర గణాశ్రయః = దేవతలకు గురువు బృహస్పతి, అసురులకు గురువు శుక్రుడు. ఇద్దరూ శివస్వరూపులే. వారిచేత ఆరాధింపబడినవాడూ శివుడే = సకల జీవులయందు జీవాత్మగా (ఆత్మజ్యోతిగా) ప్రకాశించువాడూ ఆయనే. (విష్ణువు, శ్రీకృష్ణుడు, ఇంద్రుడూ = దేవతలు. రావణుడు, బాణుడూ అసురులు చేసిన శివ స్తోత్రములు ఈనాటికీ ప్రఖ్యాతములే). దేవాసురులలో జ్యేష్ఠుడు. అందుచేతనే క్షీరసాగర మథనమప్పుడు దేవదానవులు శివుని సన్నిధికి వచ్చి ''స్వామీ! నీవు మాకందరికంటే జేష్ఠుడవు సముద్రంలో ఇప్పుడు హాలాహలము పుట్టినది. నీవు పెద్దవాడివి కావున ''జ్యేష్ఠభాగంగా'' దానిని నీవే స్వీకరించాలి'' అని మొరపెట్టుకున్నాడు. ఆయన దానిని స్వీకరించి వారి ప్రాణాలను రక్షించాడు. దేవదానవ గణాలన్నింటికీ ఆశ్రయుడు శివుడే.

## 116. దేవాసుర గణాధ్యక్షో దేవాసుర గణాగ్రణీః ।
## దేవాతిదేవో దేవర్షి ర్దేవాసుర వరప్రదః ॥

942. దేవాసుర గణాధ్యక్షః : దేవగణములకు అధిపతి అయిన ఇంద్రుడు; అసురులకు అధిపతి అయిన విరోచనుడూ శివస్వరూపులే.

943. దేవాసుర గణాగ్రణీః దేవసేనాధిపతియగు కార్తికేయుడు , అసుర సేనాధిపతి యగు కేశియును రుద్రమూర్తులే

944. దేవాతిదేవః దేవతలు ఇంద్రియములు ఇంద్రియాతీతుడు

945 దేవర్షిః : దేవఋషి అయిన నారదుడు.

946. దేవాసురవరప్రదః : దేవతలకు అసురులకు ఇద్దరికీ - ఏ పక్షపాతమూ లేక వరములనిచ్చువాడు. అర్జునునికి పాశుపతాస్త్రమునిచ్చినాడు. కౌరవపక్షమున నున్న సైంధవునికీ, అశ్వత్థామకూ వరములనిచ్చినాడు

## 117. దేవాసురేశ్వరో విశ్వో దేవాసుర మహేశ్వరః ।
## సర్వదేవమయోఽచిన్త్యో దేవతాత్మాఽఽత్మ సంభవః ॥

947. దేవాసురేశ్వరః : దేవదానవులను శాసించువాడు.

948 విశ్వః సకల చరాచర విశ్వమంతయు నితడే (వి.స.నా 1)

''ఉపసంహర సర్వాత్మన్ విశ్వరూప మిదంతవ ప్రతీతం జగదైకాత్మ్యం శంభో భవదనుగ్రహాత్'' = నీ విశ్వరూపాన్ని ఉపసంహరింపుము నీవు జగదాత్మ స్వరూపుడవని నీ అనుగ్రహం వల్ల తెలుసుకొన్నాను'' శివ గీత. 13-39.

949. దేవాసుర మహేశ్వరః : సర్వజీవాంతర్యామిగా దేవాసురుల హృదయమందు వసించుచు వారిని నియమించువాడు. ''ఏకోదేవస్సర్వభూతేషు గూఢస్సర్వ వ్యాపే సర్వభూతాంతరాత్మా । సర్వాధ్యక్ష స్సర్వ భూతాధివాసస్సాక్షీచేతాః కేవలో నిర్గుణోహం'' (శివగీత.12-39)

950. సర్వదేవమయః : దేవతలందరూ ఇతని అంగములుగా యున్నారు.

951. అచింత్యః : యతో వాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ : శివతత్త్వము మనస్సున కందనిది. భావాతీతమైనది. ''సర్వస్యధాతార మచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. (శి.స.నా.997.)

''అచింత్య రూపమవ్యక్త మనంత మమృతం శివం । ఆది మధ్యాంతరహితం ప్రశాంతం బ్రహ్మకారణం'' (శి.గీ.12-26)

952. దేవాత్మనః : దేవతలకు ఆత్మగాయుంటున్నాడు. వారి ప్రకాశము ప్రభావము పరాక్రమము, విజయము అన్నియు ఇతనివల్లనే కలుగుచున్నవి.

953. ఆత్మసంభవః : స్వయంభువు.

**118. ఉద్భిత్త్రివిక్రమో వైద్యో విరజో నీరజోఽమరః ।**
**ఈడ్యో హస్తీశ్వరో వ్యాఘ్రో దేవసింహో నరర్షభః ॥**

954 ఉద్భిత్ · అవిద్యను భేదించి ప్రకాశమానుడగువాడు.

955. త్రివిక్రమః · బలి చక్రవర్తినణచుటకు విశ్వరూపుడై భువన భువనాంత రాళముల వ్యాపించిన వామనావతారుడితడు.

956. వైద్యః : విద్యావంతుడు. సర్వవిద్యానాం వేదతత్త్వాద్వైద్యః · సర్వవిద్యలకు నిధి. ''నిధయే సర్వవిద్యానాం'' భవరోగములకు వైద్యుడు

957. విరజః నిర్మలమైనవాడు,

958. నీరజః . రజోగుణరహితుడు.

959. అమరః నాశరతిహుతుడు. (శి స.నా.-280)

960. ఈడ్యః పూజార్హుడు.

961. హస్తీశ్వరః · శ్రీకాళహస్తీశ్వరుడగు వాయులింగరూపి.

962. వ్యాఘ్రః : పెద్దపులివంటివాడు. వ్యాఘ్రేశ్వరలింగరూపుడు.

963. దేవసింహః : దేవతాశ్రేష్ఠుడు.

964 నరర్షభః : పురుషోత్తముడు.

**119. విభుదోఽగ్రవరః సూక్ష్మః సర్వదేవస్తపోమయః ।**
**సంయుక్త శ్శోభనో వజ్రీ ప్రాసానాం ప్రభవోఽవ్యయః ॥**

965. విబుధః . శ్రేష్ఠమైన బుద్ధిగలవాడు.

965. అగ్రవరః · యాగములందు తనదే అగ్రస్థానము.

967. సూక్ష్మః : అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మ ప్రత్యయసారం శాంతం శివమద్వైతం. (మాం.ఉప.)

పరమసూక్ష్మమైనవాడు : సూక్ష్మబుద్ధిగలవాడు

968. సర్వదేవః : సర్వదేవతా స్వరూపుడు.

969. తపోమయః : మూర్తీభవించిన తపస్సు కలవాడు.

''తపోరూపం తపోబీజం తపోధనం వరం । వరం వరేణ్యం వరదమీడ్యం సిద్ధగణైర్వరైః''.

970 సంయుక్తః : మిక్కిలి జాగరూకుడుగా అన్ని విషయముల గమనించువాడు. ఏయుక్తిచే చిత్తమునకు సమత్వము ప్రాప్తమగునో అదియోగము 1 కర్మయోగము, 2. ఆత్మజ్ఞానముయొక్క, శ్రవణ, మనన సనిధిధ్యానము, సాంఖ్యయోగము, ధ్యానము, జ్ఞాన, భక్తి మొదలగు యుక్తులు కలవాడు వాటికి అధిపతి.

971. శోభనః : కళ్యాణుడు : మంగళ స్వరూపుడు; సిరిసంపదలు, ఆరోగ్యము, వర్చస్సు, ఐశ్వర్యము, విజయము మొదలగు శుభములను ప్రసాదించువాడు కళ్యాణతమం యత్తేరూపం పశ్యామి (ఈ.ఉప.16) పరమేశ్వరా! నేను నీ యొక్క అత్యంత మంగళకర రూపమును దర్శించుచున్నాను.(శి.స నా.445)

972. వజ్రీ : వజ్రాయుధమును ధరించిన ఇంద్రుడు (శి.స నా 837)

973. ప్రాసానాంప్రభవః ప్రాసములను ఆయుధములకు ఉత్పత్తి స్థానమైనవాడు. (శి.స.నా.349)

974. అవ్యయః · అనన్యభక్తి ఏకాగ్ర చిత్తముతో లభ్యపడువాడు (శి.స నా.349; వి.స నా.900)

## 120. గుహః కాన్తో నిజస్సర్గః పవిత్రం సర్వపావనః ।
## శృంగీ శృంగప్రియో బభ్రూ రాజరాజో నిరామయః ॥

975. గుహః : అగోచరుడు. (శి.స.నా.261)

976. కాన్తః : కస్య సూకస్య అంతఃసీమా ఆనందస్య పరాకాష్ఠేత్యర్థః. ఆనంద పారావారమైన వాడు. బ్రహ్మానందమును మించిన ఆనందమేలేదు

977. నిజాయసర్గః · సృజయిత ఇతి సర్గః . తస్యవిశేషణం నిజః స్వస్మాదనన్యః. ఇతని పుట్టుకకు - తరులు కారకులు కారు. స్వయంభువు. తనకంటే అన్యుడు లేడు. ''మత్తః పరతరం నాస్తి'' (భ.గీ.)

978. పవిత్రః : పవిర్ = వజ్రం తత్తుల్యం, మృత్యుః : దుఃఖం తస్మాత్ త్రాయత ఇతి పవిత్రం : పిడుగువంటి మరణమునుండి కాపాడువాడు. (శి స.నా 50, 487, వి.స.నా.63.)

పవిత్రంచ పవిత్రాణాం - మంగళానాంచ మంగళం.

979 సర్వపావనః : అన్నింటినీకూడ శుద్ధిచేయువాడు.

980. శృంగి : కొమ్ములుగల ప్రాణులు, శిఖరములు కల పర్వతములు, స్థావర జంగమ స్వరూపుడు (వి స.నా.798)

981. శృంగప్రియః : పర్వత చరియలందు ప్రీతి కలవాడు.

982 బభ్రుః · యోలోకత్రయ మాశ్రిత్య బిభర్త్యవ్యయ ఈశ్వరః · ఈశ్వరుడు ముల్లోకములను వ్యాపించి వాటిని భరించుచున్నాడు బిభర్తశేష భూతాని యోంతశ్చరతి సర్వదో శక్తిర్మాహేశ్వరి తుభ్యం తస్మై వాయ్వాత్మనే నమః (19-బ్రహ్మకృతస్తోత్రంమత్స్యపురాణం)

983 రాజరాజః కుబేరుడు రాజాధిరాజాయ ప్రసహ్యాసాహినే నమోవయంవై శ్రవణాయ కుర్మహే .

984 నిరామయః ఏ దోషములు లేనివాడు.

## 121. అభిరామ స్సురగణో విరామస్సర్వసాధనః । లలాటాక్షో విశ్వదేవో హరిణో బ్రహ్మవర్చసః ॥

985 అభిరామః . మనోరంజకుడు . ఆహ్లాదము కలిగించువాడు. ''త్వత్పదమయూఖ రాశిస్తనుతే చిత్రం వియర్ఝురీలీలాం । నిత్యానందోద్వేలాం నిర్మగ్న నిలింపతను మాలాం''

986. సురగణః : దేవగణములు సాత్త్విక స్వభావమునాశ్రయించి నిశ్చల మనస్సుతో ఈశ్వరుని భజించుచున్నారు. అట్టి దేవతాగణ స్వరూపి, మహాత్మానస్తుమాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః భజన్త్యనన్యమానసో జ్ఞాత్వాభూతాది మవ్యయమ్ (భ.గీ 9-13)

987. విరామః · సంసార బంధములతో విసిగి వేసారిన వారికి తుది ఆశ్రయ రూపుడు. ఇంద్రియములను విషయములనుండి మరలించి సుఖదుఃఖములకు లోనుగాక నిశ్చలముగా యుండువాడు. నిస్సంగత్వము, నిర్మోహత్వము, నిశ్చలతత్త్వమును అందుకొనినవాడు. ''త్వమేకోలోకానామధిపతి రుమానాథ జగతాం శరణ్యః ప్రాప్యస్త్వం జలనిధి రివానంత పయసాం త్వదన్యో నిర్వాణం నవితరతి నిర్వాణపతి రప్యతస్సర్వోత్కృష్ట స్తమసిహి నమో నీప్యశివతే॥'' (విష్ణుకృత స్తుతిః 33). (వి.స.నా : 394)

988. సర్వసాధనః · సమస్తమైన ఆశ్రమ కర్మలు తనను చేరు సాధనములుగా గలవాడు. విధినావిధినావాపి భక్త్యా యెమా ముపాసతే తేభ్యః ఫలం ప్రయచ్ఛామి ప్రసన్నోఽహం నసంశయః (శి గీ. 12-7) విధిగా గానీ, అవిధిగా గానీ భక్తితో నన్నుపాసించువారలకు ఫలములనొసంగెదను సందేహము లేదు

989 లలాటాక్షః : నుదట కన్నున్నవాడు. ''జగత్ సృష్టం పూర్వం యది శివముమాకాంత సతతం । త్వయా లీలామాత్రాత్తదపి సకలం రక్షిత మభూత్ తదేవాగ్రే ఫాలప్రకట నయనాగ్న్యాద్భుత కణై । ర్జగద్దగ్ధ్వాస్థాస్వజహారనఘా వర్త్య శివతే ॥

990 విశ్వదేవః ''విశ్వైర్బ్రహ్మాండ కందుకై దివ్యత క్రీడఇతి'' - బ్రహ్మాండములను బంతులవలె దివ్యముగా ఆడుకొనెడివాడు - (శి స నా 604)

991. హరిణః · బంగారు వన్నెకలవాడు జింక స్వరూపి (శి.స నా 752)

992 బ్రహ్మవర్చసః విద్యాధిక్యతవలనను, తపోమహిమవలనను, బ్రహ్మవర్చస్సు కలవాడు చిత్స్వరూపుడు. తేజోమయుడు

## 122. స్థావరాణాం పతిశ్చైవ నియమేంద్రియ వర్ధనః ।
## సిద్ధార్థ స్సిద్ధ భూతార్థో౽ చిన్త్యః సత్యవ్రతశ్శుచిః ॥

993 స్థావరాణాం పతిః హిమాలయమువంటివాడు స్థావరాణాం హిమాలయః (భ.గీ 10-25)

994 నియమేంద్రియ వర్ధనః ఇంద్రియ నియమము (నిగ్రహము) పరమాత్మ దయవలననే కలుగుచున్నది

మనసు ధనాగమవ్య పగమ వ్యసనంబులయందు వాక్యముల్
ధనిక జనస్తవక్రమముల౯, గరముల్ దరుణీ కుచాగ్రమ
ర్దన విధులందు నేటికిని దార్కొనుచుండు నిను౯ దలంపని
న్వినుతి యొనర్పని౯గొలువ వేడ్క యొనర్పవవే మొ యీశ్వరా
(ఆంధ్ర బిల్హణస్తవము . 35)

అంతరింద్రియములు, బహిరింద్రియములన్నియు నా అదుపులో లేవు. నీవే వాటిని నిగ్రహించు ప్రభూ! అని వేడుకొంటున్నారు.

''రోసీ రోయదు కామినీ జనుల తారుణ్యోరు సౌఖ్యంబుల౯
బాసీపాయదు పుత్రమిత్ర జనసంపద్భ్రాంతి వాంఛాలతల్
కోసీ కోయదు నామనంబకట నీకుంబ్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు - దీనిత్రుళ్లణపవే - శ్రీ కాళహస్తీశ్వరా''.
(ధూర్జటి : శ్రీ కాళహస్తీశ్వర శతకము . 32)

995. సిద్ధార్థః . ''నిత్యసిద్ధ ఏవమోక్షః యస్యసః'' మోక్షము ఇతనికి కరతలామలకము (చేతిలోని నెల్లికాయ) (2) ధర్మార్థకామమోక్షములు చతుర్విధ పురుషార్థములను ఇచ్చువాడు.

జ్ఞానం త్రికాల విషయా గగనే చరత్వ । మైశ్వర్యమష్టగుణితం శ్రవణంచ దూరాత్ । ఉత్క్రాంతి ముక్తి - పరకాయ ప్రవేశౌ । శంభో భవంతి భవినాం భవతః ప్రసాదాత్ (మల్హణస్తవం - 23) శంభో : సుఖసాగరా! భూత భవిష్యద్వర్త మానముల జ్ఞానము, ఆకాశగమనము, అణిమాది సిద్ధులు,

స్వచ్ఛంద మరణము, పరకాయ ప్రవేశములవంటి మహాసిద్ధులు నీ వల్లనే కలుగుచున్నవి. (శి.స నా. 130, 343)

996. సిద్ధ భూతార్థః పరమార్థమైన మోక్ష సిద్ధికి సాధనమైనవాడు శివశ్శంభు శ్శివ శ్శంభు శ్శివ శ్శంభు శ్శివశ్శివః । ఇతివ్యాహరతో నిత్యం దినాన్యాయాంతు యాంతుమే

997. అచింత్యః : చింతించుటకు వీలుపడనివాడు. ''తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిదముపాసతే'' (కేన ఉప)

అచింత్యా ప్రమేయంచ వ్యక్తా వ్యక్త పరంచయత్ - సూక్ష్మాత్ సూక్ష్మ పరంజ్ఞేయం తన్మే శివ సంకల్పమస్తు (శివ సంకల్పం). నిరామయాయ, నిర్మలాయ, నిర్లోభాయ, నిర్మదాయ, నిశ్చింతాయ, నిరహంకారాయ, నిరంకుశాయ, నిష్కళంకాయ, నిర్గుణాయ, నిష్కామాయ, నిరుపప్లవాయ, నిరవద్యాయ, నిరంతరాయ, నిష్కారణాయ, నిరాతంకాయ, నిష్ప్రపంచాయ, నిస్సంగాయ, నిర్ద్వంద్వాయ, నిరాధారాయ, నీరాగాయ, నిష్క్రోధాయ, నిర్మలాయ, నిష్పాపాయ నిర్భయాయ, నిర్వికల్పాయ, నిర్భేదాయ, నిష్క్రియాయ, నిస్తులాయ నిరంజనాయ'' (శివకవచం) అటువంటి స్వరూపం.

''యోనధియామధిగమ్యస్తస్య కుతస్సంభవోగిరాంవృత్తేః
స్తౌమితథాపి భవంతం మనోరథో యాత్యభూమిమపిః
(మలయరాజస్తవం - 11)
ఆ భగవంతుడు సునిశిత బుద్ధికి అందడు. అట్టివానిని శబ్దముల శక్తితో కనిపెట్టుట అసంభవమే. ఐనను భగవాన్! నిన్ను స్తోత్రము చేయుచున్నాను. మానవులు అందరాని వానిని కోరుట సహజమే. (శి.స.నా. 951; వి.స.నా.833)

998. సత్యవ్రతః : సత్యమనగా బ్రహ్మము. దానినే వ్రతముగా గలవాడు. (2) చెప్పినదానిని చేయుటే వ్రతముగా కలవాడు. ''శరణాగతా నశరణాన్ మరణభయాభిద్రుత దయయా రక్షామ్యహం'' ''నేను నన్నాశ్రయించిన వారిని, మరణభీతులను అనాధులను తప్పక రక్షింతును'' అని ప్రతిజ్ఞ పూనిన వాడు. ''నమే భక్తః ప్రణశ్యతి'' నా భక్తులకు నాశము లేదు. ''సకృదేవ ప్రపన్నాయ అహమస్మీతి యచతే...''

(2) త్రికాలాబాధ్యమైనది, శాశ్వతమైనది, నిర్వికారమైనది సత్యము. అట్టి పరబ్రహ్మము నుపాసించెడివారలకు పునరావృత్తి రహిత మోక్షము నొసగువాడు. (శి.స.నా. 528)

999. శుచిః : నిర్మలుడు. (ప్రేతావాసః శయన మశనంభైక్షమాశాశ్చ వాసః ఖట్వాంగంచ ధ్వజముపహితం త్వష్టినేపధ్య మంగే, యద్యప్యేవంతదపి భగవన్నీశ్వరేతస్య నామ్నో నిస్సీమాన్య ష్వమసి విషయో నా పరః కశ్చిదస్తిః. (హలాయుధస్తవము 330 = ఈశా! వల్లకాటిలో పడక; భిక్షాహారము, దిక్కులే గుడ్డలు, మంచంకోడు ఆయుధం, ఎముకలే అలంకారము. ఇవన్నియు అశుచి పదార్థములు. కానీ నీ ఒక్కడవే ఈశ్వరుడవు. అటువంటివాడు మరొకడులేడు. (వి.స.నా. 156, 251; శి.స నా.551)

**123.** **వ్రతాధిపః : పరంబ్రహ్మ, భక్తానాం పరమాగతిః ।**
**విముక్తోముక్త తేజాశ్చ శ్రీమాన్ శ్రీవర్ధనో జగత్ ॥**

1000. వ్రతాధిపః : ఆయావ్రతములకు అధిపతియై ఆయా వ్రతముల ఫలదాత.

1001. పరం : అన్నింటికీ పరమైనవాడు. విశ్వతైజస ప్రాజ్ఞోపయో అపర బ్రహ్మభ్యః పరంతురీయం శివాఖ్యం, శివమద్వైతం చతుర్థం మనంతే, జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థల కతీతుడైన అద్వయుడైనవాడు శివుడు. ''పరాత్పరతరం బ్రహ్మ తత్పరాత్పరతోహరిః యత్పరాత్పరతో ధీశః తన్మేశివ సంకల్పమస్తు (శివ సంకల్పం)

1002. బ్రహ్మః : ''దేశతః కాలతో వస్తుతశ్చ పరిచ్ఛేద శూన్యం''
నేహనానాస్తి కించన ఇతిశ్రుతే ర్విశ్వాదీనాం అనృతత్వేన
స్వగత భేదస్వాభ్యభావాత్ అఖండైక రసంవస్తుతన్మాత్రం''
దేశకాల వస్తువులచే పరిచ్ఛేద్యుడు కానివాడు. అతనికన్నా మరొకటి ఏదియూలేదు. స్వజాతి; స్వగత, విజాతీయ భేదములు లేనివాడు. అంతటా వ్యాపించి యుండువాడు. నామరూపములు లేవు. కానీ వ్యవహారము కోసం బ్రహ్మమంటున్నాము - (శి.స.నా.385)

1003. భక్తానాం పరమాగతిః : భక్తుల గమ్యస్థానము.
దివమధిరోహతు ధరణీ । తారానికరోపి లురతు భూమితలే
నతు తవచరణ స్మరణం మోఘమమోఘ స్మృతేర్భవతి ।
(మలయరాజస్తవము 54)
ఒకవేళ భూమి ఆకాశమును ఎక్కునుగాక; భూమిపై చుక్కలు రాలుగాక! నీ చరణ, కీర్తన మెప్పటికి నిస్సారముకాదు. నీవు స్తుతినంది ప్రత్యుపకార మొనర్చుట ప్రసిద్ధము కదా!
నిన్నున్నమ్మిన రీతి నమ్మనొరులన్ నీ కన్న నా కెన్నలే
రన్నదమ్ములు తల్లిదండ్రులు గురుండా పత్సహాయుండు నా

యన్నా యెన్నడు నన్ను సంసృతి విషాదాం భోధి దాటించియ
చ్చిన్నానంద సుఖాబ్ధి దేల్చెదొకదే । శ్రీ కాళహస్తీశ్వరా! (ధూర్జటి )
సర్వధర్మాణ్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః (శి.గీ 14-43;
భ.గీ.18-66)

1004. విముక్తః : సంసార బంధములనుండి పూర్తిగా విడువబడినవాడు. మనల్ని ముక్తులను చేయువాడు

1005. ముక్తతేజః : తేజః పదేనాత్ర లింగ శరీరముచ్యతే. తేజః అనుపదము లింగ శరీరమును సూచించును సూక్ష్మ కారణ శరీరములు రెండునూ లింగశరీరమనబడును ఆ లింగశరీరమే జీవులకు ఉపాధియగుచుండును. దానినుండికూడా విముక్తి కలిగించువాడు.

1006. శ్రీమాణ్ . యోగైశ్వర్యయుక్తుడు : భగవానుడు.
శాఠ్యేన యేఽపి భగవంత మనంత శక్తిం ।
శంభో భవంతమభవం భవినో నమంతి ।
తేఽ ప్యంధకార మతిఘోర కృతాంతదంత ।
యంత్రాంతరాళ గహనం నపుర్విశంతిః (మల్హణస్తవం : 7)
శంభో! చిదానందరూపా! ఇచ్ఛాక్రియా జ్ఞానశక్తులవంటి అనంత శక్తులు కలవాడవును. జన్మరహితుడవును. భగవంతుడవును (షడ్గుణైశ్వర్య సంపన్నుడు) అగు నిన్ను యే ప్రాణులు, కాపట్యముతోనైననూ మొక్కుచున్నారో వారుకూడా, అతి భయంకరమైన యముని దంతములనెడి యంత్రము యొక్క మధ్యగల గుహను మరల ప్రవేశింపరు - ''అనాదరేణ, శాఠ్యేన పరిహాసేన మాయయా నమస్కారే కృతే లింగే సర్వపాపహరోహరః''

1007. శ్రీ వర్ధనః : తనను కొలుచువారలకు అష్టైశ్వర్యములను ఇచ్చువాడు. వాటిని వృద్ధి చేయువాడు.

1008. జగత్ : ''ఆత్మైవేదం సర్వం, బ్రహ్మైవేదం సర్వం, తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి, అయమాత్మాబ్రహ్మ ఇత్యాది శాస్త్ర సిద్ధం బ్రహ్మాద్వైతం ప్రతిపాదితం భవతి ఇతి శివమ్'' ఇదంతయు ఆత్మయే. ఇదంతయూ బ్రహ్మమే. అది నీవే. నేను బ్రహ్మముగా నున్నాను. ఈ ఆత్మ బ్రహ్మము'' మొదలగు శాస్త్ర సిద్ధ వచనములచే బ్రహ్మాద్వైతము నిర్దేశింప బడుచున్నవి.

ఈ జగత్తంతయు తానే అయినవాడు. జగత్తునందు అనేక కోట్ల బ్రహ్మాండములున్నవి. అవన్నియు శివుడే.

యో రుద్రో అగ్నౌ యోఅప్సుయఓషధీషు యోరుద్రో విశ్వాభువనా వివేశ తస్మైరుద్రాయ నమో అస్తు.
యేనేదం విశ్వం జగతో బభూవ యేదావాపి మహతో జాతవేదాః తదే వాగ్ని స్తద్వాయుస్తథ్సూర్యస్తదు చంద్రమా స్తన్మే శివ సంకల్పమస్తు
యేనద్యౌః పృథివీ చాన్తరిక్షంచ యేపర్వతాః ప్రదిశోదిశశ్చ తేనేదం జగద్వ్యాప్తం ప్రజానాం తన్మే శివసంకల్పమస్తుః
ఈశావాశ్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్ (ఈ . ఉప 1)

ఈ అనేకత్వంతో కూడిన చలనాత్మకమైన జగత్తంతా పరమేశ్వరునిచే వ్యాపించబడియున్నది. జగత్తులోని అన్ని పదార్థములలోను (1) అస్తి : ఉనికి : సత్ (2) భాతిః ప్రకాశము, చిత్ : (3) ప్రియం, సంతోషం, ఆనందం, (4) రూపం (ఆకారము) (5) నామం : పేరు అను ఐదు అంశలు కలవు. అన్ని పదార్థములలోని నామరూపములనబడు రెండు అంశలు నశించును గానీ, సత్, చిత్, ఆనంద అంశములకు నాశనము లేదు. పరబ్రహ్మము పరిపూర్ణుడు గనుకను, జగద్వ్యాపకుడు కావునను. ఆ సచ్చిదానందమునకు భంగము లేదు. ఇట్లే జగత్తంతయు పరమేశ్వరునిచే వ్యాపించబడియున్నవి. ఈ జగత్తంతయు భగవత్స్వరూపమే. అంతయు శివమే.

శివుడు ప్రకృతియను శక్తితో కూడియున్నాడని భావము. జగత్తే శక్తి. శక్తిలేని వాడు శివుడేకాడు. శివునితో నుండనిది శక్తే కాదు. ఇదియే పరమేశ్వరుని అర్థనారీశ్వర తత్త్వము.

శివాభిన్నమైన జగత్తులేదు శివుడే జగత్తు.

శ్రీ శివసహస్రనామస్తోత్రం, వ్యాఖ్యానం సమాప్తం.



# శ్రీ అర్ధనారీశ్వర స్తోత్రమ్

చాంపేయగౌరార్ధ శరీరికాయై కర్పూర గౌరార్ధ శరీరకాయ
ధమ్మిల్లకాయైచ జటాధరాయ నమశ్శివాయై చ నమ శ్శివాయ.

కస్తూరికా కుంకుమచర్చితాయై చితా రజఃపుంజ విచర్చితాయ
కృతస్మరాయై చ వికృతస్మరాయ నమశ్శివాయై చ నమ శ్శివాయ.

ఝణత్క్వణత్కంకణ నూపురాయై పాదాబ్జరాయ త్ఫణి నూపురాయ
హేమాంగదాయై చ భుజగాంగదాయ నమ శ్శివాయై చ నమ శ్శివాయ.

విశాలనీలోత్పల లోచనాయై వికాసి పంకేరుహ లోచనాయ
సమేక్షణాయై చ విషమేక్షణాయ నమ శ్శివాయై చ నమ శ్శివాయ.

మన్దారమాలా కలితాలకాయై కపాలమాలాంకిత కంధరాయ
దివ్యాంబరాయై చ దిగంబరాయ నమ శ్శివాయై చ నమ శ్శివాయ.

అంబోధర శ్యామలకుంతలాయై తటిత్ప్రభా తామ్ర జటాధరాయ
నిరీశ్వరాయై చ నిఖిలేశ్వరాయ నమ శ్శివాయై చ నమ శ్శివాయ.

ప్రపంచసృష్ట్యున్ముఖ లాస్యకాయై సమస్తసంహారక తాండవాయ
జగజ్జనన్యై చ జగదేక పిత్రే నమ శ్శివాయై చ నమ శ్శివాయ.

ప్రదీప్తరత్నోజ్జ్వల కుండలాయై స్ఫురన్మహా పన్నగభూషణాయ
శివాన్వితాయై చ శివాన్వితాయ నమ శ్శివాయై చ నమ శ్శివాయ.

ఏత త్పఠే దష్టక మిష్టదం యో భక్త్యా స మాన్యో భువి దీర్ఘ జీవీ
ప్రాప్నోతి సౌభాగ్య మనంతకాలం భూయా త్సదా తస్య సమస్తసిద్ధిః

ఇతి శ్రీ శంకరాచార్యకృతం అర్ధనారీశ్వర స్తోత్రమ్